# మంచి మర్యాద



## వాసమూర్తి






తెలుగు వెలుగు ప్రచురణలు
'శ్రీవాణి' 1-8-702/105 నల్లకుంట
హైదరాబాదు - 500 044

మొదటి ముద్రణ : వేయి ప్రతులు
ఆగస్టు 1985

ముద్రణ :
సువర్ణ ముద్రణాలయ
నల్లకుంట, హైదరాబాదు-44



టైటిలు :
బాలాజి ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు-20

వెల : [redacted] రూ॥ 12/-

ప్రతులు ఈక్రింది చోట్ల పొందవచ్చు :
నవోదయ పబ్లిషర్స్
విజయవాడ-520 002

సాహిత్య నికేతన్
బర్కత్‌పురా, హైదరాబాద్-500 027
ఏలూరురోడ్డు, విజయవాడ-520 002

# ముందు మాట

డేల్ కార్నెగి ఇంగ్లీషులో రాసిన 'హౌ టు విన్ ఫ్రెండ్స్ అండ్ ఇన్‌ఫ్లుయెన్స్ పీపుల్' అన్న పుస్తకం నాకు నచ్చినవాటిలో ఒకటి. అలాంటి పుస్తకం తెలుగులోకూడా వస్తే మంచిదనిపించింది నాకు. చివరికి ఆ పుస్తకంనుంచి పొందిన స్ఫూర్తితోనూ, ఇదివరలో కొన్ని పత్రికలకు నేను రాసిన వ్యాసాలు ఆధారంగానూ, మరెంతో విషయం చేర్చి ఈ పుస్తకం రాయడానికి సాహసించాను. ఇప్పుడది మీ చేతిలో ఉంది. దాని బాగోగులు నిర్ణయించవలసినది మీరు. కాని ఈ ప్రయత్నం మీకు ఉపదేశమివ్వడానికి కాదు. ఈ రచయిత మీకన్నా గొప్ప అనుభవమూ, జ్ఞానమూ ఉన్నవాడూ అని భావించక, మీతో సమానమైనవాడే, తనకి తెలిసిన కొన్ని విషయాలు ఒక మిత్రుడిలా మీకు తెలియ బరచడమే అతని ఉద్దేశ్యమని గుర్తించి మరీ ముందుకు సాగండి. ఇందులో చెప్పిన సూచనలు మీరు యథాతథంగా ఆమోదించనవసరం లేదు, కూడదుకూడా. మీ మనస్సు ఉపయోగించి, మీ అనుభవం ఆధారంగా చేసుకొని మీరు ఏ నిర్ణయాలైనా తీసుకోండి. ఆ నిర్ణయాలు తీసుకోవడంలో ఈ పుస్తకం ఏమాత్రమైనా తోడ్పడితే ఈ రచయిత కృతకృత్యుడైనట్లే భావించుకుంటాడు.

పుస్తకంలో అక్కడక్కడ అధ్యాయాల చివర కొన్ని సూక్తులున్నాయి. వాటిని ఒకమారు పరిశీలించండి.

పుస్తకం ముద్రణలో ఊహించని ఇబ్బందులు ఎదురై చావు తప్పి కన్ను లొట్టపోయినట్లయింది. దాని ప్రభావం పుస్తకం ముద్రణ మీద ఉంది. పాఠకులు క్షమిస్తారనే ఆశిస్తున్నాను.

వాసమూర్తి

# విషయసూచిక

1

# సర్దుకు పోవడం

చాలా యేళ్ళ క్రితం ఒకనాడు నేను రేడియోలో ఒక తమాషా నాటకం విన్నాను.

నాటకం ఇలా ప్రారంభమవుతుంది :

ఒక పెద్దమనిషి దారిన పోతూ ఉంటాడు.

హఠాత్తుగా పక్కమేడవాళ్ల ఆల్సేషియన్ కుక్క గేటులో నుంచి ఆయన దగ్గరికి పరుగెత్తుకు వస్తుంది. ఆయన కంగారుపడి చేతిలోని గొడుగుతో దానిని బెదరించబోతాడు. దానితో అది మరీ భీకరంగా మీదికి వస్తుంది భౌభౌ మంటూ. ఆయన పరుగెత్తుతాడు. అది వెంటాడుతుంది.

అది ఆయన కాలుపట్టుకునే సమయానికి దాని యజమాని 'టైగర్ టైగర్! కమ్ బాక్, కమ్ బాక్ యూ ఫూల్!' అని కేకేస్తాడు. అది వెనక్కి తిరుగుతుంది. దాని యజమాని దానిని పట్టుకు తీసుకుపోవడానికి ఎదరకు వస్తాడు.

దారిన పోతున్న ఆమనిషి అతని మీదికి విరుచుకు పడతాడు. కుక్కల యజమానుల మితిమీరిన అహంకారమూ గురించి నానా మాటలు అంటాడు. దానితో కుక్కయజమాని మండిపోయి మాటకు మాట అంటాడు. 'ఎందుకయ్యా అట్లా వాగుతావు! మాకుక్క నిన్ను కరచి

లేదుకదా ! చాలామంది మనుషులకన్న దానికే ఎక్కువ తెలివి ఉంది. దొంగల్నీ దుష్టుల్నీ తప్ప ఎవరినీ కరవదు. పిరికివాళ్లని చూస్తే మాత్రం దాని కసహ్యం !-' వగైరా వగైరా రోడ్డుమీద జనం చేరతారు. కొందరు మొదటి ఆసామి పక్షం వహిస్తారు. మేడలో వాళ్లు కొందరు తమ మనిషి సమర్థనకు పరుగెత్తుకు వస్తారు. మాటలు పెరుగుతాయి. చొక్కాలు పట్టుకు లాగడం వరకూ వస్తుంది. చివరికి రెండు మూడు దెబ్బలు కూడా పడతాయి. ఇంతలో మరి కొందరు ఎలాగో రెండు పక్షాల్నీ విడదీస్తారు. పోలీసులకి ఫిర్యాదు చేసి, అవసరమైతే కోర్టుకి కూడా వెళ్లి ఒకరి అంతు ఒకరు చూస్తామని ప్రతిజ్ఞలు చేసి ప్రతిద్వంద్వులు విడిపోతారు.

నాటకం అయిపోలేదు. మళ్ళీ మొదటికే వస్తుంది.

ఆ పెద్ద మనిషి దారిన పోతూ ఉంటాడు.

హఠాత్తుగా కుక్క అతని మీదికిరావడం .... యజమాని కుక్కను కేకేసి దానిని పట్టుకు పోవడానికి ఎదరకి రావడంవరకు మొదటిసారిలాగానే నడుస్తుంది.

కాని ఇక్కడినుంచి నాటకం ఈ మారు మరోరకంగా నడుస్తుంది.

కుక్క యజమాని ఆ పెద్ద మనిషి దగ్గరికి పరుగెత్తివచ్చి "క్షమించండి, క్షమించండి, కరవలేదుకదా!" అని ఆయన చేతులు పట్టుకుంటాడు దాంతో మొదట ఆయన కొద్దిగా శాంతించి "కరవలేదులెండి, కాని కంగారు పడ్డాను. ఇట్లాంటి భయంకరమైన కుక్కని స్వేచ్ఛగా వదిలేస్తే-" అని అంటూండగానే "క్షమించండి మేమట్లావదిలేయ్యమండి ఎప్పుడూగొలుసుకట్టే ఉంచుతామండి, ఏదో ఏమరుపాటున తప్పించుకు వచ్చేసింది మీకు కలిగిన ఇబ్బందికి చాలా విచారిస్తున్నానండి. ఒకసారి మా యింటికి రండి, కాస్త

'టీ' పుచ్చుకొని వెళ్దురుగాని రండి ప్లీజ్" అని ఒత్తిడి చేస్తాడు. మొదటి ఆసామి ఆయనతో కూడా నడుస్తాడు. ఇద్దరూ పరస్పర పరిచయాలు చేసుకుంటారు. కావలసిన వారూ స్నేహితుల్ని గురించీ మాట్లాడుకోవడంలో ఎక్కడో గొలుసు కలుస్తుంది. ఇంకేం, మిత్రులైపోరు. క్రమంగా మైత్రి బాంధవ్యంగా కూడా మారుతుంది.

"మీకే ముగింపు నచ్చింది" అని అడుగుతాడు ప్రయోక్త. అంతే నాటకం.

రెండో ముగింపు చప్పగా ఉంది, మొదటిది ఉత్సాహంగా ఉంది అంటే అనవచ్చు. సాధారణంగా పోట్లాటలూ, కొట్లాటలూ చూడడానికి వినోదంగా ఉంటాయి కదూ ? రోడ్డు పక్కన ఇద్దరు నువ్వా నువ్వా అనుకుంటూంటే నిమిషాలమీద జనం గుమిగూడడం తరుచు చూస్తూనే ఉంటాం. పొరుగింట్లో భార్యాభర్తలు కానీ, అత్తా కోడళ్లు కానీ పోట్లాడుకుంటూంటే చుట్టుపక్కలవాళ్ళు అన్ని పనులూ ఆపేసుకుని ఖర్చులేని వినోదం ఆనందిస్తారు.

ఇక్కడ మనం ప్రేక్షకులుగా మాట్లాడటం లేదు. మనమే అటువంటి సన్నివేశంలో ఇరుక్కున్నామనుకోండి స్థాన బలిమి మనకి ఉండో మనవాళ్ళు తగినంత మంది కూడా ఉండో, లేక అనుకోనివిధంగా నలుగురి నుంచీ సమర్థన లభిస్తేనో తప్ప అలాంటి స్థితిలో ఇరుక్కున్నందుకూ అది అందరూ చూస్తుండగా జరిగినందుకూ వేడి చల్లారిన తరువాత మనం సిగ్గుపడిపోతాము. పైగా అవతలివాడు చదువూ సంస్కృతీ లేనివాడనుకోండి, వాడు పోయేటంత దూరం మనం పోలేము, వాడు తిట్టే బూతులతో పోటీ పడలేం, మనమే అవమానకరంగా వెనక్కి తగ్గవలసివస్తుంది. అంతే కాదు, ఈమధ్య చిన్న తగాదాలు కూడా ఇట్టే కత్తిపోటు సంఘటనలుగా

పరిణమిస్తున్నాయి. కాల్చిపారేసిన సిగరెట్టు పీక కోసం, కిళ్ళీకొట్టు దగ్గర అర్థ రూపాయి బాకీకోసం, పిల్ల కోసం హత్యలు జరిగిన సంఘటనలు పత్రికలో మనం చదువుతున్నాం.

మనం బ్రతకాలి, ఇతరుల్ని బ్రతకనివ్వాలి. కేవలం బ్రతకడమే కాదు, సుఖసంతోషాలతో బ్రతకాలి. కాని ఈ బ్రతుకు మనది మాత్రమే కాదు. చుట్టుపక్కల వారి జీవితాలతో అది ముడిపడి ఉంది. అందువల్ల మనం సుఖసంతోషాలతో బ్రతకాలంటే మనం వ్యవహరించే వారితో - ఇంట్లోవారైనా, పరాయి వారైనా - మంచిగా ఉండాలి. మంచి మంచిని పెంచుతుంది. చెడు చెడుని పెంచుతుంది. అవతలివారు ఒకమాట అన్నారని మనం వెంటనే రెండు మాటలతో జవాబిచ్చామంటే అది అతి త్వరగా మాటకు మాటగా ఆపై తిట్లుగా పెరిగిపోతుంది. కానిఒక మంచి మాట వేడెక్కిన వాతావరణంలో చల్లని జల్లులా పనిచేస్తుంది. అవతలివాడు కోపంతో గర్జిస్తున్నా, తిట్లతో పేలినా మనం శాంతంగానే, సౌమ్యంగానే వ్యవహరించమనుకోండి అవతలి వాడి దూకుడు తగ్గడానికీ, వాడు కూడా శాంతంగా వ్యవహరించడానికీ అవకాశమిస్తుంది. మనం శాంతంగా వ్యవహరిస్తున్నా అతని జోరు తగ్గలేదనుకోండి. అయినా మనం మరి కొంత సేపు ఓపికపడితే కలిగే నష్టం ఏమీ లేదు. అందువల్ల మనకే లాభం. అవతలి వాడు అదే మూడుతో ఎక్కువ సేపు ఉండలేడు. కొంత సేపటికైనా వాడు కొంత తగ్గవలసివస్తుంది. అప్పుడు మనం హాస్యంగా ప్రారంభిస్తే వాడు చిత్తైపోతాడు. ఎందుకంటే వాడు వాగి వాగి అలసి ఉంటాడు, మనం తాజాగా ఉంటాము. మనశక్తి అంతా అలాగే ఉంది, అవతలివాడి దానిలా వ్యర్థం కాలేదు. జపానీస్ 'జూజిట్సు' అనే పోరాటపు పద్ధతిలో దాడిచేసే వాడిని బాగా అలసి పోనిచ్చి అప్పుడు ఎదురుదెబ్బ కొడతారు. 'స్ప్రింగు' ఉందనుకోండి, అది ఏమాత్రం ఒత్తిడికి

లొంగకుండా ఇంచు మించుగా కడ్డీలా ఉందనుకోండి, అది ఇచ్చే ఎదురు తన్ను (రికాయిల్) ఏమీ ఉండదు అదే చప్పగా ఉండి నొక్కితే అలాగే ఉండి పోయేదైనా ఎందుకూ పనికిరాదు కాక 'స్ప్రింగ్' మంచి 'టెంపర్' ఉన్నదనుకోండి. సాధ్యమైనంత ఒత్తిడికి తట్టుకుంటుంది. విడిచిపెట్టగానే దాని 'రికాయిల్' తూటాని చాలా దూరం, చాలా వేగంగా తీసుకుపోతుంది. గురిసరిగా ఉంటే గుండు లక్ష్యాన్ని దూసుకుపోయితీరుతుంది. అందువల్ల శాంతంగా నిగ్రహంతో వ్యవహరిస్తుంటే లాభం పొందేది మనమే. పేచీ పెరగనే పెరగదు. మొగ్గలోనే తుంచివేయడం జరుగుతుంది. ఒక వేళ అలా కాక అవతలి వాడు ముష్కరుడై పేచీ మరి కొంత సాగితే మనం ఓపిక పట్టడం ద్వారా చివరి దెబ్బ, తిరుగులేని దెబ్బ, మనదే అవుతుంది. అదే కాదు మనం ఏ బస్సులోనో ఏ దుకాణం దగ్గరో ఘర్షణలో చిక్కుకున్నామనుకోండి. మనమూ అవతలివాడు తిట్టుకొంటూ ఉంటే, కొట్టుకుంటూ ఉంటే చుట్టూ జనం చేరి టికెట్టు కొనసక్కర్లేకుండా లభించే వినోదం ఆనందిస్తారు. అలా కాక అవతలివాడు ఎంత దురుసుగా వ్యవహరిస్తున్నా మనం ఎంతో ఓపికతో శాంతంగా వ్యవహరిస్తున్నామనుకోండి అప్పుడు చుట్టుపక్కల వారు చూస్తూ ఊరుకోరు, మనపక్షానికి వచ్చేస్తారు. మనబలం పెరుగుతుంది. ఇది నిజమో కాదో మీరే పరిశీలించండి.

ఇంతకీ ఘర్షణలు వస్తే ఎలా ఎదుర్కోవాలా అన్నది మన ప్రధాన విషయం కాదు, మనం మన యింట్లో మన చుట్టుపక్కలా బయట సమాజంతో ఎలా వ్యవహరించాలా అన్న దాని గురించే మనం ఆలోచిద్దాము. ఘర్షణలు మనకి పరీక్ష వంటివి. అవి అప్పుడప్పుడు ఎదురవుతాయి. కాని మామూలుగా మనం ఎలా వ్యవహరిస్తాం అన్నదే మనకి ముఖ్యం. దాని బట్టే పరీక్షలు ఎదురైతే ఎలా వ్యవహరిస్తామన్నది కూడా ఆధారపడి ఉంటుంది.

అందువల్ల మనం మనచుట్టూ ఉన్న మనుష్యులతో ఎలా వ్యవహరిస్తున్నామో పరిశీలించుకొని, ఆవ్యవహారంలో ఏమైనా లోపాలూదోషాలూకనిపిస్తే వాటిని పరిహరించుకొని, మంచి పద్ధతులు అవలంబిస్తే మన జీవితాలు సుఖమయం చేసుకోగలుగుతాం, చుట్టు పక్కలవారి జీవితాలు కూడా కొద్ది మేరకు సుఖమయం కావడానికి తోడ్పడతాం. దీనినే మానవ సంబంధాలు అనవచ్చు. అసలు సమాజంలో అశాంతికీ, అల్లకల్లోలానికీ సగం వరకు కీలకం ఇక్కడే ఉందంటే అతిశయోక్తికాదు. పొరుగువాడితో మన సంబంధాలకీ ప్రపంచ శాంతికీ సంబంధమేమిటి అని ఆశ్చర్యపోవచ్చుకాని కొద్దిగా సంబంధం ఉందనే చెప్పాలి.

చూడండి, కొందరు 'ఈ సమాజం చెడిపోయిందయ్యా, దీని నుద్ధరించటం నావల్లకాదు' అని రోజుకి పాతిక సార్లు సమాజానికి సీళ్లు వదిలేస్తుంటారు కదూ, కాని సమాజం అలా చెడిపోవటానికీ, బాగుపడక పోవడానికీ, వారికికూడా బాధ్యత ఉందంటే వారు తారాజువ్వల్లా లేస్తే లేపవచ్చు కాని అందులో యథార్థం ఉంది, ఎందుకంటే సమాజం వంటిది మనం కళ్ళతో చూసే ఇళ్లూ,చెట్లూ,కొండలూ నదులూలా సాకారమైన వస్తువేమీకాదు. అది అలాంటి దైతే వరహావతారం కథలో హిరణ్యాక్షుడు భూమిని చుట్ట చుట్టి పట్టుకుపోయి సముద్రంలో దాచినట్లు ఈ పాటికి ఎవడో దానిని పట్టుకుపోయి తన స్టీల్ ఆల్మైరాలో దాచేసుకునేవాడు. సమాజమంటే మనుష్యులే. మనుష్యుల వ్యవహారంలోనే సమాజం దర్శనమిస్తుంది. మరి మీరూ నేనూ మన చుట్టుపక్కల వాళ్ళూ అందరమూ మనుష్యులమే కదా. మనం మంచి చేస్తే సమాజంలో మంచి పెరిగినట్లూ, చెడు చేస్తే సమాజంలో చెడు పెరిగినట్టే కదా.

'ఆఁ ఇవన్నీ కబుర్లు, మనమెంత సముద్రంలో కాకిరెట్టంత! మన మొక్కళ్ళం మడికట్టుకు కూర్చుంటే ఏమవుతుంది ? చూస్తున్నాం కదా!

ఏ ఆఫీసులోనో ఏ అమాయకపు గుమాస్తానో తన మట్టుకు తాను నీతిగా నిజాయితీగా ఉందామనుకుంటే ఏమవుతుందో. వాడికి ఎత్తేగ్గమేనా అవుతుంది. ఏ శంకరగిరి మాన్యాలో పట్టిస్తారు. లేక పోతే దేహశుద్ధే చేస్తారు. దావు తప్పి కన్నులొట్ట పోయినట్లై వాడు తనే మరోచోటికి పారిపోతాడు లేకపోతే ఉద్యోగానికే తిలోదకాలిచ్చుకుంటాడు. అలాగే కాలేజీల్లో చూడండి 'డిసిప్లిన్ (క్రమశిక్షణ) డిసిప్లిన్' అంటూ ఓకొత్త ప్రిన్సిపాల్ వచ్చారనుకోండి, 'మూడో రోజునే సమ్మె ఘెరావో తయారవడం, ఆయన ఓ ట్రాజిక్ హీరో డైలాగు పారేసి. రాజీనామా ఇచ్చేసి ఊరు విడిచి వెళ్ళి పోవడం చూస్తాం. అందువల్ల మన ఒకరిద్దరి వల్ల ఏమవుతుందంటీ. మీ బాద ప్తం కాక పోతే!' అనవచ్చు.

ఇక్కడ రాజుగారూ పాలసరఫరా కథ జ్ఞాపకం వస్తుంది. ఆ కథ మీకు తెలిసినదే కదా. అయినా ఒకసారి గుర్తుచేసుకుందాం అనగనగా ఒక రాజుగారు. ఆరాజుగారింట్లో ఏదో ఉత్సవం వచ్చింది. రాజుగారు కదా. వెంటనే తన రాజధాని పౌరులందరూ తలొక శేరు పాలూ పొయ్యాలని ఆజ్ఞ జారీచేశారు. పాల కోసమని ప్రాంగణంలో రెండు పెద్ద-చాలా పెద్ద - గంగాళాలు పెట్టారు. రాజధాని పౌరులు సామాన్యులు కాదు ఒక పౌరు డనుకున్నాడట. 'అందరూ పాలు పోస్తూంటే నేనొక్కడినీ ఒక శేరు నీళ్లు పోస్తే తెలిసొచ్చిందేమిటి?' అని తెల్లవారగట్లే లేచి వెళ్ళి గంగాళాల్లో శేరు నీళ్ళు గుమ్మరించి వచ్చేశాడట. తీరా పొద్దు పోయి గంగాళంలో మాస్తేఏముంది, రెండింటిలో నిండా నీళ్ళే. తెల్లగా కూడా లేవు. ఎందుకలా అయింది? పౌరుల్లో ప్రతి ఒక్కడూ తన మట్టుకు తానుగా ఆలోచించాడు చివరికి జరిగింది అంతా ఒక్కటే. కాబట్టి మిగతా వాళ్ళ మాట ఎలా ఉన్నా మనమట్టుకు మనం మన వ్యవహారంలో మార్పుతెచ్చుకుందాం. దాని వల్ల నలుగురికీ కూడా కొంత ప్రయోజనం చేకూరుతుందా, మంచిదే, ఏమీ జరగదా, అయినా మనకేమీ నష్టం లేదు కదా, ఏమంటారు?

2

# కొత్త దృక్కోణం నుంచి

మనం మానవ సంబంధాల గురించి మాట్లాడుకుంటున్నాం కదా. మానవసంబంధాలంటే మనుష్యులు ఒకరితో ఒకరు వ్యవహరించుకునే తీరే అని కూడా తెలుసుకున్నాం గదా. ఆ వ్యవహారంలో ఒక చిన్న పొరపాటు కూడా ఎంత అనర్థం తెస్తుందో ఒక కథ చెపుతాను.

అవి విజయనగర సామ్రాజ్యపు అంత్యదశ రోజులు. రాజు సదా శివరాయలు కాబోలు - పేరుకు మాత్రమే రాజు. ఆయన అధిక సమయం అంతఃపురంలోనే గడిపే వాడట. అసలు అధికారం చలాయించేది మకుటం లేని మహారాజు లాంటి వృద్ధ సేనాధిపతి అళియరామరాయలే. ఆ సమయానికి దక్కనులో బహమనీ రాజ్యం ఐదుముక్కలై ఉంది. ఐదుగురు నవాబులూ తమలో తాము పోరాడుకోసాగారు, ప్రక్కనే ఉన్న శక్తిమంతమైన విజయనగర సామ్రాజ్య పాలకులు ఒక మారు ఆ నవాబుకి వ్యతిరేకంగా ఈ నవాబుని, మరొక మారు ఈ నవాబుకి వ్యతిరేకంగా ఆ నవాబుని సమర్థిస్తూ, ఆ నవాబులందరితో చెలగాటమాడసాగారు. ఒకసారి ఆ నవాబుల్లో ఒకడు విజయనగర రాజధానికి వచ్చి, అళియరామరాయలును తనని రక్షించవలసిందిగా అర్థించాడు ఎంతదీనంగా అర్థించాడంటే, అళియ రామరాయల చేతులు పట్టుకొని, తలవంచి ప్రతిమాలాడట. అళియ రామరాయలు వృద్ధుడైనా, ఆయనలో వివేకం పెద్దగా వృద్ధి చెందలేదు. కాని, అహంభావం పదింతలుగా పెరిగింది. ఆయన అప్పుడు ఉచితానుచితాలు

కూడా గుర్తించక నిండు సభలో "ఒరే, తురకాడు ముట్టుకున్నాడురా, నీళ్ళు తెండిరా, చేతులు కడుక్కోవాలి" అని బిగ్గరగా అరిచాడట. నవాబు నిశ్చేష్టుడై పోయాడు. తరువాత తెప్పరిల్లుకున్నాడు. అప్పుడు చేసేది ఏమీలేక అవమానం దిగమింగుకొని వెళ్ళిపోయాడట. కాని అంతవరకు అంతర్యుద్ధాలలో పోట్లాడుతున్న నవాబులు కూడా తమ సాటి వాడికి జరిగిన అవమానానికి చలించిపోయి, ఆగ్రహంతో నిండి, తమ విభేదాలు మరచి అందరూ ఒకటై, విజయనగర రాజ్యంపై గండెత్తాడు తల్లికోట యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అళియరామరాయలు వీరోచితంగా పోరాడాడు, కాని పగతో మండుతున్న దక్కను సైన్యాల ముందు ఆయన పరాక్రమం పనికి రాలేక పోయింది. వారి చేతిలో చిక్కాడు వెంటనే ఆయన తల నరికి గడకు గుచ్చి పైకెత్తారట అది చూసి విజయనగర సైనికుల్లో హాహాకారాలు చెలరేగాయి. వారిని పిరికితనం ఆవహించింది. అంతే విజయనగర మహాసామ్రాజ్య వైభవంపై తెర పడింది. అంతటితో ఆగలేదు. దాడి వచ్చినవారు పట్టుదలతో కళావిలసితమైన ఆ సుందర రాజధానీ నగరాన్ని సంపూర్ణ ధ్వంసం కావించారు. అప్పటికి కాని వారి పగ తీరలేదన్న మాట ఈనాడు హాస్పేట సమీపంలో హంపీవద్ద మన గుండెల్ని కలచి వేస్తూ దర్శనమిచ్చేవి ఆనాటి రాజధాని శిథిలాలే. రామరాయల అహంకారమే విజయనగర సామ్రాజ్య పతనానికి కారణం అని చెప్పిపెరిగిన అతిశయోక్తి అవుతుంది కాని వాటిలో ఉన్నదానికి ఒక బలమైన ఊపు ఇచ్చిన కారణంగా పేర్కొవడంలో తప్పు లేదు

"అందుకే నాయనా అహంకారం మహా చెడ్డది అని మన పెద్దలు చెపుతున్నారు," అనవచ్చు. 'అయితే ఏం చేయాలి ?' "అహంకారాన్ని వదులుకోవాలి'' 'అంటే'?"నీ గురించే ఆలోచించక నలుగురి గురించీ ఆలోచించాలి, నలుగురి క్షేమంలోనే నీ క్షేమం ఉందని తెలుసుకోవాలి నాయనా'' 'అంటే

మనం చుట్టు తిరిగి మానవ సంబంధాలకే వచ్చాంగదా' "ఇదేదో కొత్త పేరు పెడుతున్నావు నువ్వు. మనకిఅనాదిగావస్తున్న నీతి సూత్రాలుఉన్నాయి కదా' వాటిని ఆచరిస్తే శాంతి సౌఖ్యాలు అవేఏర్పడతాయి. అవిఆచరించక పోవడం వల్లనే అంతకంతకు ఘర్షణలూ, అశాంతీ, దారుణాలూ పెచ్చు పెరిగి పోతున్నాయి'' 'అది సరే స్వామీ, వేలయేళ్ళ నుంచీ 'సత్యం వద' 'ధర్మం చర' 'అహింసా పరమోధర్మః' వగైరా నీతి సూత్రాలు బోధిస్తూనే వస్తున్నారు కదా, కాని సమాజం బాగుపడే బదులు అంతకంతకు చెడిపోతున్నట్లు కని పిస్తోందేమిటి?' "అది అంతే నాయనా, నడుస్తున్నది కలియుగం కదా. ధర్మం ఒంటి కాలిమీదే నిలబడుతుంది. పాపంపండాలి. ప్రళయం రావాలి. అప్పుడు మళ్ళీ సత్యయుగం—" 'అదేమిటి స్వామీ, మంచిలో నుంచి చెడు పుట్టుకువస్తుందా? నీతి, అవినీతి అయిపోతుందా? సత్యయుగం నుంచి కలి యుగంలోకి దిగజారడమెలాజరుగుతోంది? మనుష్యులలో అధర్మం, అవినీతి పెరగకుండా అరికట్టలేని మీ నీతి సూత్రాలెందుకండి?' "ఇదే నాయనా రోగం ముదురుతోందన్నందుకు సూచన. అహంకారానికి నిదర్శనం!''

ఇక్కడ ఒకటి రెండు స్పష్టీకరణలు అవసరం. ఒకటి, సమాజం అంతకంతకు చెడిపోతోందంటే మనం అంగీకరించం, ఒకవైపు చెడు పెరుగుతోందే మరోవైపు మంచీ పెరుగుతోంది. విద్యావిజ్ఞానాలు ఎంతగానో విస్తరిస్తున్నాయి. కళ సాహిత్యాలు పూర్వంలా కొద్దిమందికి కాక కోట్లాది ప్రజలకి చేరుతున్నాయి. ఇదివరకు అజ్ఞానాంధకారంలో మగ్గుతూ, జీవితమంటే ఏమిటో కూడా సరిగా తెలియని అట్టడుగు వర్గాలు—వారే సంఘానికి అధిక సంఖ్యాకులు—ఈనాడు వెలుగులోకి వచ్చి, తల ఎత్తుకొని జీవితాన్ని చవి చూస్తున్నారు. దుర్మార్గులు ఈ రోజుల్లోనే కాదు, ఆరోజుల్లోనూ ఉండేవారు. లేకపోతే అవతారాలెందు కెత్తవలసివచ్చింది? అన్యాయం, అక్రమం, అవినీతి, దారుణాలు పెరిగిపోతున్నది నిజమైతే వాటి నెదుర్కొనేందుకు ప్రయ

త్సాలు జరుగుతున్నాయన్నది కూడా నిజం. అవునో కాదో మీరే పరిశీలించండి.

ఇక రెండవది. మనం నీతి సూత్రాలను కాదనడం లేదు. 'సత్యం వద' కు బదులు మనం 'అసత్యం వద' అనలేం, అలాగే 'ధర్మంచర' కు బదులుగా 'అధర్మం చర' అనలేము కదా. కాని ఆ సూత్రాలని చిలుక పలుకుల్లా, పురోహితుడి మంత్రాల్లా వల్లించి ప్రయోజనం లేదు. ఎందుకంటే ఈనాటి సమాజం పూర్వం దానికన్నా చాలారెట్లు పెద్దదీ, విస్తృతమైనదీ, ఎంతో విభిన్నమైనదీ, క్లిష్టమైనదీ కూడా. అందువల్ల మనం కొత్త దృక్కోణం నుంచీ, కొత్త పద్ధతుల్లోనూ ఆలోచించవలసి ఉంటుంది. సూత్రాలను అమలు పరచడం సూటి గీతగీసినట్లు కాదని ఒక పూర్వకాలపు కథే చెపుతాను. ఇది ఉపనిషత్తులలోనిది. సత్య పాలనకి సంబంధించినది. కొందరు దుర్మార్గులొక వ్యక్తిని తరుముకు వస్తున్నారు. ఆ వ్యక్తి ప్రాణభీతితో ఒక ఋష్యాశ్రమంలోకి పరుగెత్తి "స్వామీ, దుండగులకు నేనెక్కడ దాగుకున్నదీ చెప్పకండి, నన్ను చంపేస్తారు," అని త్వరగా పోయి ఒక మూలదాగుకున్నాడు. మరి కొద్ది నిమిషాలకి ఆ దుండగులు పరుగెత్తుకు వచ్చారు. ఆ ఋషినే అడిగారు అంతకు ముందు అటు వచ్చిన వ్యక్తి ఎక్కడ దాగుకున్నాడని. ఋషి సత్యవ్రతుడు. అబద్ధం పలకలేడు. కాబట్టి వాళ్ళు అడిగేటప్పటికి నిజమే చెప్పివేశాడు. దుండగులు దాగుకున్న వ్యక్తిని బయటికి లాగి ఋషి కళ్ళ ఎదుటే చంపేసి వెళ్ళిపోయారు. తరువాత కొంతకాలానికి ఆ ఋషి కాలం చేశాడు. అప్పుడు తాను వచ్చినది స్వర్గం కాదు, నరకమని తెలుసుకొని కాలుడితో, "ఇదేమిటి యమధర్మరాజా, నేనెన్నడు అసత్య మాడి ఎరుగనే, నన్నెందుకు నరకం తెచ్చావు', అని అడిగాడట. "నీ సత్యసంధతే ఒక అమాయకవ్యక్తి ప్రాణం తీసిందయ్యా, అందుకని!" అన్నాడట యమధర్మరాజు.

వర్తమాన కాలానికి వద్దాం. మన దేశపు ముఖ్యమైన సైనికాధికారి ఒకడు శత్రువుల చేతుల్లో చిక్కాడనుకోండి. ఆయన ఎట్టి పరిస్థితిలో అయినా—చిత్రహింసలు పెట్టినా—మనదేశపు సైనికస్థితిని గూర్చి నిజం చెప్పడు కదా. చెప్పకూడదని కూడా మనం ఆశిస్తాం. అంతేకాదు, శత్రువులను తికమక పెట్టేందుకు కొంత తప్పుడు సమాచారమివ్వ వచ్చు కూడా. అతను చేసినది తప్పంటామా ?

ఒకాయన ఆరోగ్యం బాగా లేదనుకోండి. వైద్యనిపుణుడు పరీక్ష చేసి ఆయన గుండె పరిస్థితి బాగా లేదని నిర్ణయానికి వస్తాడు. ఆ నిజం అప్పుడే చెప్పేస్తే ఆ పెద్దమనిషి ఎప్పుడో ఆపరేషన్ టేబిల్ మీద ప్రాణాలు వదిలేసేవాడు అప్పుడే హార్ట్ఎటాక్ వచ్చి హరీమనవచ్చు. కాదూ!

మనం యుగాలనుంచీ వస్తున్న నీతి సూత్రాలను కాదనకుండానే వాటివిలువ వాటికిస్తూ, మనం మనచుట్టు ఉన్న సమాజం గురించి మానవ సంబంధాల దృక్కోణంలో ఆలోచిద్దాం. మనం మనవ్యవహారానికి ప్రపంచ శాంతికీ,విశ్వమానవ సౌభ్రాతృత్వానికీ కూడా ముడి పెట్టవద్దు. అవిచాలాగొప్ప ఆదర్శాలు, కోరవలసినవే కాని మనం పరిమిత లక్ష్యాలే పెట్టుకుందాం. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కుతుందా అంటారుగదా. మనమింకా మొదటి మెట్టుకూడా ఎక్కలేదుకదా. అందువల్ల తక్షణ కర్తవ్యంగురించే ఆలోచిద్దాం. తరువాత ఓపికా, ఆత్మవిశ్వాసం మీద ఆధారపడి ఉంటుంది. ముందు మనం కోరేది మంచిగా హాయిగా బ్రతకడం, కాని మనం మంచిగా హాయిగా బ్రతికాలంటే మన పరిధిలోకి వచ్చేమనుష్యులతో, అంటే మన ఇంట్లో వాళ్ళతో, బంధువులతో, స్నేహితులతో చుట్టు పక్కల వాళ్ళతో, ఇంకా బయట సమాజంలో మనం వ్యవహరించవలసిన మనుష్యులతో మంచిగానే బ్రతకాలి. మన మొక్కళ్ళమూ మంచిగా బ్రతకడమన్న ప్రశ్నే లేదు. కాబట్టి మనం

ఇతరులతో - మన ఇంట్లోవాళ్ళుకూడా ఒక అర్థంలో ఇతరులేకదా - ఎలా వ్యవహరించాలో తెలిపేది.

ఈ సందర్భంలో ఒక పుస్తకం గురించి కొంత తెలుసుకోవడం మంచిది. ఇంగ్లీషు తెలిసిన పాఠకుల్లో చాలా మందికి డేల్ కార్నెగి వ్రాసిన 'హౌ టు విన్ ఫ్రెండ్స్ అండ్ ఇనఫ్లూయన్స్ పీపిల్' పరిచయమయ్యే ఉంటుంది. వారు ఇదివరకు చదవకపోయివుంటే అది వెంటనే చదవడం మంచిది. అది ఈనాటికి సుమారు కోటిపైగా ప్రతులు అమ్ముడైనవి. ఆ పుస్తకం మానవ సంబంధాల మీద మొదటిదని చెప్పవచ్చును. కాని మామూలు పాఠ్యగ్రంథాలలోలా కాక మానవ సంబంధాలు ఏవిధంగా ఉండాలని కోరుకుంటామో సరిగా దానికనుగుణంగా అతి సన్నిహిత మిత్రుడు చెప్పినట్లుగా కథలతో ఉదాహరణల ఎంతో ఆసక్తిదాయకంగా రచించాడు డేల్‌కార్నెగీ మన. మనప్పుడప్పుడు ఆ పుస్తకంలోని సలహాలను చర్చించు కోవలసి ఉంటుంది. కాని ఈ పుస్తకం దానికి నకలు కాదు ఈ పుస్తకం చదివిన తరువాత పాఠకులు డేల్ కార్నెగి పుస్తకం కూడా చదివి తామేమి చేయాలో నిర్ణయించుకుంటారని ఈ రచయిత ఆశిస్తున్నాడు.

---

మంచిమాటలు :

జీవించినంత కాలం జీవించడం నేర్చుకుంటూ ఉండు.

ప్రతివాడూ తన జీవితానికి తానే శిల్పి.

ఉత్తముడు మాటల్లో మూగగానూ, చేతల్లో చురుకుగానూ ఉంటాడు,

అనువుగానిచోట అధికుల మనరాదు, కొంచెమయిననదియు గొదువ కాదు

కోపం మదపుటేనుగు లాంటిది , గాంభీర్యం అంకుశం లాంటిది.

3

# ఖరీదులేని వస్తువు

మానవ సంబంధాల కతి ముఖ్యమైనదీ ఏమాత్రం ఖర్చులేనిదీ వస్తువు ఒకటి ఉంది. అదే మర్యాద. సాధారణంగా కోపం వచ్చినప్పుడే మర్యాద జ్ఞాపకం వస్తుంది. మనం "మర్యాద ఇచ్చిపుచ్చుకోండి అంతే కాని" అంటాం. కాని మర్యాద ఎప్పుడూ అవసరమే. మనం మర్యాదగా వ్యవహరించడం మొదలు పెడితే మన సమస్యలు సగం తీరిపోతాయి. (నేను సగమే అన్నాను కానీ అన్ని సమస్యలూ అనలేదంటోయి, ఆనక నన్ను తప్పు పడ్తారు గనుక!)

మనకి ఒక ఆఫీసరుతో పని ఉందనుకోండి. మనం వెళ్ళగానే ఆయన ఎంతో మర్యాదగా పలకరించి కూర్చోజేసి మనం వచ్చిన పనేమిటో తెలుసుకోగోరాడనుకోండి. మనలో కొద్దిగానైనా ఉద్రిక్తత ఏర్పడి ఉన్నది తొలగిపోతుంది. ఆత్మవిశ్వాసం పైకి ఉబుకుతుంది. మనం చెప్పవలసింది చెప్పగలుగుతాం. తరువాత కూడా ఆ ఆఫీసరు అంటే ఎంతో మంచి అభిప్రాయం మన మనస్సులో ఉండిపోతుంది. అలాగే ఒక కొట్టుకు వెళ్ళామనుకోండి. అక్కడి యజమాని నిర్లక్ష్యంగా మనం చెప్పినదంతా సరిగా వినిపించుకోకుండా ఏదో సరుకు మన మొగానపడేసి డబ్బులుతీసుకొని మరొకకొనుగోలుదారు కేసిచూశాడనుకోండి, మనంమరొక కొట్టుకువెళ్తాం. అక్కడమనల్ని చూడగానే కొట్టుయజమాని "దయ చేయండి, ఒరేయి మాస్టారికేమికావాలో ముందిచ్చి పంపించండి" (నిజానికి అందరికీ అలాగే అంటాడు)

అనీ మధ్యలో "మాస్టారిని కెసుక్కుంటున్నారా" అని అంతా అయిన తరువాత "సరుకులనీ ఇచ్చారుగదండీ? ధన్యవాదాలండి, మళ్ళీ మామీద దయా జూపిస్తూ ఉండండి, నమస్కారం" అని చెప్పాడనుకోండి. మనం రెంచో కొట్టుకేపోతాం. మనకి ఒక తప్పని సరి వస్తువు మరెక్కడా దొరకక పోతేనే మొదటి కొట్టుకు పోతాం ఇప్పుడు చాలా పరకు వర్తకులు ఖాతా దార్లని ఆకర్షించాలంటే, నిలుపుకోవాలంటే మర్యాద చాలా అవసరమని గుర్తిస్తున్నారు. అందుకే తాము మర్యాదగా వ్యవహరిస్తున్నారు. తమ సేల్సుమన్‌ని కూడా మర్యాదగా వ్యవహరింప జేస్తున్నారు. అంటే మర్యాద వల్ల ఆర్థికంగా కూడా చాలా లాభం ఉందన్న మాటే కదూ? (కేవలం మర్యాద ఒక్కటే చాలదనుకోండి. సరుకు కల్తీ లేనిదీ, నమ్మకమైనదీ ఉండాలి. అది ప్రాథమికం. అయి లేక పోతే ఉట్టిదగా అనుకుంటాం. అంతే కాదు. మర్యాదకు దగా జరిగితే మరింత కోపం వస్తుంది. వ్యాపార మనేది సరుకు నాణ్యత మీదే ప్రధానంగా ఆధారపడి ఉందని మనం గుర్తించిన మీదట మర్యాద కూడా లాభదాయకం అని తెలుసుకుంటాం)

కాని చిత్రమేమంటే కొనుగోలుదార్లని ఆకర్షించటంలో పోటీ ఉండే చోటే మర్యాద అవసరం గుర్తిస్తున్నారు. పోటీ లేనిచోట్ల, తాము సరిగా పనిచేసినా చేయకపోయినా జీతం, భత్యం బోనసూ విధిగా అందే చోట్ల ఈ మర్యాద కనిపించదు. ఇటీవల అట్లాంటి చోట్లకూడా మర్యాద వారోత్సవాలు జరుపుతున్నది. కాని సాధారణంగా పోస్టర్లూ, తోరణాలూ జండాలతోబాటు అటువంటి మర్యాద కూడా మాయమైపోతుంది.

ఇతరుల దృష్టితో కాకమన దృష్టితో ఆలోచిద్దాం. పైనే చెప్పినట్టు మన మే ఆఫీసుకైనా వెళ్ళినప్పుడు అక్కడి ఆఫీసరూ, గుమాస్తాలూ మనతో ఎంతో మర్యాదగా వ్యవహరిస్తే, అలాగే రైల్వేరిజర్వేషను గుమాస్తా, బస్సు

లో ఉండక్టరూ, రేషను షాపు యజమానీ, గాసు డీలరూ, డాక్టరూ, లాయరూ -ఇలా మనకి పని ఉన్నవారు మనతో మర్యాదగా వ్యవహరిస్తే మనకెంత హాయిగా ఉంటుందో, చెప్పండి. మనకెంత సంతృప్తి కలుగుతుంది చెప్పండి.

మరి ఇతరుల నుంచి మర్యాద ఆశిస్తున్నప్పుడు మనం ఇతరుల పట్ల మర్యాదగా వ్యవహరించ వద్దూ ? మనం మర్యాదగా వ్యవహరిస్తే మనతో పని ఉన్న ఇతరులు కూడా హాయీ, సంతృప్తి పొందరూ ? మన మర్యాదతో కూడిన వ్యవహారం ఎలా ఉంటుందంటే ఏదైనా సెంటు రాసుకొని-మరీ అత్తరు సాయిబు వెళ్తున్నట్లు కాక, తోచీతోచనట్లుగా తేలికగా___ ఏదో మృదువైన, మధురమైన పరిమళం రాసుకొని వెళ్తే ఎలా ఉంటుందో అలా ఉంటుందనవచ్చు. నలుగురూ మనపట్ల ఆకర్షితులవుతారు. అందులోనూ చుట్టూ చెమట కంపూ, మడ్డి కంపూ ఉంటే మనరాక మందమలయానిలం సోకినట్లవుతుంది. నిజంగా మర్యాద వాతావరణాన్ని చల్లబరుస్తుంది. సుగంధం వ్యాపింపజేస్తుంది. మనుష్యుల మనస్సుల్ని కూడా మృదువు పరుస్తుంది. కఠినురాతిగుండెల్ని ఏమీ చేయలేకపోవచ్చునుకోండి అదివేరేవిషయం. సంఘర్షణల్ని పూర్తిగా నివారించలేక పోయినా కనీసం వాటిని ప్రోత్సహించదు. సాధ్యమైనంత వరకు మితిమీరకుండా చేస్తుంది. సంఘర్షణలకు తావులేని చోట మన మర్యాద వాతావరణాన్ని మన కనుకూలం చేస్తుంది. ఆవిధంగా మనమర్యాద మనకెంతో ప్రయోజనకరం. ఇతరులతో వ్యవహారంలో మనకి అనుకూలత సిద్ధించడమే. కాకుండా మనమట్టుకు మనకి మనశ్శాంతీ, తృప్తీ, ఆనందమూ కలిగిస్తుంది. మనం కోపంలో మండి పడ్డప్పుడు. ఆ మంటలో మర్యాద మరచి వ్యవహరిస్తే తరువాత పశ్చాత్తాపపడవలసి ఉంటుంది. కాని మర్యాదగా వ్యవహరించి నందుకు మనమెప్పుడూ పశ్చాత్తాపపడవలసిన పని ఉండదు. అంతేకాదు. కోపంలో కూడామనం మర్యాద కనక మరచిపోక పోతే మనల్ని మనం అదుపులో పెట్టుకోవడమవుతుంది. హద్దు మీరడమూ జరగదు. మనకోపం శస్త్ర వైద్యుడి చేతిలో కత్తిలా పనిచేస్తుంది ఈ

చేతిలో కత్తిలా పనిచేస్తుంది. ఈ అంశం గురించి మరికొంత పరిశీలించవలసి ఉంది. ప్రస్తుతానికి మర్యాదవలన లాభమేగాని, నష్టమేమీ లేదని గుర్తిస్తే చాలు.

అయితే మనం మర్యాదగా ఎలా వ్యవహరించాలి ?

అసలా ప్రశ్న అవసరం కలగడమే కొంచెం విచారించదగిన విషయం. కొన్ని జాతుల్లో — ముఖ్యంగా పడమటి దేశాల ప్రజలలో, కొన్ని సమాజాల్లో - ఈ మర్యాద పరంపరాగతంగా వస్తూ ఉంటుంది. అక్కడ పిల్లలు మర్యాదగా ఎలా వ్యవహరించాలో ప్రత్యేకంగా నేర్చుకోనక్కర్లేదు. వారికి మాటలెలా వస్తాయో, మర్యాద కూడా అంత సహజంగానే అబ్బుతుంది. ఇంగ్లండులో ఇంట్లోవాళ్ళు కూడా తమతోతాము ఎంత మర్యాదగానో వ్యవహరిస్తారుట. ఉదాహరణకి భోజనం దగ్గర చిన్న కుర్రవాడికి ఒక ఆహారపదార్థం బాగా రుచించి మరికొంత కావాలనుకోండి! మనవాళ్ళలా "అమ్మా నాకింకా కావాలి" అనడు. "అమ్మా నేను మరి కొంచెం తీసుకోవచ్చా?" అంటాడట. అతను మరికొంచెం తినవచ్చనుకుంటే తల్లి "అలాగే నాయనా తీసుకో" అంటుంది. లేదు, అతను తగినంత తిన్నాడు, ఇంకా తినడం మంచిదికాదు అనుకుంటే "లేదు నాయనా, నువ్వు తగినంత తిన్నావులే" అని ఆమె ఎంతో మర్యాదగానే చెబుతుందిట. ఆ పిల్లవాడు ఊరుకుంటాడు. పిల్లలు పొద్దున్న లేవగానే 'గుడ్ మానింగ్ పాపా, గుడ్ మానింగ్ మమ్మీ' అని పలకరిస్తారు. పడుకోబోయే ముందు కూడా 'గుడ్‌నైట్ పాపా, గుడ్‌నైట్ మమ్మీ' అని చెప్పి తల్లిదండ్రులని ముద్దాడి వెళ్ళి పడుకుంటారుట. ఇట్లాంటి చిన్న విషయాలే ఎంత ప్రభావం చూపుతాయో ఒక చిన్న కథ ఉంది. అది నిజంగా జరిడుగినదే. కుర్రవాఏదో చెడ్డఅల్లరి చేస్తాడు. తండ్రి మందలించినా వినడు. దానితో

తండ్రికి చాలా కోపంవచ్చి వాడిని కొడతాడు. పిల్లవాడు వెక్కివెక్కి ఏడుస్తూ తన గదికి వెళ్ళిపోతాడు. (అక్కడ సాధారణంగా పిల్లలకు వేరుగా గదులు ఉంటాయి కదా) రాత్రి అయింది. ఆ పిల్లవాడు పడుకోబోయేముందు సందే [illegible]నే తండ్రి దగ్గరికి వచ్చి కళ్ళ నీళ్ళతోనే 'గుడ్‌నైట్ పాపా' అని ముద్దు పెట్టుకొని వెళ్ళిపోతాడు. తండ్రి చలించిపోతాడు. తరువాత కొంత సేపటికి పిల్లవాడి గదికి వెళతాడు. కన్నీటి చారికలు కట్టిన మొగంతో ఆ పిల్లాడు అమాయకంగా నిద్రపోతూంటే ఆయన గుండె కరిగిపోతుంది. పశ్చాత్తాపంలో కొడుకు మొగంమీద అతిమెల్లగా ముద్దాడి వెనక్కి వచ్చేస్తాడు. ఈ ఉదంతం చిత్రిస్తూ అతిసుందరమైన ఇంగ్లీష్ కవిత ఒకటి '[illegible]' ఉంది. అదికాక కొంతకాలం క్రిందట అలా బాధపడిన తండ్రి తన కొడుకు నుద్దేశిస్తూ వ్రాసిన ఉత్తరం ఎన్నో పత్రికలలో ప్రచురితమైంది. ఎన్నో భాషల్లోకి కూడా అనువాదమైంది. డేల్ కార్నెగీ పుస్తకంలో కూడా దానిని ప్రచురించారు. చెప్పొచ్చేదేమంటే వారి భాషలో, 'ప్లీజ్, థ్యాంక్యూ' వంటి పదాలూ దగ్గర వారి సంబంధంలో 'డియర్, డియరెస్ట్, డార్లింగ్ స్వీట్' వంటివి పుష్కలంగా వాడుకవుతాయి. మన భాషలో అటువంటి మాటలు ఏవి? ప్రియా, ప్రియతమా అంటే పిచ్చిపట్టిందా [illegible] గుడ్‌మార్నింగ్, గుడ్‌నైట్‌వంటి వాటికి పర్యాయ పదాలేవీ? [illegible] పరసంస్కృతి తెచ్చి పెట్టుకున్నట్టుగా, అసహజంగా తోస్తుంది. [illegible] కూడా ఒక సమాజంగాని వ్యవహారంలో (వారికి కోపం [illegible] తప్పు! - కోపం వచ్చినా మర్యాదగానే ఉండాలని మనమను [illegible] మర్యాద కనిపిస్తుంది. అది సంబంధంలేని ఇతరులకు [illegible] కష్టోపకరంగా ఉంటుంది. అలాగే తూర్పు దేశాల్లో [illegible] మర్యాద గురించి కూడా విశేషంగా చెప్పుకుంటారు. అది [illegible] అప్పుడప్పుడు కారణమవుతుంది. ఒకాయన ('క' అందాం) [illegible] ('గ' అందాం) ఏదో మేలు చేసినందుకు కృతజ్ఞత తెలియ

పరచుకుంటాడు. ఆ మాటలు విని 'గ' వంగి నమస్కరిస్తాడు, 'గ' వంగి నమస్కరించాడు కాబట్టి దానికి ప్రతిగా 'క' వంగి నమస్కరిస్తాడు. 'క' వంగి నమస్కరించాడు కాబట్టి మళ్ళీ 'గ' వంగి నమస్కరిస్తాడు. బయట వాళ్ళెవరో వచ్చి వారిని అడ్డుకోకపోతే వాళ్ళిద్దరూ అలా వంగుతూ నమస్కరిస్తూ చివరికి నడుము కాళ్ళూ పట్టేసి పడిపోవడం ఖాయం. మనం అంత అతికిపోవద్దు ఏదైనా మోతాదులోనే అందం. మర్యాదైనా! అందుకే అతిమర్యాద నిజంగా అమర్యాదే అని జపానీస్ సామెత కూడా ఉంది.

అయితే మర్యాదగా వ్యవహరించడమంటే ఏమి చెయ్యాలి ?

మర్యాదలో మొదటి ఘట్టం పలకరింపు. మొదటి ఘట్టమే కాదు. కేలకఘట్టం కూడా. ఇక్కడ తప్పటడుగులు వేశామో అంతా చెడిపోవచ్చు ఒకవేళ సరిదిద్దుకుందామనుకున్నా, ఎంతో కష్టపడవలసి వస్తుంది. మొదటి అడుగు సరిగా వేస్తే తరువాత అంతా సుకరమవుతుంది.

కొంచెం విడమర్చుకొని ఆలోచిద్దాం

మామూలుగా పరిచితులుకానీ, స్నేహితులుకానీ మనకి ఏ రోజునైనా మొదటిసారి కనిపించినప్పుడు, వారితో మనకేమీ పని లేకపోయినా 'నమస్కారం' అనో, 'కులాసా' అనో పలకరించడం, లేదా కనీసం తేలిక' చిరునవ్వుతో తల కొంచెం వంచడం చేయాలి - దీనిని 'చిరుపలకరింపు'' అందాం. సాధారణంగా మనమందరం చేస్తూనే ఉంటాం. కాని ప్రత్యేకంగా. ఎందుకు పేర్కొనవలసి వచ్చిందంటే,ఇంగ్లీష్‌లో ఒకసామెత ఉంది. మంచిగా ఉండడమే కాదు, మంచివారుగా కూడా కనబడాలి అని. అలాగే మన పరిచయం, స్నేహం కేవలం గుండెలో దాచుకోవడమేకాకుండా మొగంమీద కూడా - మరీ విస్తారంగా కాకుండా - ప్రదర్శిస్తూ ఉండడం మంచిది.

పూల మొక్క మొదట్లో నీళ్ళు చిలకరిస్తూ ఉండడంలా ఉంటుంది. చూసీ చూడనట్లు ఊరుకోవడం - అప్పిచ్చిన వారిముందు తప్పు ! - మంచిది కాదు.

సరే, పరిచితుల్నీ, స్నేహితుల్నీ వదిలివేయండి, మనం చాలామందిని చూస్తూ ఉంటాం. మన ఇరుగుపొరుగులున్నారనుకోండి. అంపరితో మనం మాట్లాడం. వారితో మనకే సంబంధమూ కూడా ఉండదు. అలాగే మనం ప్రయాణం చేసే సిటీబస్సులో, లేదా బస్సుస్టాపు దగ్గరా, రేషన్‌షాపు దగ్గరా, కిరాణాకొట్టు దగ్గరా కొందరిని చాలాసార్లు చూస్తూఉంటాం. అలాంటి వారితో మనం మాట్లాడకపోయినా మన గుర్తింపుకు సూచనగా పైన చెప్పిన విధంగా చిరుపలకరింపు చేయడం మంచిది. అటువంటి చిక్కాలి చిన్న చేష్టలు కూడా ఒక్కొక్క సమయంలో మనకు ప్రయోజనకారిగా ఉంటాయి. మనకెవరూ లేరే అనుకునే సమయంలో మనకు అనుకోని మిత్రుల్ని కన బరుస్తాయి.

బయటి వాళ్ళని వదిలేయండి. మన యింట్లోవాళ్ళు, సన్నిహిత బంధువులూ ఉన్నారనుకోండి. చాలా మంది బయట ఎంతో మర్యాదగా వ్యవహరించినా ఇంట్లో అలా వ్యవహరించరు. అదేదో కృత్రిమమైనదిలా తోస్తుంది వారికి కాని నిజానికి ఇంట్లో వారితో కూడా మర్యాదగా వ్యవ హరించడం మంచిది. పైన చూశాంగదా ఇంగ్లీషు వారిలోనూ, కొన్ని ఇతర జాతుల్లోనూ తల్లిదండ్రులూ పిల్లలూ కూడా 'గుడ్ మానింగ్, గుడ్‌నైట్, ప్లీజ్, థ్యాంక్యూ' అంటూ పరస్పరం చెప్పుకుంటారని మనం అలా శుభో దయం, శుభరాత్రి అనలేం. అది మనకి ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. కాని కనీసం దినంలో మొదటిసారి కనిపించినప్పుడు చిరుపలకరింపూ, నిద్ర పోయే ముందు ఒక మంచి మాటతో పంపడం చేయవచ్చు కదా ? అలాగే మన

వాళ్ళే మనకోసం ఒక మంచిపని చేసిపెడితే మనం "ధన్యవాదాలు, అమ్మా," "ధన్యవాదాలు బుచ్చీ" అనలేక పోవచ్చును కాని" చాలా బాగుందమ్మా బాగా చేశావమ్మా. బాగా చేశావురా బుచ్చీ" అనైనా అనవచ్చు. ఏదో విధంగా అవతల వాళ్ళగు ర్తింపు తీయగా వ్యక్తపరుస్తూ ఉండాలి. ఇవి చాలా చిన్న చేష్టలే కాని కొందరు ఇవి కూడా చేయలేరు. ఇవిఏమీ ఖర్చులేనివి, ఏమీ నష్టం లేనివని తెలుసుకదా, అలాంటప్పుడు అలాంటి చిన్న చేష్టలు చేయ డంలో ఇబ్బంది ఏమిటి? ఈ చిన్న చేష్టల వల్ల మనకు తెలియకుండానే, మన చుట్టూ వాతావరణంలో క్రమంగా చిన్న మార్పు వస్తుంది. అదిమంచి కోసమే. మంచికోసం ఎంత చిన్న మార్పైనా అభిలషణీయమే కదా ముఖ్యంగా అటువంటి వాతావరణంలో పిల్లలు పెరగడం వలన వారికి మంచి సంస్కారం అలవడుతుంది.

ఇంత వరకూ పని లేకపోయినా ఇతరులతో వ్యవహారం, పలకరింపూ గురించి మాట్లాడుకున్నాం.

ఇప్పుడు మనతో పని ఉండే ఎవరో వచ్చారనుకుందాం. వారితో ఎలా వ్యవహరించలో ఆలోచిద్దాం. ముఖం తీవ్రంగా పెట్టి "ఎందుకొచ్చారు? ఏమిటిపని? ఇప్పుడు టైంలేదు!" అని గుమ్మంలోనే వారి నెదుర్కోవడం ఎంత మాత్రం వాంఛనీయం కాదు. ఎవరినైనాసరే మృదువుగా పలకరించి, వారిని సుఖాసీనుల్ని చేసి మరీ మాట్లాడాలి.

తరువాత, మర్యాద ముఖ్యతత్వం ఏమంటే అవతలి వారిని ఏ మాత్రం నొప్పించకుండా, వీలైనంత వరకు సంతోష పెట్టడం. కాబట్టి వారు చెప్పేది ఓపికగా విని ఆ తరువాత మన నిర్ణయం గానీ, అభిప్రాయం గానీ మృదువుగానే చెప్పాలి. అనుకూలమైన జవాబుల దగ్గర సమస్యే ఉండదు.

కదా. ప్రతి కూలమైన జవాబు చెప్పవలసిన చోటనే మనం మరింత మెలకువతో, మర్యాదతో వ్యవహరించాలి. "నేను చేయను"అనటానికీ "నేను చేయలేను" అనడానికీ ఎంత వ్యత్యాసముంది ! మనం కాదని చెప్పేముందు ఏదో విధంగా ధన్యవాదాలు చెప్పడానికి అవకాశముందేమో పరిశీలించి, ఆ విధంగా చేయడం మంచిది "మీరింత దూరం శ్రమతీసుకు వచ్చినందుకు ధన్యవాదాలు'' "అనో, మీరు నాపట్ల చూపిన అభిమానానికి-లేదా-నా గురించి వెలిబుచ్చిన ఆందోళనకీ ధన్యవాదాలు'' అనో చెప్పడం మంచిది. ఆ తరువాత "క్షమించండి (ఫలానా కారణం చేత-లేదా-కొన్ని ప్రత్యేక కారణాల వల్ల) చేయలేక పోతున్నానండి, అందుకు చింతిస్తున్నాను, మరోలా భావించకండి,'' అని (సరిగా ఈ మాటలంటే ఈ మాటలని కాదు, ఈ రీతిలో)= మృదువుగా జవాబు చెప్పాలి. మృదువుగా అన్నామని నంగినంగిగా మాట్లాడనక్కరలేదు మృదువుగానే అయినా దృఢంగాజవాబు చెప్పడం మంచిది. లేకపోతే మన మృదుత్వాన్ని బలహీనతగా తీసుకొని అవతలివారు మనని మొహమాట పెట్టేసి, మనకిఇష్టంలేని ? కానీ, కానిది కానీ చేస్తామని చెప్పించేసి ఇరకాటంలో పెట్టెయ్యవచ్చు. మనం అవతల వారడిగినది చేస్తామని మాట ఇచ్చామనుకోండి, అలా మాట ఇచ్చేటప్పుడు మనం అలా చేయగలుగుతున్నందుకు చాలా సంతోషిస్తున్నామని చెప్పడం కూడా మంచిది. అలాగే మనం ఏ ఆఫీసులోనో పని చేస్తున్నామనుకోండి, అక్కడ కూడా మన దగ్గరకి ఎవరు వచ్చినా ముందు చిరునవ్వుతో పలకరించి, వీలైతే అవతల వ్యక్తిని కూర్చోబెట్టి, ఆపైన అతను వచ్చిన పనేమిటో తెలుసుకొని (ఇంగ్లీషులో అన్నట్లు 'నేను మీకే విధంగా సేవ చేయగలనో చెప్పండి' అనడం మనకి మరీ ఎబ్బెట్టుగా తోచవచ్చు, కనీసం 'నన్నేమి చెయ్యమంటారో సెలవియ్యండి' అనవచ్చు) ఆపైన వారు కోరినది చేయగలమనో, చేయలేమనో మర్యాదగా చెప్పాలి. రెండు మూడు రోజులు మర్యాదలేని వ్యవహారమూ, మర్యాదతో కూడిన వ్యవహారమూ పోల్చిచూస్తే ఎంత

తేడా ఉన్నదీ, మర్యాద ప్రభావం ఎంత ఉన్నదీ మనకు సుస్పష్టంగా బోధ పడుతుంది.

ఉదాహరణకి ఇక్కడ ఒక బాంకు శాఖ ఉంది. అక్కడ ఒక దోపిడీ ప్రయత్నం జరిగింది. అందువలన అక్కడ కట్టుదిట్టమైన భద్రతా చర్యలు తీసుకొన్నారు. ఒక రక్షకుడిని కూడా నియమించారు. ఆ మనిషి పక్కన తుపాకి పెట్టుకొని ద్వారం దగ్గర కూర్చొని గమనిస్తూ ఉంటాడు. అతనొక ముస్లిం హవల్దారు. మొదట్లో కుర్చీలో కూర్చొని చూస్తూండేవాడు. కొన్నాళ్ళ అతనంతట అతనే, ఏమి తోచిందో, ద్వారంలో అడుగుపెట్టే ప్రతివారికీ సలాము చేయడం మొదలుపెట్టాడు. ఆ సలాముకి కొందరు ఉబ్బితబ్బిబ్బవ సాగారు కూడా. కాని అలా సలాము పెట్టడంద్వారా అతనంటే ఒక సద్భావం కలగడమే కాకుండా ఆ బాంకుపట్ల కూడా, స్వల్పంగానే కావచ్చును, సద్భావం కలిగేట్టు చేశాడు అతను. ఎలా, ఐనా ఊరికేనే కూర్చునాడు కదా, సలాము చేస్తే నష్టమేముంది? కాని సలాము అంటే మనకు బెదురు ఉన్నమాట నిజమే. ఏ ఆఫీసులోనో ఏ బంట్రోతో మనల్ని చిరకాల మిత్రుడిని చూసినట్లు చూసి సలాం పెట్టాడంటే దానికి తరువాత రూపాయో, రెండు రూపాయలో, ఐదు రూపాయలో ఖర్చు కావడం ఖాయం అన్న అనుభవం మనలో చాలా మందికి ఉంటుంది. కాని నేను చెప్పిన చోట అలాంటి అవకాశం లేదు. అందువల్ల ఆ రక్షకుడు పెట్టిన సలాము ఏమీ ఎదురు ఆశించని సలామే. అందువల్లే అది మంచి ప్రభావం చూపింది. మనం ఇక్కడ చర్చిస్తున్నది అటువంటి సద్భావన గురించే కదా.

కాని ఇక్కడ మనకి కొన్ని సమస్యలు ఉన్నాయి. మనం ఇరుగుపొరుగులతో మర్యాదగా వ్యవహరించడం మొదలుపెట్టాక

కోండి, మన చిరుపలకరింపు అందుకొని మర్నాడే ఒక పెద్ద మనిషి వచ్చి "ఏమండీ కులాసాగా ఉన్నారా ఒక ట్వెంటీయో, టెన్నో, ఫైవో ఉంటే ఇప్పిస్తారా? అవసరం వచ్చింది, తరువాత ఇచ్చేస్తాను'' అని తీసుకొని మళ్ళీ చిరుపలకరింపుకు కూడా అందకపోవడం - ఈ అనుభవం మనకి అప్పు డప్పుడూ కలుగుతూ ఉంటుంది.

అలాగే మనం పలకరిస్తే చాలు, మనల్ని జిడ్డులా పట్టుకొని ఏవేవో వాగుతూ మన సమయం మింగేసే వాళ్ళుంటారు. సింద్‌బాద్ సాహసాల్లో రాక్షసుడిలా అన్నమాట - ఆ కథ మీకు జ్ఞాపకం లేదూ? సింద్‌బాద్ ఏ అరణ్యంలోనో, ఎడారిలోనో పోతూ ఉంటాడు. ఒకచోట ఒక పండు ముసలివాడు సొమ్మసిల్లి పడిపోయినట్లుంటాడు. సింద్‌బాద్ ఆ మనిషిని కదిపి చూస్తాడు. ముసలివాడు మెల్లగా కళ్ళు కొంచెం తెరచి 'దాహం' 'ఆకలి' అని మూలుగుతాడు. సింద్‌బాద్ అతన్ని రక్షిద్దామనే ఉద్దేశ్యంతో పైకి ఎత్తుకుంటాడు. అంతే, అలా పైకి ఎత్తాడో, లేదో పీనుగులాంటి ముసలివాడు ఏనుగులా అయిపోయి సింద్‌బాద్ జుట్టు పట్టుకొని "నేను చెప్పినట్లు చెయ్యి, ఊ అలా నడు!'' అని ఆజ్ఞాపిస్తాడు. ఆ ముసలివాడిని వదిలించుకోవడం సింద్‌బాద్ సాహసాల్లో ఒకటి. అలాగే కొందరు చెరువులో కొంగలా ఎంతో అమాయకంగా కనబడుతూ కాస్త మంచిగా పలకరిస్తే చాలు టక్కున పట్టుకుంటారు. వాళ్ళు మనల్ని "ఓ టెన్నో, ఫైవో ఇప్పించగలరా?'' అని అడగరు. కావలిస్తే మనకు ఇస్తారు కూడా. ఎటువచ్చీ వాళ్ళకు వినేవాడు కావాలి. మనమొక ఎత్తువేస్తే, వాళ్ళు మరో ఎత్తువేసి ఆక్టోపస్‌లా పట్టుకుంటారు. విలియం హాజ్‌లిట్ అనే ఆయన ఇంగ్లీష్‌లో గొప్ప రచయిత. ముఖ్యంగా ఆయన వ్యాసాలు ఎంతో ప్రసిద్ధి పొందాయి. కాని మాటలు చెప్పడంలో మాత్రం పరమ 'బోర్'ట. ఆయన కొక అలవాటు ఉండేదట. ఎవరవాడి కోటు బొత్తామొకటి పట్టుకొని దాని మీదే దృష్టిని నిలిపి తన వాక్ప్రవాహం వెళ్ళగక్కేవాడట. అందువల్ల ఆయన మిత్రుడొకడు ఆయన బొత్తాము పట్టుకోగానే దానినక్కడికి

కత్తిరించివేసి పక్కకి తప్పుకున్నాడట. హాజ్‌లిట్ ఆ బొత్తాము నుద్దేశించి తన మహోపన్యాసం కొనసాగిస్తూనే ఉన్నాడట !

ఇది నిజంగా గట్టి సమస్యే, పెద్ద వాళ్ళకి కూడా ఈ సమస్య ఎదురవుతూ ఉంటుంది. రెండవ ఎలిజబెత్ రాణి ఎవరైనా తనని విసిగిస్తున్నారనుకుంటే తన హాండ్‌బాగ్ అటూ, ఇటూ ఊపడం మొదలు పెడుతుందట. దానితో ఆమె ఉద్యోగులెవరో వచ్చి ఏదో వంక చెప్పి ఆ 'బోర్' నుంచి ఆమెను రక్షిస్తారట. అలాగే ఒక లార్డ్ 'బోర్'ల నుంచి రక్షించడానికి ఒక నౌకరుని పెట్టుకున్నాడట.

అందరికీ నౌకర్లూ, క్రింది ఉద్యోగులూ ఉండటం కష్టం కదా అందువల్ల శ్రీమతికో, తమ్ముళ్ళకో, చెల్లెళ్ళకో సూచన లివ్వడం మంచిది. మనం చేసే సైగో, శబ్దమో అందుకోగానే వాళ్ళు వచ్చి ఏదో కారణం చెప్పి మనల్ని ఆ 'బోర్' నుంచి రక్షిస్తారు. శని పీడ తప్పించుకునేందుకు శివుడంతటివాడు చెట్టు తొర్రలో దాగున్నాడట. ఈ 'బోర్'ల నుంచి తప్పించుకోడానికి కూడా మనం అవస్థపడవలసి ఉంటుంది.

ఇంటి దగ్గర సరే, ఆఫీసుల్లో కూడా మర్యాద ఆసరా చేసుకొని కొందరు మన అతివిలువైన సమయాన్ని నమిలి పిప్పిచేసేస్తారు. వారి ముందు మొగమాట పడి లాభంలేదు. వారికి మర్యాదగానే సమయం అయిపోయిందని సూచించాలి. మద్రాసులో ఈ రచయితకి మిత్రులైన ఒక ప్రముఖ ప్రచురణ కర్త (ఆయన ఇప్పుడులేరు) ఆఫీసు గదిలో తన గోడ మీద ఒక చిన్న బోర్డు ఉంచేవారు. దాని మీద ఇంగ్లీషులో "ఈయన పని రద్దీ ఉన్న వ్యాపారస్తుడు. దయచేసి మీ పనేదో త్వరగా ముగించుకొని ఈయన పనికి ఈయనని వదిలేయండి." అనిరాసి ఉండేది. ఆయనతో

మాట్లాడే వాళ్ళ దృష్టి ఆబోర్డు మీదపడ కుండా ఉండదు. అందువల్ల ఏ మాత్రం అవగాహన ఉన్నా ఎక్కువ సేపు కూర్చోలేరు.

(ఒక చిన్న సలహా గతంలో శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ రచించిన "రాజకీయ బేతాళ పంచవింశతిక" చదివాను. అందులో రెండు పేజీలు తిప్పగానే కన్నుకొట్టే ఒక అందమైన అమ్మాయి చిత్రం - బాపూ బొమ్మ అని వేరే చెప్పాలా - ఉంది. అక్కడ ఇలా రాసిఉంది. "ఎదరంతా ఎడారి మీకు విసుగుపుట్టినప్పుడు ఈ పేజీ తిప్పిచూసుకోండి " అలా మీరు ఏదైనా సూక్తికానీ, సూచన కానీ, చిన్న బోర్డు మీద రాసి ఆగంతకుల కోసం పెట్టాలనుకుంటే బోసిగా అక్షరాలు మాత్రం ఉంచకండి పక్కనే అందమైన అమ్మాయి మొగమో, ఒక ప్రకృతి దృశ్యమో - ఈ మధ్య ఇలాంటివి వస్తున్నాయి - ఉండేటట్లు చూడండి. అందమైన అమ్మాయి మొగం కోసమైనా ఆసూక్తో, సూచనో వచ్చేవాడికి చదవక తప్పదు. అదిసరే, కళ్ళ ముందు తాటికాయలంతేసి అక్షరాలున్నా చూడనివారు కొందరుంటారు. వారిని వదిలించుకోవడానికి సాధారణంగా ఆఫీసుల్లో ఏ ఉద్యోగినో వాడుకోవచ్చు. అయిదు నిమిషాలయిపోగానే ఆ ఉద్యోగి వచ్చి 'ఫలానా వారు మీతో మాట్లాడాలనుకుంటున్నారనో' 'దీని మీద ఆర్డర్ పాస్ చేయండి అనోస్తాడు.

మరి మనం సూచనలు చేసినా, చివరికి స్పష్టంగా చెప్పినా వదలని వారి మాటేమిటి? ఒక చుట్టం వచ్చి ఒకరి ఇంట్లో తిష్టవేశాడట ఇంటివారు మర్యాదకి కట్టుబడిపోయి అతనిని వదలించుకోలేక పోతున్నారట చివరికి ఆ ఇంటి పెద్ద కొడుకువచ్చి "ఏమండోయ్ మీఊరి నారాయుడి గార బ్బాయి బజారులో నాకు కనిపించి మీ శ్రీమతి గారికి వంట్లో బాగా లేదట మిమ్మల్ని అర్జంటుగా రమన్నారట అని మీతో నన్ను చెప్పమన్నాడండి

ఆయన కేదో తొందర పని ఉందట" అన్నాడట దానికా చుట్టం "మా ఊళ్ళో సరైన వైద్యులు లేరు. కాబట్టి దానిని కూడా ఇక్కడికి వచ్చేయమని రాస్తాను," అన్నాడట. మర్యాదకైనా మితి ఉందని ముందే చూశాంకదా. ఒక హద్దుదాటితే మర్యాదని వదలి శస్త్రాన్ని చేబూనక తప్పదు.

ఈ రచయితకే ఒక అనుభవముంది. ఇతడు సాధారణంగా సభా మర్యాద పాటిస్తాడు. పాట కచ్చేరికి పోయినా, ఉపన్యాసానికి వెళ్ళినా చివరి కంటా కూర్చుంటాడు. ఒక మారు అలాగే ఒక ఉపన్యాసానికి వెళ్ళాడు. అది సాహిత్యోపన్యాసం. గంభీరంగా సాగుతోంది. అక్కడ ఉన్నది ఆరడజను మంది శ్రోతలు మాత్రమే అయినా ఉపన్యాసకుడు ఏ మాత్రం నిరుత్సాహం చెందక తన పాండిత్యమంతా ప్రదర్శిస్తున్నాడు. ఈ రచయిత వాచీ చూసుకుంటే అక్కడికి వచ్చి అప్పటికి రెండు గంటలయి నట్లు తేలింది. జనం ఎక్కువగా ఉన్నప్పుడు చల్లగా జారుకుంటే ఎవరూ కనిపెట్టరు గాని, ఉన్న ఆరుగురిలో నుంచి లేవడమంటే తీవ్రమైనచర్యే అవుతుంది సరిగా అప్పుడే ఉపన్యాసకుడు అంటున్నాడు "ఇప్పుడు మనం మూడో పాయింటు మధ్యలో ఉన్నాం. ఇక రెండు పాయింట్లు-- " దానితో ఈ రచయిత తెగింపుకి వచ్చి మర్యాద విడిచి పారిపోవలసి వచ్చింది 'బ్రతుకు జీవుడా' అనుకుంటూ. ఇలాంటి సన్నివేశాల మూలంగానే ఈ సామెత పుట్టి ఉంటుంది. 'పావలా ఇచ్చి పాడించుకొని, రూపాయిచ్చి మానిపించుకోవలసి వచ్చింది' అని. దేక్ కార్నెగీ పుస్తకం గురించి అనుకున్నాం కదా అందులో ఒక అధ్యాయంలో వినండి అని ఆయన సలహా ఇస్తాడు. ముందు అవతలివాడు చెప్పినది శ్రద్ధగా వినడంవల్లే అతన్ని మంచి చేసుకోగలుగుతారు. బాగా పలుకుబడి పెంచుకోగలుగుతారు అని కార్నెగీ సూచిస్తాడు. నిజంగా మంచి

సంబహాయే. ముందు మనమే మాట్లాడేయడం కాకుండా, అవతలివాడు చెప్తూఉంటే అడ్డుపడకుండా వాడు చెప్పినది సాంతం వినడం మర్యాద లక్షణం. లాభదాయకంకూడా. కానిపైన చెప్పిన 'బోర్' ల వంటి వారూ, సమయం సందర్భం తెలియనివారూ బెన్ఫ్రెఫైవరో కావాలనే వారూ ఎదురుపడితే? ఇలాంటి పరిస్థితుల్ని కాస్త్రైనీ లెక్కలోకి తీసుకోడు మనం తీసుకోవాలి. మనం మర్యాదగా వ్యవహరిస్తూనే అవతలివాడు మన మర్యాదని బలహీనతగానో, సాకుగానో తీసుకొని మనకి నష్టం — సమయం సంబం ధించి కావచ్చు, డబ్బుకిసంబంధించి కావచ్చు -- కలగ జేసే టట్లయితే సర్మాగ మాటంగా, మర్యాదగానే అతనిని పంపి వేయాలి, మెడపట్టుకొని గెంటినా, చూరు పట్టుకొని వేళ్ళాడే రకంలా తేలితే మాత్రం మర్యాదని వదిలేసి తీవ్ర చర్యకి దిగడం తప్పదు.

ఒక కథ చెపుతారు. గతంలో ఒక మామగారికి నలుగురు అల్లుళ్ళట నలుగురు అల్లుళ్ళూ పండగలకి వచ్చి, అక్కడే ఉండి పోయారు. వారు త్వరలో కదిలివెళ్ళే సూచనలు కనిపించలేదు. ఎంత మామగారైనా నలుగు రల్లుళ్ళు ఇంటి మీద పడిమేస్తుంటే తట్టుకోవడం కష్టం. కాని అల్లుళ్ళనేదైనా అంటే కూతుళ్ళ కేమి కష్టాలు వస్తాయో అనిభయం ఇంటి ఆయన ఆఖరి కొడుకు కలగజేసుకున్నాడట. రాత్రి భోజనం చేసే సమయంలో భోజనాలా కాకుండా, లాంతరు పెద్ద అల్లుడి కెదురుకాకుండా, రెండో అల్లుడి కెదురుగా పెట్టించాడట. దానితో పెద్ద అల్లుడు అవమానం జరిగినట్లు అనుకొని మరు నాడు తన ఊరు వెళ్ళిపోయాడు. ఆ రాత్రి ఇంటి వారబ్బాయి వదిన గార్ణని రెండో అల్లుడి వైపు నుంచి కాకుండా, నాలుగో అల్లుడి వైపు నుండి వడ్డించే ట్లు చేశాడట దానితో రెండో అల్లుడికి కోపం వచ్చి, అతను వెళ్ళిపోయాడు. మరునాడు భోజనం దగ్గర మూడో అల్లుడు నెయ్యి అడిగితే, నూనె వడ్డించే ట్లు చేశాడు ఇంటి ఆయన ఆఖరికొడుకు. దానితో మూడో అల్లుడు కూడా

వెళ్ళి పోయాడట. కాని నాలుగో అల్లుడు మాత్రం ఏ ఉపాయాలు ప్రయోగించినా, అవమానాలు కలగజేసినా తనకి సంబంధంలేనట్లు దులిపేసుకొని గడిపేస్తున్నాడు. దా. తో బావమరిది అతనికి కనబడేటట్లు 'జామాతా దశమో గ్రహః' (అల్లుడు పదో గ్రహం) అని రాశాడు. నాలుగో అల్లుడు అంత సులభంగా పడిపోయేరకం కాదు కదా. అందువల్ల బావమరిది రాసిన దాని కింద 'శ్వశుర గృహం (అత్తవారిల్లు) పరమ సుఖదం' అని రాశాడట. అప్పుడు ఇంటి ఆఖరివాడు దాని క్రింద 'త్రిరాత్రానంతరం శునక స్సమానః' అని రాశాడట దానికి జవాబుగా నాలుగో అల్లుడు ఆరాత క్రిందే 'సంకురాత్రి, నవరాత్రి. శివరాత్రి అని రాశాడట అంటే వామనుడు మూడు అడుగుల్లో ప్రపంచాన్ని చుట్టినట్టు ఈ అల్లుడు సంవత్సరమంతటినీ ఇమిడ్చాడన్నమాట ఇక వేరే దిక్కులేక ఇంటివారబ్బాయి. నాలుగో బావగారు తోటలోనించి వెళ్తున్నప్పుడు గట్టిగా నాలుగు పుచ్చుకున్నాడట దానితో కాని ఆ అల్లుడి పీడ విరగడ కాలేదు. మొదటి అల్లుడు ఇలా వెళ్ళాడు రెండో అల్లుడు ఇలా వెళ్ళాడు, అంటూ రాఘవుడుమాత్రం -- అర్ధ చంద్ర ప్రహారేణ రాఘవ - గట్టి దెబ్బతోనే కదిలాడని ఒక సంస్కృత శ్లోకం ఉంది.

కాని అటు వంటి పరిస్థితులు అరుదుగానే వస్తాయని మనం ఆశిద్దాం సాధారణంగా మర్యాద ప్రభావం ఉండకుండా పోదు, మర్యాదా అంటే ఎదో ఒకటి రెండు సార్లు మృదువుగా మాట్లాడడం కాదు సాధ్యమైనంత ఓర్పు వహించాలి దాని వలన మనకి నష్టమేమీ లేదు. ముందే అన్నట్లు మంచి టెంపర్ ఉన్న స్ప్రింగ్‌ని అదిమి పట్టి నట్లు, మనశక్తి అంతా కుదించుకొని తిరుగులేని విధంగా తయారవుతుంది. కోపం వచ్చినా మనం మర్యాదగానే వ్యవహరించాలనుకున్నాం. మనల్ని ఎవరూ వేలెత్తి చూపడానికి వీలులేకుండా చేసుకోవాలన్న మాట. ఆయన చాలా మంచివాడు

ఆయనకి కోపం రానే రాదు, వస్తే ఇక దాని ముందు నిలబడడం కష్టం?' అనే విధంగా ఉండాలి. మళ్ళీ ఒక మాట జ్ఞాపకం చేసుకోండి, మనం ఏ ఆఫీసు కైనా వెళ్ళినప్పుడు, లేదా ఎవరి ఇంటికైనా, దుకాణానికైనా వెళ్ళి నప్పుడు అక్కడ వారు మనతో మర్యాదగా వ్యవహరిస్తే మనమెంత హాయి అనుభవిస్తాం, అటువంటప్పుడు బైబిల్ సూక్తిలో చెప్పినట్లు, మనం ఇతరుల నుంచి ఏమి ఆశిస్తామో, అది మనం చెయ్యవద్దూ? అందువల్ల ఇతరుల మాట ఎలా ఉన్నా మనం మర్యాదగానే వ్యవహరించాలి. ఒకవేళ పైన పేర్కొన్న విపరీత పరిస్థితులు ఎదురయినా, మనం మొదట మర్యాద ఉల్లంఘించిన వారు కాకూడదు. మన ఓర్పు ఇతరులు ఆశ్చర్యంతో ప్రశంసించేటట్లు ఉండాలి. అప్పుడు మనం ఆగ్రహించ వలసి వచ్చినా మన ఆగ్రహం ఇంతకు ముందు అనుకున్నట్లు నిపుణుడైన శస్త్రవైద్యుని కత్తిలా పని చేస్తుంది.

ఇంత వరకు మనం ఆషామాషీ కథలూ, కబుర్లూ చెప్పుకుంటూ వస్తున్నాం ఈ అధ్యాయంలోని సూచనలని క్రమబద్ధంగా గుర్తు చేసుకుందాం.

1. చిరునవ్వు : మర్యాదకు చిరునవ్వు పునాది అని చెప్పవచ్చు. అదే వాతావరణాన్ని కొంత మారుస్తుంది. మనకనుకూలం చేస్తుంది. అంతేకాక పూవుకు తావిలా మన చిరునవ్వు మనవ్యక్తిత్వానికే శోభ తెస్తుంది. సౌందర్యానికి కూడా సగం అర్థం చిరునవ్వే. కనుముక్కు తీరు ఎంతబాగున్నా చిరునవ్వు లేక పోతే, ఏదో చలువరాతి విగ్రహాన్ని చూస్తున్నట్లు ఉంటుందే కాని ప్రాణమున్న వ్యక్తిని చూసే అనుభూతి కలుగదు. చిరునవ్వు విరిస్తే ఆ అందం జిగేలు మంటుంది. మీకనుభవం ఉండే ఉంటుంది, మనం ఏమీ అందకత్తెకాదు, అనుకున్న ఆమెలో చిరునవ్వునవ్వేసరికి ఇంత అందం ఆమె

ఉ-దాతని ఆశ్చర్యంవేస్తుంది మీరే పరీక్షించి చూసుకోండి. తీవ్రంగా మొగం పెట్టి అద్దంలో చూసుకోండి తరువాత చిరునవ్వుతో మీ ప్రతిబింబాన్ని చూసు తేడా ఉందో మీకే తెలిసి వస్తుంది. ఎటు వచ్చీ కొందరి విషయంలో ఇది కోండి. ఎంతవర్ణించక పోవచ్చు. వారి ముఖకండరాల నిర్మాణం చిరునవ్వుకు సరిపడదని పిస్తుంది. వారిచిరునవ్వు ఒకసారి చూసినతరువాత "తల్లీ, నువ్వు చిరునవ్వు మాత్రం నవ్వకు" అని ప్రతిమాట వలసివస్తుంది. కాని అలాంటి వారు వేయికొకరు ఉంటారేమో ?

మరొక విషయం: చిరునవ్వు బయటి వాళ్ళకే కాదు. మనకి కూడా దాని వల్ల కొంత ప్రయోజనం ఉంది మన తత్వ శాస్త్రంలో జేమ్స్ - లాంజ్ సిద్ధాంత మని ఒకటి ఉండేది. మన ఆనందం, విషాదం, కోపం వంటి భావావేశాలు మన శారీరక పరిణామాల మానసిక అనుభూతులు మాత్రమే అని ఆ సిద్ధాంతంచెబుతుంది. మన మెందుకు దుఃఖిస్తున్నామంటే, కళ్ళ నీళ్ళు వస్తున్నాయి కాబట్టి అన్నట్లు. మన తత్వవేత్తలు ఈ సిద్ధాంతాన్ని ఎప్పుడో తోసి పుచ్చారు. అయినా దానిలో కొద్దిపాటి నిజం లేక పోలేదు. మీరు చిరునవ్వు తెచ్చుకొని కొంత సేపు అలాగే ఉంటే, మెల్లగా మీ మనస్సు ప్రసన్న స్థితికి చేరుతుంది. మీరు కోపం గానో చిరాకుగానో ఉన్నారనుకోండి. అప్పుడు నిలువుటద్దం ముందు నిలబడి. చిరునవ్వు తెచ్చు కోవడానికి ప్రయత్నించి, తెచ్చుకున్న తరువాత అలా అయిదు నిమిషాలు నిలువుకోండి. మీ కోపం, చిరాకూ తప్పనిసరిగా తగ్గి ఉంటాయి. ప్రయోగం చేసి చూడండి. ఏది ఏమైనా, చిరునవ్వు మనల్ని మనం అదుపులో పెట్టుకోవడానికీ, మన శక్తులూ, సామర్థ్యాలూ, ఆలోచనలూ అన్నీ మెలకువగా ఉంచుకోవడానికీ తోడ్పడుతుంది. అది మంచిదే కదా ? అందువల్ల చిరునవ్వు నవ్వండి.

కాని ప్రతి సాధారణ సూత్రానికీ, కొన్ని అపవాదాలు ఉంటాయి. శోక సముద్రం ముంచెత్తి నప్పుడూ, ఏదో అతి గంభీర విషయం చర్చిస్తు న్నప్పుడూ చిరునవ్వు ఉచితంగాతోచకవచ్చు కానివిచారాన్నికూడా మృదువుగా సూచించే చిరునవ్వు కూడా ఉంది. ఏది ఏమయినా అపవాదాల మాట అటుంచి సాధారణంగా చిరునవ్వు నవ్వండి.

2. రోజులో తొలిసారిగా ఎవరిని చూసినా ఒక మంచి మాటతో పలక రించండి. కనీసం ఓ గుర్తింపూ సంతోషం వ్యక్త పరచే సైగైనా చేయండి.

3. మీరు మాట్లాడే ముందు అవతలి వాళ్ళనే మొదట మాట్లాడ నీయండి.

4. అవతలివారు చెప్పేది సాంతం వినండి. (ఒక్క 'బోర్' ల విషయం లో ఇదివర్తించదని చూశాంకదా) మధ్యలో ఏదైనా సందేహం కలిగినా, వివరణ కోరిన చెప్పినది మళ్ళీ వినదలచుకున్నా అతనిని వాక్యం పూర్తి చేయనిచ్చి 'క్షమించండి' అని చెప్పి అతనిని అడిగిన తరువాతే మీ ప్రశ్న కానీ, సందేహం కానీ, వివరణ అవసరంకానీ చెప్పండి.

5. సాధ్యమైనంత ఓపిక వహించండి. ఓపిక పట్టడం వల్ల మనకి నష్ట మేమి లేదు. మనశ్శక్తి మరింత అవుతుంది.

6. ముందు అవతలి వారి సౌకర్యం చూసిన తరువాతే, మీ సౌకర్యం చూసుకోండి.

7. సమయ పాలనా, మాట నెరవేర్చడం కూడా మర్యాద క్రిందకే వస్తా యని గుర్తించుకోండి. మీరు ఒక వ్యక్తినిగానీ, ఒక సముదాయాన్ని కానీ,

సభకి కానీ వస్తామన్న సమయానికి వెళ్ళక వారిని చాలాసేపు కూర్చోబెట్టా రనుకోండి ఆవ్యక్తి పట్లకానీ, సముదాయంపట్లనీ, సభపట్లగానీ గౌరవం లేన ట్లవుతుంది సమయం ప్రకారం నడచుకోవడం సద్భావానికీ, సౌమనస్యానికి దారితీస్తుంది. ఏదైనా కారణం వల్ల అనుకోని ఆలస్యం అయితే ఎదుట వాళ్ళ అడగనక్కర్లేకుండానే మనమే ఫలానా కారణంవల్ల ఆలస్యమైందని సంజాయిషీ చెప్పుకోవడం ఎంతైనా ఉచితంగా ఉంటుంది. అలాగే మాటఇస్తే పాటించండి. పాటించలేమనుకొంటే ముందే చెప్పండి. సందేహం ఉంటే ఆ విషయం తెలియ జేయండి. మాట ఇచ్చి పాటించక పోవడం వల్ల మీ మాటకు విలువ లేదనైనా అనుకోవాలి. (అదిమీవ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తుంది.) లేదా అవతలి వారి పట్ల మీకు తగిన గౌరవం లేదనైనా అనుకోవాలి. ఊహించని పరిస్థి తులు ఎదురైతే మీరు అన్నది చేయలేక పోతే అవతలివారు అడిగారని కోపం చెప్పనక్కర్లేకుండానే ముందుగానే మీరే ఎందుకు అన్నది చేయలేక పోతు న్నారో చెప్పేయండి.

౮. మీ మర్యాద అనేది ఫలితం ఆశించి కాకుండా స్వభావంలో భాగంగా చేసుకోండి. గులాబీచెట్టు పూల ద్వారా తన అందాన్ని విరజిమ్ముతుంది. అది ఎవరు చూసినా చూడక పోయినా పూస్తుంది. వ్యక్తుల సంస్కారం బట్టి వాని అందం ఆస్వాదిస్తారు. అలాగే ఉండాలి మీ మర్యాద.

౯. అలా ఉన్నప్పుడే మీరు ఇంటా, బయటాఒకేరీతిలో వ్యవహరించగలు గుతారు. కొందరు ఇంట్లో తమ వాళ్ళతో ఎంతో ఆప్యాయంగా ఉంటారు. కాని బయటా, ఆఫీస్‌లోనూ ఇతరత్రా ముభావంగానో, పరుషంగానో వ్యవ హరిస్తారు కాని కొందరుఇందుకు పూర్తి విరుద్ధంగా ఉంటారు. రెండు తర హాలూ అభిలషణీయంకాదు. అందుకే మర్యాద మీస్వభావంలో అంతర్భాగం చేసుకోండి అన్నది.

4

# దినచర్య

మీరు బెంజమిన్ ఫ్రాంక్లిన్ పేరు వినే ఉంటారు. గాలిపటంతో ఆయన చేసిన విద్యుచ్ఛక్తి ప్రయోగం గురించి తెలుసుగదా. ఆయన శాస్త్ర వేత్తా, ఉత్తమ రాజకీయ వేత్తా, కుశలుడైన ప్రచురణ కర్తా, ప్రసిద్ధి పొందిన రచయితా కూడా ఆయనఆత్మకథ ప్రపంచ సాహిత్యంలో ఒక స్థానం పొందింది. అందులో ఒక చోట ఆయన తనలోని లోటుపాట్లని సవరించుకోడానికి, మంచి లక్షణాలు అలవరచు కోడానికి ఒక విచిత్రమైన పథకం ఎలా రూపొందించిందీ, ఎలా అవలంబించి, తన వ్యక్తిత్వాన్ని మెరుగుపరుచుకున్నదీ వర్ణించాడు. వీలైతే అది మీరు చదివి చూడండి. ఆ పథక మేమిటో టూకీగా వివరిస్తాను. ఆయన బాగా ఆలోచించి తాను అలవరచుకోవలసిన మంచి లక్షణాలను ఎన్నుకున్నాడు. అవి ఇవి: 1. సమయం 2. మౌనం 3. క్రమ బద్ధత 4. నిశ్చయం 5. పొదుపు 6. పరిశ్రమ 7. నిజాయితీ 8. న్యాయం 9. సమతూకం 10. పరిశుభ్రత 11. ప్రశాంతత 12. శుద్ధత 13. వినయం (ఆయన 13 లక్షణాలు ఎందుకు ఎంచుకున్నాడో కొంచెం ఆశ్చర్యమే. ఎందుకంటే యూరప్ అమెరికా దేశాల్లో 13 అంకెని అశుభంగా పరిగణిస్తారు. అక్కడ చాలా పెద్ద పెద్ద హోటళ్ళలో కూడా 13వ అంతస్తుకానీ, గది కానీ కనిపించవు) ఈ 13 గుణాల్ని గురించే ఒక్కొక్క సూక్తి రాసి పెట్టు కున్నాడు. పై వరుస క్రమంలోనే, ఆ లక్షణాలు అలవరచు

కోవాలను కొన్నాడు. ఆ లక్షణాలు అలవరుచుకోవడమంటే, వాటి సంబంధ మైన పొరబాట్లూ, దుర్లక్షణాలూ పరిహరించు కోవడమే కదా. ఆయన ఒక చిన్న పుస్తకం తీసుకొని దానిలో ఒక పట్టిక తయరు చేసుకున్నాడు. ఒక్కొక్క లక్షణానికి ఒక్కొక్క పుట కేటాయించాడు. ఆ లక్షణం పైన రాసి, దానికింద దానికి సంబంధించిన సూక్తిరాసుకొని దానికే వారానికి ఏడు రోజుల పేర్లతో ఏడు గళ్ళు గీసుకున్నాడు. ఒక్క సారే మారి పోవాలని కాకుండా తనని మెల్లగానే సంస్కరించు కుందుకు, ఒక్కొక్క వారం ఒక్కొక్క లక్షణానికి ప్రాధాన్యం ఇచ్చేవాడు. ఆయన సాయంత్రం వేళ ఈ 13 లక్షణాలకు సంబంధించి తను చేసిన పొరబాట్లు కానీ, తప్పులు కానీ, నల్లసిరాతో ఆ లక్షణానికి ఎదురుగా రోజుకి దిగువన గుర్తు పెట్టేవాడు. ఇప్పుడే అనుకున్నట్లు ఆయన దృష్టి ఆ వారానికి ఏ లక్షణం ఎంచుకున్నాడో, దాని కెదురుగా ఆ వారంలో ఎక్కడా నల్లగుర్తు పడ కుండా ఉండటం మీద కేంద్రీకృత మయ్యేది. ఆ వారంతనక ఒక్క గుర్తూ కూడా లేకుండా ఉంచుకోగలిగాడంటే ఆ లక్షణం అలవరచుకొని దానికి సంబంధించిన లోటు పాట్లూ, తప్పులూ తొలిగించు కొన్నట్లే కదా ఆ తరువాత వారం మొదట లక్షణానికె సంబంధించినగడి శుభ్రంగా ఉంచు తూనే, రెండవ లక్షణానికి సంబంధించినగడిని కూడా శుభ్రంగా ఉంచ డానికి ప్రయత్నించి, ఇలా క్రమంగా మొత్తం 13 వారాలలో ఆ పదమూడు లక్షణాలూ అలవరచు కున్నాడన్న మాట

ఆయన పట్టిక ఎలా ఉందో చూడండి

| | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1. సంయమనం | | | | | | | |
| 2. మౌనం | * | * | | * | | * | |

3. క్రమ బద్ధత * * * * *
4. నిశ్చయం * *
5. పొదుపు * *
6. పరిశ్రమ *

పై విధంగా మొత్తం 13 లక్షణాలు పట్టికలో గుర్తుపెట్టు కొనేవాడు.

కాని బెంజమిన్ ఫ్రాంక్లినే పథకం అమలు పరచడానికి ముందు తను ఊహించినంత సులభంగా దానిని ఆచరించ లేకపోయానని స్వయంగా రాసుకున్నాడు. అందులోనూ ముఖ్యంగా తన తప్పులనీ, బలహీనతలనీ, దుర్లక్షణాలనీ, గుర్తించుకొని వాటిని తొలగించుకోవడం మరీ కష్ట మైందట. అందు కోసం ఆయన తనకు సన్నిహితులైన కొందరు స్నేహి తుల సాయం తీసుకున్నాడట.మనమొగాన్ని అద్దంముందు నిలబడి చూసుకో వచ్చేమో కాని మనలోని బలహీనతలనీ, అవగుణాల్ని చూసుకోలేం. ఎదరవాడిలో అయితే ఇట్టే పట్టేస్తాం. ఒకాయన "ఇతర వెధవల్లా నేను ఆత్మస్తుతీ, పరనిందా చేయనండి," అన్నాడట! ఒకపూరు అమెరికా వెళ్ళి వచ్చిన ఒక చైనీయుడిని అక్కడి విశేషాలేమిటని అతని చుట్టాలూ, స్నేహితులూ అడిగితే, ఆ విశేషాలు చెప్పి చివరికి "అక్కడి వాళ్ళందరి కళ్ళూ, అదో వాలుగా ఉంటాయి, అది చాలా చిత్రంగా తోచింది," అన్నాడట. కళ్ళు వాలుగా ఉండేది చైనీయులకే. వంకరగా నడవడం అలవాటైనవాడు సరిగా నడిచే వాడిని వంకరగా నడుస్తున్నాడని అను కుంటాడట, అలాగే ఇదీను.

మీరు కూడా బెంజమిన్ ఫ్రాంక్లిన్ పద్ధతి అనుసరించ దలిస్తే మంచిదే. సరిగా ఆయన ఎన్నుకున్న లక్షణాలనే మీరు ఎంచు కోవాలని

లేదు. మీ అంతట మీరు ఆలోచించుకొని మీరు కోరుకొనే లక్షణాలు, మీరు కోరుకొనే క్రమంలో నిర్ణయించుకొని, వాటిని అమలు పరుచు కోవడం ప్రారంభించ వచ్చు.

కాని చాలా మంది అలా కాలపట్టిక (టైమ్‌టేబిల్) ప్రకారం నడచు కోవడం చాలా కష్టమని భావిస్తారు. అది వారికి కొద్దిగా కృత్రిమ మైనదిగానూ, యాంత్రిక మైనదిగాను కనబడుతుంది. మనం అంతకన్నా సులువైన పద్ధతి అవలంభిద్దాం. సహజంగా అది బెంజమిన్ ఫ్రాంక్లిన్ పద్ధతి అంత కట్టుదిట్టంగానూ ఉండదు. ప్రభావవంతంగానూ ఉండదు. కాని అయినంతలో కొంత ప్రయోజనం పొందవచ్చును. అంటే మనల్ని మనం తరగతిలో పిల్లల్ని క్రమశిక్షణతో పెట్టినట్లుగాక, ఇంట్లో పిల్లల్ని లాలించి నట్లు బుజ్జగించుకుంటున్నా మన్న మాట.

ఇలా చేసేందుకు ముఖ్య సాధనాలు రెండు. ఒకటి దినచర్య పుస్తకం (డయరీ). కనీసం రోజుకొకపుట ఉండే పుస్తకం తీసుకోండి. ఆ డయరీలో ఒక కార్డు పెట్టుకోండి. ఆ కార్డుమీద మధ్యలో ఒక నిలువు గీత — మందంగా ఒక గీతగానీ, దగ్గరగా సన్నగా రెండు గీతలు గానీ గీయండి. గడిలో పైనుంచి దినచర్యలో మీరు పాటించవలసిన విషయాలు కానీ, సూచనలు కానీ రాసుకోండి. మరీ ఎక్కువ రాయకండి. స్థలంఅంతా నిండిపోయి దృష్టిని కేంద్రీకరించడం కష్టమౌతుంది. అందువల్ల జాగ్రత్తగా ఆలోచించి ముఖ్యమైనవి నాలుగో, అయిదో మాత్రం, అవైనా టూకీగా రాసుకోండి. ఉదాహరణకి మీరు చేయ వలసిన నిర్ణీతమైన పనులు (అపాయింట్‌మెంట్స్): అంటే మీరు ఏ రోజునైనా దిన చర్య పుస్తకం తెరవగానే ఆరోజు మీరు చేయ వలసిన పనులుగానీ, పంపవలసిన దరఖాస్తులుగానీ, కట్టవలసిన రుసుంలు గానీ, కలుసుకోవలసిన వ్యక్తులు గానీ, రాయవలసిన

ఉత్తరాలు గానీ, కొనవలసిన వస్తువులు గానీ, ఈ సూచన గుర్తు చేస్తుంది. అలాగే తక్కిన సూచనలు కూడా, వివరాల్లోకి తరువాత పోదాం. ఆ సూచనల క్రింద అడ్డగీత (మధ్య నిలువు గీత నుంచి అంచు వరకూ అడ్డ గీత) గీయండి. తరువాత ఎడమ వైపుగడిలో మీరు ఏ మంచి లక్షణాలు అలవరచుకోదగినవీ, అలవరచుకోగలిగినవీ అనుకుంటారో అవి మీ ప్రాముఖ్యం బట్టి వరుస క్రమంలో ఒక దాని కింద ఒకటి రాసుకోండి. అవి కూడా బాగా ఆలోచించి సాధ్యమైనంత తక్కువ-పది, పన్నెండు-ఉండేటట్లు చేసుకోండి. ఇవి కూడా మీరు మహోన్నత ఆశయాలు: త్యాగం, దేశభక్తి, విశ్వమానవ ప్రేమ, నాయకత్వం వంటివి రాసుకుంటే అది గొప్ప విషయమే. సాధ్యమైనంత వరకూ సామాన్య స్థాయిలోవి రాసుకుంటే మంచిది. "మీకు కనపడే సోదరుణ్ని ప్రేమించ లేనివారు కనబడని దేవుడిని ఎలా ప్రేమించగలరు?" అని బైబిల్ సూక్తి ఉంది. మన చుట్టూ ఉన్న వారితో మనం చక్కగా, మంచిగా వ్యవహరిస్తే, మన దేశానికి గొప్ప సేవ చేసినట్లే. అందువల్ల మీరు నిత్య జీవితంలో శాంతంగా, సౌఖ్యంగా నడుచుకుంటుకు అవసరమైన, సులభసాధ్యమైన లక్షణాలనే ఎన్నుకోండి. ఇవి అన్నీ సాధించిననాడు మీరు మరింత ఉన్నత శిఖరాల అధిరోహించవచ్చు ఈ లక్షణాల క్రింద కూడా అడ్డగీత గీయండి.

తక్కిన ఖాళీలో, మీరు సరిదిద్దుకోవలసినవి కానీ, వదిలించుకోవలసినవి కానీ, పొరబాట్లు కానీ, అలవాట్లు కానీ, లక్షణాలు కానీ ఉంటే రాసుకోండి. ఇక్కడే పైన చెప్పినట్లు చాలా కష్టం ఎదురవుతుంది. కొన్ని మనకు తెలుస్తాయి కాని బలంగా పాతుకు పోయిన అలవాట్ల మూలంగా వాటిని దిద్ద లేక పోతాము. ఉదాహరణకు త్రాగే వాడెవడూ తను చేస్తున్నది మంచిపని అనేవాడు ఉండడు సాధారణంగా. ఇక మరికొన్ని అలవాట్లు

ఉంటాయి. అవి కూడా మనకు తెలుసు అయినా వాటిని కూడా దిద్దుకో లేము, దానికి మరేమిటో బలీయమైన పరిస్థితులు కారణంగా చెబుతాము. ఉదాహరణకి అప్పులు చేసి తీర్చక పోవడం, అను కున్న సమయానికి అనుకున్న చోటికి చేరుకోవడం కానీ, పని చేయడం కానీ చేయలేక పోవడం మాట నిలుపుకోలేక పోవడం వగైరా. వీటిని కూడా అలా వదిలేయండి. మరికొన్ని దుర్లక్షణాలు కానీ, పొరబాట్లు కానీ మనం తెలుసుకోలేం. ఎందు కంటే వాటి ఫలితాలు అనుభవించేది ఇతరులు. కాని పరీక్షించగా అ ఫలితాల ప్రభావం మన మీద ఉంటుంది. ఉదాహరణకి మనతో అందరూ పోట్లాడ తారనుకోండి. దానికి అసలు కారణం మనమే అందరితో పోట్లాడే లక్ష ణాలు కలగి ఉండటమే కావచ్చు కాని అధికార మదాంధత వల్లో, అత్మాతి శయంవల్లో మనం గుర్తించ లేక పోతాము. తమ క్రింది ఉద్యోగుల మీద స్వారీచేసే అధికార్లు ఈ కోవ క్రిందకే వస్తారు. తామంటే అందరూ భయ పడతారని అదేదో గొప్ప అయినట్లు చెప్పకుంటారు. కాని అలా భయపడేది వారి చేతిలో ఉన్న అధికారానికే. ఆ అధికారం పోయిననాడు బంట్రోతు కూడా వారి ముందు లేచి నిలబడడు. ఇలాంటి లోటు పాట్లు వగైరా వీపు వెనక వ్యాఖ్యార్లో తెలిసిపోతాయి. నిజంగా వీపు వెనక వ్యాఖ్యలే కదా ? అవి వినరావడంచాలా అరుదు. మన ఆత్మీయులు గాని స్నేహితులైనా మనకి ఎక్స్ రేఫొటో ఇవ్వరు. అలాగే మన మాటల తీరుతో కానీ, ప్రవర్తించే రీతిలో కానీ,చేసే పనుల్లో కానీ,ఉండే కొన్ని అభిలషణీయంకాని లక్షణాలు వగైరా కూడా మనకి తెలియక పోవచ్చు కాని అవే ఇతరుల్లో ఇట్టే పట్టివేస్తాం. వాళ్ళని - అవును వారి వీపు వెనక - వెక్కిరిస్తాం కూడా. అందుకే బైబిల్ లో ఒక సూక్తి ఉంది: ఎదర వాని కంటిలో నలుసు ఎత్తిచూపే ముందు నీ కంట్లో దూలాన్ని (అసలు మాట దూల మేనా అని నాకు కొంచెం సందేహం) తొలగించుకో అని.

ఏమైనా మనలో పరిహరించుకోవలసినవి కనుగొనడం కష్టం అనుకున్నాంగదా! కాని ఏదీ అసాధ్యం మాత్రం కాదు. కాబట్టి కష్టమైనా ప్రయత్నం చేయడం మంచిది. మన హితమే కోరే ఆత్మీయుల్ని, మిత్రుల్ని నిజాయితీగా అడిగితే వారు మన స్వభావానికి అద్దం పెట్టి చూపవచ్చు కాని సత్యమంతా చెబుతారనేది సందేహమే! ఎందుకంటే విమర్శ నాహ్వానిస్తా మని మనం ఎంత అనుకున్నా ఆ విమర్శ ఎదురయ్యేటప్పటికి తట్టుకోలేక పోవచ్చు. ఒక్కొక్కప్పుడు కోపం వచ్చి అవతలివాడిని శత్రువులా చూసే దృష్టి చేస్తుంది కూడా. అందు వల్ల ఆత్మ పరిశీలనమే ఉత్తమమైన పద్ధతి. ఎప్పుడైనా తీరికగా, ఏకాంతంలో మనల్ని మనం పరీక్ష చేసుకొని విశ్లేషణ చేసి చూసుకుంటే మన "ప్లస్"లూ "మైనస్"లూ తెలుసుకోగలుగుతాం. దీనికి కూడా ఒక సులువు ఉంది. మనతో ఇతరులు ఎలా వ్యవహరిస్తున్నారో పరిశీలిస్తే వారి వ్యవహారంలో కొంతవరకు మన నడవడే ప్రతిఫలిస్తుంది. అలా ఆత్మ పరీక్షలో మనకి ఏవైతే లోపాలు తోచాయో, మనలో పట్టుదల ఉంటే వాటిని సరిదిద్దుకోగల మన్నమాటే. ఆత్మ పరీక్షలో కూడా మనలో అవని లోపాలున్నాయంటే వాటిని తొలగించుకోవడం చాలా కష్టమని గుర్తించడం మంచిది. జాబితా తయారైంది కదా ఆ జాబితా కూడా కొంచెం అందంగా తయారుచేసుకోండి. అంటే మీకు ఆ కార్డు తరచు చూడాలనిపించాలి. కార్డు చుట్టూరా అంచూ, మధ్య నిలువుగీతలూ, అడ్డగీతలూ రెండు మూడు రంగుల్లో గీసుకోవచ్చు. కార్డు పై భాగాన ఒక గడిలో మీకు ఇష్టమైన సూక్తి ఒకటి రాసుకోండి. కార్డు మధ్యలో పాస్ పోర్ట్ సైజు ఫోటో ఒకటి అంటించుకోండి. అందమైన తరళాక్షిదో, లేక బోసి నవ్వుల పసిపాపదో లేక మీకు అలా తోస్తే మిమ్మల్ని ఉత్తేజపరిచే మహా వ్యక్తిదో ఏదీ కాకపోతే, మీకు మిక్కిలి ఇష్టమైన పువ్వుదో. పువ్వు ఎందుకన్నా నంటే ఎవరు చూసినా చూడక పోయినా పువ్వు తన అందం, సౌరభం వెద

జల్లుతూనే ఉంటుంది. అలాగే మీ వ్యవహారం కూడా ఉండాలి సుమా అని మీకు గుర్తు చేసేందుకే.

అంతా సిద్ధం చేసుకున్నాం కదా, ఇక ఆచరణకి వద్దాం. అసలు యుద్ధం ఇప్పుడే ప్రారంభమౌతుందని మిమ్మల్ని భయపెట్టదలుచుకోలేదు. మీరు నడుం బిగించి, పళ్ళు నొక్కిపట్టి, గుప్పిళ్ళు మూసి ముందుకు పోక నక్కరలేదు. ఎందుకంటే శత్రువెక్కడో బయటలేడు. ఉన్నది మనమే. మనల్ని మనం చెంపలు వాయించుకోలేము. ఎంత అనుకున్నా ఎదరవాడి చెంప పేల్చేటంత శక్తి మన చేతుల్లో మన మీద రాదు. ఇక తల గోడ కేసి బాదు కోవడం, వద్దు వద్దు, అదిమరీమోటు. మనపట్లయినా మనం ప్రేమతో, ఓర్పుతో, విశ్వాసంతో వ్యవహరిద్దాం.

ముందు, సూచనలు: ఉదయమే తొలిగా మనదినచర్య పుస్తకంతెరిచి నప్పుడు ఆరోజు ఎవర్నైనా కలుసుకొని మాట్లాడ వలసిఉన్నా, ఏదైనా దరఖాస్తుకానీ, మరే పత్రంకానీ పంపవలసిఉన్నా, ఉత్తరం రాయవలసి ఉన్నా, లేక ఏ రుసుం అయినా కట్టవలసిఉన్నా, ఏదైనా కొనవలసి ఉన్నా, పనిచేయవలసి ఉన్నా కార్డు మీద ఈ సూచనలు చూసుకొని జ్ఞాపకం చేసుకోవడం మంచిది. అంతే కాదు దినచర్యలో కూడా రాసుకొని అప్పటికీ మరచి పోతామనుకుంటే, ఒక చీటి మనజేబులో పెట్టుకోవడమో రుమాలు ముడి వేసుకోవడమో, వేలికి దారం కట్టుకోవడమో మంచిది. మతి మరుపు చాలా పెద్దదండీ. మహాపెద్దవాళ్ళు కూడా దానివలలో పడిపోతారు. దానిని పెను భూతం అనవద్దు. టి - వి చిత్రంలోని చిన్నారి చేతన్‌లాగా అది కొంటె భూతం అందాం. మనతో ఆటలాడి మనల్ని ఏడిపిస్తుందన్నమాట. ఎక్కడికో వెళ్ళిపోతాం, తీరా అక్కడికి వెళ్ళిన తరువాత అసలు అక్కడికి ఎందుకు వచ్చామో జ్ఞాపకం రాదు. లేదా అక్కడ మనకి తప్పని సరిగా

కావలసినది తేవడం మరచి పోతాం. మతి మరుపు కథలు బోలెడు. అవి వినోదం కలిగిస్తాయి. ఒకాయన తపాలా పెట్టెలో గొడుగుకుక్కి పోస్టు చేయవలసిన కార్డు నెత్తిమీద పెట్టుకొని పోయాడట. మరొకడు చేతిలో సీసా తీసుకొని అటూఇటూ తెగవణికి పోతూ ఉంటే "ఏమిటి ఎందుకలా వణికి పోతున్నావు" అని ఎవరో అడిగితే "అయ్యో! సీసా గుంజడం మరిచిపోయి నన్ను నేను గుంజేసుకుంటున్నాన"న్నాడట. ఇంత కన్నా దారుణం, మతి మరుపు భార్యా భర్తలు-అవును, ఇద్దరికీమతిమరుపే-గదిలో కూర్చుని తమ పనులు చూసుకొంటున్నారట ఇంతలో బయట ఎవ్వరిదో అడుగుల సవ్వడి అయిందట, అదివిని మతిమరుపు భార్య "ఆయన వచ్చారు" అందిట.దానితో మతి మరుపు భర్త ఎగిరి గంతేసి, దొడ్డి గుమ్మం వైపు నుంచి పారి పోయాడట. ఈ చిన్నారి భూతం మరుపు కొంటె చేష్టల నుంచి తప్పించు కుందుకు దినచర్య ఒక్కటే మనకు రక్ష.

ఉదయం దినచర్య తెరవగానే ఆ రోజు చేయవలసినవి గుర్తు చేసు కుని రాసుకోవడం మంచిదను కున్నాం కదా. కాని తీరా మనకి ఉదయం గుర్తురాక పోతే? కాబట్టి ఆ వేళే కాకుండా ముందు రోజే మర్నాటికి సంబంధించిన పుటలో రాసుకోవడం మంచిది. అంతేకాదు, ఒక దరఖాస్తు పంపాలనుకోండి. దానికి కొన్ని వివరాలూ పత్రాలూ కావలసి ఉంటుంది. అప్పటి కప్పుడు తయారు చేసుకోవడం కష్టం. అందువల్ల ఎన్ని రోజుల ముందు జాగ్రత్త పడవలసి ఉంటుందో ఆ రోజు నుంచి ఆ విషయం జ్ఞాపకం చేస్తూ, దినచర్యలో ఆయా తేదీల పుటల్లో వరుసగా ఆ విషయం రాసి పెట్టుకోండి. అలాగే ఒక రుసుం కట్టాలి. లేదా ఎవరికో డబ్బివ్వాలి. అప్పటి కప్పుడు సర్దుబాటు కావడం కష్టం అందువల్ల అలాంటివి కూడా ముందు నుంచే గుర్తు పెట్టుకోవడం మంచిది. ఉదాహరణకి ఏదో ఫీజు 10 వ తేదీన కట్టాలి అనుకోండి. సరిగ్గా ఆ రోజే పెత్తే ఆఫీస్‌లో రద్దీవల్ల

పన్ను కట్టడం చాలా కష్టం కావచ్చు. అందువల్ల 8వ తేదీ పన్ను కట్ట వలసిన రోజు అని నిర్ణయించుకొని ఆరోజు దినచర్యలో ముందే రాసు కోవాలి. అంతే కాదు 1వ తారీఖు నుంచే పన్ను కట్టవలసిన విషయం గుర్తు రాసుకొని ఉంచడం మంచిది. ఈ విధంగానే మీరు తక్కిన సూచనలు- మీరే ఎన్నుకున్నారు కదా - పాటించడం విషయంలో తగు జాగ్రత్తలు తీసుకోండి. ఈ విధంగా మీ దినచర్య పుస్తకం మీకు జీవితంలో మంచి ఉపయోగ కరమైన సాధనంగా ఋజువు అవుతుంది.

ఇక అలవరచుకోవలసిన మంచి లక్షణాలు కానీ, అలవాట్లు కానీ చూద్దాం. దినచర్య పుస్తకం తొలిసారి తెరిచినప్పుడు - ఉదయం మీ కాల కృత్యాలలో అదొక భాగమై పోవాలి - అవే మరిచి పోతే అసలుకే మోసం వస్తుంది సుమా - ఆ లక్షణాల జాబితా ఒక్కసారి చదివి ఒకటి రెండు లక్షణాల చొప్పున ఒక్కొక్క దాని మీద ఆలోచించండి,అంతే.అంటే మొత్తం మీద నిమిషమో నిమిషమున్నరో పడుతుంది. ఆ మాత్రం ఖర్చు చేయలేరా? వెనుక ఒక జపానీస్ వ్యక్తి న్యూయార్క్ వెళ్ళాడట. అతని అమెరికన్ మిత్రుడు ఒక అండర్ గ్రౌండ్ ట్రెయిన్ ఎక్కించబోయి, గబు క్కున అప్పుడే కదులు తున్న మరో బండిలో ఎక్కించాడట. అందువల్ల వారు చేరవలసిన చోటుకి ఒక అరనిమిషం ముందు చేరారట. అప్పుడు "అయ్యో ఈ అరనిమిషం ఏమి చెయ్యను?"అని గోల పెట్టాడట. ఆ జపా నీస్ వ్యక్తి. అంటే అరనిమిష మైనా ఏదో చేయకుండ వ్యర్థం చేయక పోవడం అతని స్వభావం. అతనికే కాదు, ఆ జాతికే స్వభావం అని చెప్పాలి. సమయం విలువ బాగా తెలుసు కాబట్టే, ఆ జాతి అంత ముందుకు వచ్చింది. ఒక్క నిమిషమైనా పోతే అది ఎల్లకాలానికి పోయినట్లే అన్న సూక్తి వారు అక్షరాలా పాటిస్తారన్న మాట. కాని మనం ఇక్కడ నిమి షమో, నిమిషంన్నరో వ్యర్థం చేయడం లేదు కదా.

ఒక మంచి పనికే వాడుకున్నాం. అందువల్ల కొద్ది క్షణాల చొప్పున మీరు స్వయంగా గుర్తించిన మంచి లక్షణాలను గురించి ఆలోచించండి. ఊరికే అలా ఆలోచిస్తే ఏమవుతుంది, అని ప్రశ్నించవచ్చు మీరు హిప్నాటిజం గురించి వినే ఉంటారు. అందులో ఇతరులకి హిప్నాసిస్ క్రింద సూచనలు చేయడమే కాకుండా మనకు మనం కూడా సూచనలు చేసుకోవచ్చు. దానిని ఇంగ్లీష్‌లో "ఆటో సజెశ్చన్" అంటారు. అలాగే రోజూ ఉదయం కొన్ని లక్షణాలు ఒక్కొక్క మంచి లక్షణం మీద ఆలోచించడంవల్ల మెల్లగా మీ మనస్సులో వాటిని స్థిరంగా అవలంబించేందుకు తగ్గ అనుకూలత ఏర్పడుతుంది.

తరువాత మీరు పరిహరించుకోవాలన్న బలహీనతలు కానీ, పొరపాట్లు కానీ గమనించి ఆలోచించండి. ఇక్కడ వీటి మీద ధ్యానించడం కాదు కావలసింది. అవి మీవ్యక్తిత్వ మీద ఏ ప్రభావం చూపుతున్నదీ, ఇతరులతో వ్యవహారంలో అవి ఎలా వ్యక్త మవుతున్నదీ, దాని వల్ల ఏమైనా పరిణామాలున్నదీ, కొద్దిగా ఆలోచించండి. వారానికో రోజు - అది ఆదివారమే అనుకోండి - కొంచెం దీర్ఘంగా ఆలోచించుకోండి - చాలా అవసరమైనది కాబట్టి. రోజు ఒకటి రెండు నిముషాలు ఈ జాబితా చూసి ఆ ఆలోచన గుర్తు చేసుకుంటే చాలు, అంతే పొద్దున్న చేయవలసినది - మీ దినచర్య పుస్తకం సంబంధించినంత వరకూ - అయిపోయింది.

సాయంత్రానికి వద్దాం. పడుకోబోయే ముందు కొంత కార్యక్రమం - దినచర్య రాయడం - చేయవలసి ఉంది. ఇదే అతి ముఖ్యమైన విధి. అందువల్ల అదొక తప్పని సరి నియమంగా పాటించండి. మరీ పడుకునే వేళ అయితే ఆ పని చేయబోతే కళ్ళనిండా నిద్ర ముంచుకు వచ్చి రాత సగంలోనే ఆగిపోవచ్చు. ఏదో రాయబోయి మరేదో రాయవచ్చు. కాబట్టి

నిద్రాదేవి అడుగుల సవ్వడి వినబడక మునుపే, కొంత సమయం ఏకాంతంగా కూర్చుని కార్యక్రమానికి ఉపక్రమించండి.

ఒక వేళ ఎప్పుడైనా మీకు తగిన తీరిక లేదనుకోండి. మర్నాడు ఉదయమే దినచర్య పుస్తకం తెరచి, ముందు గతం రోజు దినచర్య రాయండి. ఆ పైన అంతకు ముందు చెప్పిన విధంగా ఆ రోజు కార్యక్రమం గురించి ఆలోచించ వచ్చు. ఇదిఒక విధంగా మంచిదికూడా. ఒకటి, ఆరోజు కన్నా మర్నాడు మరికొంత శాంతంగా ముందు రోజు దినచర్యని సింహావలోకనం చేసుకొని రాసుకోవచ్చు. రెండవది, ముందురోజు అనుభవం ఆధారం చేసుకొని ఆరోజు కార్యక్రమం మరింత బాగా రూపొందించుకోవచ్చు. మూడవది, ఉదయం వేళ సాధారణంగా మీ మనస్సూ తాజాగా ఉంటుంది. తగిన ఏకాంతమూ లభిస్తుంది. నాలుగవది, "ఇన్ని పాయింట్లే?" - అవును, అయినా మనకు అనుకూలమైనవే గదా - రెండు కార్యక్రమాలూ కలిపి వేయడం వల్ల కొంత సమయమూ కలిసి రావచ్చు - కొన్ని నిమిషాలే కావచ్చు.అయినాపోయిన నిమిషంమరెన్నడూ తిరిగిరాదనుకున్నాం కదా,

మీరు ఏ విధంగా చేసుకున్నా సరే, దినచర్య రాయడానికి సిద్ధపడ్డారు కదా. ముందు, సూచనలు చూడండి. మీరు అనుకున్న కార్యక్రమాలు పూర్తి చేశారా లేదా చూసుకొని ఆ విషయం రాసుకోండి. ఒకవేళ వాయిదా వేయవలసి వచ్చింది. ఎప్పటికి వాయిదా వేయవలసి వచ్చిందీ గుర్తుపెట్టుకోండి. తరువాత,అలవరచు కోవాలన్న లక్షణాలూ, వదులుకోవాలను కున్న దుర్లక్షణాలూ జాబితా ఒక మారుచూసుకొని, ఆమీదట మీకు ఆ రోజు కలిగిన అనుభవాలూ, కలుసుకున్న వ్యక్తులూ, చూసిన విషయాలూ, వచ్చిన ఆలోచనలూ అన్నీ టూకీగానే - రాయండి. ముఖ్యంగా మీకు తటస్థపడ్డ వ్యక్తుల్ని అందర్నీ గుర్తుచేసుకొని వారిని గురించి కొద్ది కొద్దిగా రాయండి. ఆ విషయాలు రికార్డ్ చేసుకున్న మూలంగా భవిష్యత్తులో

మీరు ఆ వ్యక్తులతో వ్యవహరించేటప్పుడు మరింత మెలకువతో, అవగాహన తో ఉండగలుగుతారు.

అంతే కాదు ఒకప్పుడు పెల్మన్ ఇనిస్టిట్యూట్ అనేది ఢిల్లీ నుంచి టపా ద్వారా 'పెల్మనిజం' శిక్షణా కార్యక్రమం నేర్పేది. శిక్షణార్థుల సామర్థ్యం, పరాకేతనం పెంచడమే ఆ కోర్సు లక్ష్యం. ఆ సంస్థ ఇచ్చే పాఠాల్లో ఒకదానితో మీకెదురు పడ్డవ్యక్తుల చొక్కా బొత్తములు ఏ రంగు లో ఎలా ఉన్నాయో, జుట్టు ఎలా దువ్వుకున్నాడో వగైరా గమనించి రాయమని ఒక సూచన ఉంది. అవి మిక్కిలి చిన్న విషయాలనుకుంటాం. కాని అలాంటివి కూడా గమనించడం ద్వారా, మన పరిశీలనా శక్తి పెరుగు తుంది. షెర్లాక్ హోమ్స్ కథలు మీరు చదివే ఉంటారు. ఆ ప్రసిద్ధ నేర పరిశోధకుడు - కల్పిత పాత్రఅనుకోండి - ఒక్క సారి అలా చూశాడంటే ఎన్నో వివరాలు - ఇతరులెవరి దృష్టికీ తోచనివి - ఇట్టే గమనించి వాటి ఆధారంగా అద్భుత నిష్కర్షలు తేల్చేవాడు. ఈనాటి అపరాధ పరిశోధకులు కూడా ఆయన బాటలో నడవటానికి ప్రయత్నిస్తారు. మరొక ఉదాహరణ ఎన్నో దశాబ్దాల క్రితం పారిస్ మహానగరంలో దారుణ హత్యలెన్నో జరగసాగాయట. డిటెక్టివ్‌లు ఎంత ప్రయత్నించినా హంతకుణ్ణి కనుగోలేక పోయారట. ఒక అపరాధ పరిశోధక విభాగం అధికారి ఒకడు న్యాయాధి కారితో ఆ కేసు విషయమై ముచ్చటిస్తున్నడట. ఆ న్యాయాధికారి ఇంటి నిండా పెంపుడు పిట్టలున్నాయి. ఒక పిట్టవచ్చి న్యాయాధికారి చేతి మీద వాలింది. ఆయన మాట్లాడుతూ మాట్లాడుతూ పుల్లని విరిచినట్లు ఆ పిట్ట మెడవిరిచేసి పక్కకి పడేశాడట. పరిశోధనాధికారి ఆ చేష్టను గమనించాడు అది అతనికి చాలా విడ్డూరంగా తోచింది. తరువాత అతడు రహస్యంగా ఆ న్యాయాధికారి మీదే పరిశోధన సాగించాడట. ఆ న్యాయాధికారే హంత కుడని తేలిందట.

చూశారా ఒకచిన్న చేష్టని గమనించడం ఎంతటి సత్యాన్ని బయటికి లాగిందో ! నిజంగా చూపులో ఒక చిన్న మార్పు, ఒకనరం కొట్టుకోవడం, వేళ్ళ కదలికా మనకు అవతలి వ్యక్తి మన స్థితిని అతని మాటలకన్నా బాగా తెలియజేస్తాయి. అంతేకాదు. ఇలాంటి చిన్న సంకేతాలే ఒక్కొక్కప్పుడు మనం పెద్ద అపాయం నుంచి తప్పించుకోడానికి తోడ్పడతాయి.సమయానికి హెచ్చరిస్తాయి. కాని అలాంటి చిన్న సంకేతాలని గమనించడం మన పరిశీలనా శక్తికి వాడి, వేగమూ ఉంటేనే సాధ్యమౌతుంది. మీ దినచర్యలో మీరు పైన సూచించిన విధంగా రాసుకొనే వివరాలు మీ పరిశీలనా శక్తిని పదును పెట్టడానికి ఉపయోగిస్తాయి.

మీరు తీసుకోవలసిన ముఖ్యమైన జాగ్రత్త ఒకటి ఉంది. మీ దినచర్య పుస్తకం ఇతరు లెవరి కంట పడకుండా పదిలంగా దాస్తూ ఉండండి. మీ రహస్యం పదిలం కాబట్టి మీ దినచర్యలో మీకు కలిగిన అనుభూతులూ, ఆలోచనలూ స్వేచ్ఛగా రాసేసుకోండి. మీ దినచర్యే మీకు అత్యంత ఆప్త మిత్రుడనుకోండి. ఆ మిత్రుడి ముందు మీ కష్టాలూ, సుఖాలూ, ఆశలూ, ఊహలూ విశ్వసించుకోండి. ఇది మీకొక సౌకర్యమేకాదు, మీ మానసిక ఆరోగ్యానికి పరప్రసాదిని కూడా అవుతుంది. ఫ్రాయిడ్‌ని గురించీ, సైకో ఎనాలిసిస్ (మనోవిశ్లేషణ) గురించీ తెలియని వారుండరు. ఈ మనోవిశ్లేషణ లో చేసేదల్లా మనస్సులో ఎక్కడెక్కడో అణచినవీ, దాచినవీ,భావాలనుకానీ అనుభూతులనుకానీ బయటికి తీసుకు వచ్చి చైతన్యం వెలుగులో పరిశీలించడమే. అందుకే "సైకియాట్రిస్ట్". (మనోవిశ్లేషణ వైద్యులు) అంటే 'కౌచ్' (మెత్తటి సోఫా లేదా మంచం) గుర్తుకు వస్తుంది. ఆ నిపుణుడు మిమ్మల్ని ఆ 'కౌచ్' మీద సుఖంగా, విశ్రాంతిగా పడుకోజేసి మిమ్మల్ని మీ సొద చెప్పించేటట్టు చేసి ఎంతో ఓపికతో వింటాడు. ఆయన ఓపికకి మీకు ఆశ్చర్యం కలుగుతుంది. కాని అది చాలా ఖరీదైనదని మీకు అతి త్వరలోనే

తెలిసివస్తుంది. అందువల్లే పడమటి దేశాల్లో సాధారణంగా ధనవంతులే మానసిక వ్యాధి చికిత్స అనే పై భోగం అనుభవిస్తారు. అలాంటి ఖర్చులు ఏమీలేకుండా మన దినచర్యద్వారా మనం మన మనసుల్ని శుభ్రపరుచు కుంటామన్నమాట. అందువల్ల మీకు తోచినదల్లా రాసేయండి - ఎటువచ్చి ఏ భుజం మీద నుంచి ఎవ్వరూ తొంగి చూడ కుండా జాగ్రత్తపడండి, అంతే.

దినచర్య వల్ల మీకు మరో లాభం ఉంది. పోడగా పోడగా రాగ మతిశో ఉల్లి సట్లు రాయగారాఁపగా మీలో నుంచి ఒక మంచి రచయిత బయట పడవచ్చు. ప్రతివ్యక్తి జీవితంలోనూ కనీసం ఒక నవలకు సరిపడా వస్తువు ఉంటుందని ఎవరో అన్నారు. అందువల్ల మీరు మాత్రం మంచి రచయిత కాలేరని ఎక్కడ ఉంది? కనీసం మీ శైలిలో, అభివ్యక్తిలో అభివృద్ధి వచ్చి తీరుతుంది. అది మంచికే కదా.

ఈ దినచర్య ఆధారంగానే తరువాత ఆత్మ కథలూ, జీవిత కథలూ రాయడం జరుగుతూ ఉంటుంది. అంతే కాదు. ఈ దినచర్యనే కొద్దిగా సంస్కరించి పుస్తకాలుగా ప్రచురించడం కూడా జరుగుతోంది. గొప్పవారి "డయిరీ" లకి అపురూప వస్తువులుగా కూడా గొప్ప గిరాకీ ఉంది. అవి గొప్పవారి విషయంలో కదా అనవచ్చు. మీ దినచర్య విలువ ముందే ఎలా నిర్ణయించ గలరు? ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో హాలెండ్ లో 14 ఏళ్ళ అన్‌ఫ్రాంక్ అన్న యూదు బాలిక రాసుకున్న దినచర్య నాజీజం పైశాచిక స్వరూపాన్ని ప్రభావవంతంగా చిత్రించడంలో అసాధారణ సాఫల్యం సాధించి ప్రపంచ సాహిత్యంలో ఒక స్థానం పొందింది. ఆ 'డయిరీ' యే తరువాత ఒక మంచిచిత్రంగా కూడా వచ్చింది. 17వ శతాబ్దంలో లండన్‌లో జీవించిన నౌకాదళాధికారి శామ్యూల్ పీప్స అనే

అతడు ఎవరికీ తెలియని రహస్యలిపిలో తన దినచర్యను రాసుకొన్నాడు. కాని ఆ తరువాత ఎవరో ఆ 'డయరీ'లను కనుగొని, రహస్యలిపిని విప్పి, ప్రచురించే సరికి పెద్దసంచలనం కలిగింది. 1665లో ప్లేగు వ్యాధి, 1666లో ఒక గొప్ప అగ్ని ప్రమాదం సంఘటనలను కళ్ళకు కట్టినట్లు చిత్రించడమే కాక ఆనాటి పరిస్థితుల్ని వ్యక్తుల్ని వర్ణించడంలో కూడా ఆ డయరీ పేరు సాధించి ఇంగ్లీషు సాహిత్యంలో ప్రత్యేక స్థానం పొందింది. మీ డయరీ సాహిత్యంలో స్థానం పొందక పోయినా, కొన్నాళ్ళు పోయిన తరువాత మీకే మరి ఏ సాహిత్య గ్రంథమూ ఇవ్వజాలని ప్రత్యేక ఆనందం కలిగజేస్తుంది... కాబట్టి దినచర్య రాస్తారు కదూ ?

ఆఁ, ఆఁ అప్పుడే అయిపోలేదండీ. పై విధంగా రాసిన తరువాత ఒక అడ్డగీత గీసి, అలవరచుకోవలసిన మంచి లక్షణాలనుకొన్నాటి, వాటిలో ఏవైనా మీరు ఆరోజు జీవితంలో స్పష్టంగా ప్రదర్శించి ఉండే ఆ విషయం రాసుకోండి. అలాగే మీరు వదిలించుకోవలసిన అవగుణాలు కానీ, అలవాట్లు కానీ, ఆరోజు మీరు తప్పించుకొని ఉంటే, అది కూడా గుర్తు పెట్టుకోండి. స్పష్టంగా వైఫల్యం పొంది ఉంటే కూడా రాసుకోండి.

ఇంతే మీరు చేయవలసినది. వెంటనే మీకు ఏమీ ఫలితం కనిపించక పోవచ్చు కాని క్రమేణా మీలో కొంత మార్పు వచ్చిందని మీకే గమనిస్తారు. ఎటు వచ్చీ మీరు కొంచెం పూనిక కలిగి ఉండాలి. చస్తే నాలో మార్పు రాదు, అని నిరాశావాదం ప్రకటిస్తే ఎవరూ ఏమీ చేయలేరు. మీరు అలాంటి వారు కారని స్పష్టమే కదా, లేక పోతే ఈ పుస్తకం ఇంతవరకూ చదవరు. మీలో ఇంకా పైకి పోవాలన్న తపన ఉన్నట్లే.

---

- అందం కంటిని ఆకట్టుకుంటుంది, సౌశీల్యం హృదయాన్ని దోచుకుంటుంది.
- అణకువను మించిన భూషణం లేదు.

5

# రూపాయిలూ, పైసలూ

మనం తలపెట్టిన ఆత్మాభివృద్ధి కార్యక్రమానికి ఒక అత్యవసరమైన సాధనం - దినచర్య — గురించి ముందు అధ్యాయంతో చర్చించుకున్నాం. ఇప్పుడు రెండో దానిని గురించి ఆలోచిద్దాం. అది జమాఖర్చుల పుస్తకం. మహావ్యక్తి కోసం ఎదురుచూస్తుంటే మరుగుజ్జు దర్శన మిచ్చినట్లుంది కదా మీకు ? నేను ముందే చెప్పాను కదా. మనం ఏదో మహోన్నత ఆశయాల వెనక ఎగిరిపోవద్దనీ, సామాన్య మానవులుగా, ఈ భూమి మీదే సరైన నడకలు సాగిద్దామనీ, కొందరున్నారు చూడండి, వారెప్పుడూ సమాజమూ, దేశమూ, విశ్వమానవతా వంటి ఉన్నత విషయాల గురించే మాట్లాడుతూ ఉంటారు. తీరాచూస్తే వారి దగ్గర ప్రయాణానికి పైసలు కూడా ఉండవు. మనమే వారికి భక్తి పూర్వకంగా పాతికో, పరకో ఇచ్చి, మన నుంచి అటువంటి వారు ఒక చిన్న సహాయం స్వీకరించి మనల్ని ధన్యుల్ని చేసినందుకు కృతజ్ఞతతో సాగనంపుతాం. తరువాత ఆ పాతికో పరకో వస్తుందని ఎదురు చూస్తే - అవి అయినా మన ఎత్తుకి పెద్దమొత్తాలే - అటువంటి మహనీయుల విశాల దృష్టిలో ఇటువంటి అత్యల్ప విషయాలు ఉండవని తెలుస్తుంది. రాయలసీమలో ఒకసామెత ఉంది: 'స్వాములొస్తున్నారు, చెంబూ తపేలా జాగ్రత్త' అని. వారు స్వాములవార్లు కదా. వారికి ఈ జగత్తు అశాశ్వతమనీ, మనకు కనబడే దంతా మాయ అనీ, తెలుసును కదా వారికి స్వపర భేదముండదు. వారికి మన వస్తువులు మనవని తెలియదు కాబట్టి అ

వారితో బాటు వెళ్ళిపోవచ్చు. మనం కుర్యా మిత్రో అంటే "ఏమో ఆ వస్తువులే ఎక్కడ ఉన్నాయో మాకేమి ఎరుక నాయనా" అంటారు. అంతగా నిందిస్తే "అసలే అనిత్యమయిన ఈ జగత్తులో నీదినాది అంటూ ఏముంటుంది పిచ్చివాడా? నీదనేది కనిపిస్తే పట్టుకుపో, మేము కాదన్నామా?" అంటారు. మనం నిస్సంగులం, నిరాసక్తులం కాము. ఈ జగత్తు అవాస్తవమే కావచ్చు కాని, అవాస్తవమయిన మనకి ఈ అవాస్తవమైన జగత్తు కూడ యదార్థమే. చేతిలో చిల్లిగవ్వలేక రెండు రోజులు పస్తులుండవలసివస్తే ఈ విషయం తెలిసి వస్తుంది. అందుకే ఈ పెద్దలు 'అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా, అందుకే ఈ పాడు పొట్టకు అన్నమే వేస్తాము రా,' అన్నట్లు వ్యవహరిస్తారు.

జీవిత మన్నది తమాషాయే అయినా అడుగడుగునా అనేకానేక సమస్యలూ ఎదురవుతూనే ఉంటాయి. ఎక్కడ ముళ్ళగుచ్చు కుంటాయో గొప్పుతగులు తుందో, గోతిలో పడతామో ముందే చెప్పలేం. కాబట్టి కళ్ళునేల మీద పెట్టుకొని నడవడం మంచిది.

మనకి కనిపించే జీవిత కఠిన యథార్థంలో ముఖ్యమైనది డబ్బు. "ధనమూల మిదం జగత్" అన్న సామెత కూడా ఉంది కదా. డబ్బు మీదే దృష్టి కేంద్రీకరించడం నీచమే కావచ్చు, దానికే ప్రాధాన్య మివ్వడం అల్పబుద్ధి చిహ్నం కావచ్చు కాని కఠిన యథార్థాన్ని కాదనలేం. హోటలులో దండిగా తిని బిల్లు చెల్లించ కుండా బయటికి రాబోతే ఇది బాగా బోధపడుతుంది. అందువల్ల మనం డబ్బుకే సర్వోపరి ప్రాధాన్యం ఇవ్వక పోయినా కఠినయదార్థానికి ఇవ్వదగినంత ప్రాధాన్యం ఇద్దాం. మేము ఆ ప్రాధాన్యం కూడా ఇవ్వము అనడం ఉత్త కపటం. మనకి కపటం వద్దు.

ఈ డబ్బు విషయమై జాగ్రత్తగా వ్యవహరించేందుకే జమా ఖర్చుల పుస్తకం. మీ దినచర్య ద్వారా సమయాన్నీ, ఈ జమా ఖర్చుల పుస్తకం ద్వారా మీ ఆదాయ వ్యయాలనీ అదుపులో పెట్టుకోగలిగితే మీరు జీవితంలో సగం గెలుపు సాధించినట్టే.

ఇక్కడ ఒక ఇంగ్లీషు సామెత గుర్తుకు వస్తుంది. 'టేక్ కేర్ ఆఫ్ ద పెన్స్, పౌండ్జ్ విల్ టేక్ కేర్ అఫ్ దెమ్ సెల్వజ్' అని. అంటే మీరు పైసల్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండండి, రూపాయిలు అదంతట అవే జాగ్రత్త పడతాయి. పొదుపు అన్నది మిక్కిలి చిన్న విషయాల పట్ల కూడా తగు శ్రద్ధ వహించడమే. కాని అటు ఇంకో (ఇంగ్లీషువే) సామెత వుందండీ 'పెనీవైజ్, పౌండ్ ఫూలిష్' అని అంటే పైసల్లోనే జాగ్రత్త, రూపాయిల్లో తెలివి తక్కువ. ఈ రెండు సామెతలూ పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్నాయి కదూ ? ఈ సామెతలతో వచ్చిన చిక్కే అదండీ ! కాని మనం జమాఖర్చుల పుస్తకం రాసుకోవడం ద్వారా రెండు సామెతల్నీ సమన్వయ పరిచిన వారమౌతాము. మీరు చేయవలసినదల్లా పైసా ఖర్చయినా వందలు ఖర్చయినా స్పష్టంగా (ఎందుకు ఖర్చయిందో) తెలుపుతూ గుర్తు పెట్టుకోవడమే.

నెలాఖరున అంత వరకూ అయిన మీ ఆదాయవ్యయాలకు ఒక సారాంశ పట్టిక తయారు చేసుకోండి. అంటే నిత్యావసరాలకూ శాశ్వతమైన వాటికీ, మందులకూ, వినోదాలకూ పుస్తకాలకూ ఇలా అంశం వారీగా దేని కెంత ఖర్చు అయిందో లెక్క వేసిన తరువాత ఏ అంశం మీదైనా కావలసిన దానికన్నా హెచ్చుగా ఖర్చవుతోందేమో, అది ఎంత ఎక్కువ అవుతోందో, అసలు మనం మొత్తంమీదే ఎక్కువ ఖర్చుచేస్తున్నామేమో అన్నది పరిశీలించాలి. అప్పుడు ఏయే అంశాల మీద ఎంత వరకూ ఖర్చులు తగ్గించవచ్చో లేదా ఏయే అంశాల మీద ఏయే సర్దుబాట్లు చేసుకోవచ్చో అంచనా

వేసుకొని ఆ నిర్ణయాలు తరువాత నెల జమా ఖర్చులు రాసే ముందు పేజీపై భాగంలో రాసి పెట్టుకోవాలి. అంతే కాదు, మీరు కొన్నిటిమీద మరీ ఎక్కువ ఖర్చు పెడుతున్నారని కూడా తేలవచ్చు. అవికూడా సరిదిద్దుకోవచ్చు ఉదాహరణకి పుస్తకాల మీద మీరు మరికొంచెం ఖర్చు పెట్టడం—నేను రచయితని కాబట్టి — హర్షిస్తాను. ఏమైనా ఈ నెలవారీ సారాంశ పట్టిక చాలా అవసరం. ఇది తయారు చేయక పోతే మీరు జమాఖర్చులు రాసుకోవటం వల్ల పెద్ద ప్రయోజనం ఉండదు.

ఆఁ, మాకు జమ- ఖర్చుల సారాంశ పట్టిక తయారు చేసుకొనేటంత సమయమూ లేదు, ఓపికా లేదు, తయారు చేయనిదే జమాఖర్చులు రాసినా పెద్ద ప్రయోజనం లేదు అన్నారుకదా! అయితే ఈ దండగ పనెందుకు, మానేస్తాం అంటారేమో, ఆపని మాత్రం చేయకండి. పెద్ద ప్రయోజనం లేదు అన్నానుకాని, అసలు ప్రయోజనం లేదనలేదు కదా. ఏ పరిస్థితుల్లోనూ జమా ఖర్చులు రాయడం మానకండి. డబ్బు ధారాళంగా వస్తున్నంత కాలం దాని విలువ తెలియకపోవచ్చు కాని ఏవో అడ్డు ఎదురై, ప్రవాహం ఆగి పోయి చిక్కులు చుట్టు కున్నప్పుడు మీరు ఆగి ఆలోచించ వలసి వస్తుంది. అప్పుడు ఈజమా ఖర్చుల వివరం ఎంత సాయపడుతుందో మీకే తెలిసి వస్తుంది. అంతేకాదు ఏమైనా కొనుగోళ్ళు చేయ వలసి నప్పుడు ఈజమా ఖర్చులద్వారా గతంలో చేసిన కొనుగోళ్ళని పోల్చి చూసుకొని మరీ ఆ పని చేయవచ్చు. ఇది నిజంగా మీకు చాలా మంచి సౌకర్యమని మీరే గుర్తిస్తారు.

## అప్పులు, చేబదుళ్ళూ

జమా ఖర్చులనేవి డబ్బుకు సంబంధించే కదా, డబ్బు అనగానే అప్పులూ, చేబదుళ్ళూ ఉంటాయి. వాటి విషయం కొంచెం ఆలోచించుకోవడం మంచిది.

అప్పుల మాటకు వస్తే ఒకటే సూత్రం : అప్పు ఇవ్వక పోవడం మంచిది-మీరువడ్డీ వ్యాపారి అయితే తప్ప! స్నేహితుడికి అప్పు ఇస్తే డబ్బూ పోతుంది. స్నేహితుడూ పోతాడని షేక్స్పియర్ అన్నాడు. అప్పుతీసుకునే టప్పుడు ఉన్న సౌజన్యం ఇచ్చేటప్పుడు సాధారణంగా ఉండదు. మీరే చూడండి మీ దగ్గర అప్పు పట్టుకు వెళ్దామని వచ్చినవారు మీ క్షేమ సమాచారంలో, మీయింట్లో వారి క్షేమసమాచారంలో ఎంత ఆసక్తి కనబరుస్తారో. ఆ తరువాత అన్న రోజుకి తిరిగి యివ్వలేక మీరు రెండు మూడుసార్లు గుర్తుచేస్తే వారుఎలావ్యవహరిస్తారో!(అప్పుపుట్టినప్పుడుపుత్రుడు పుట్టినంత సంబరమూ, ఇవ్వ వలసి వచ్చినప్పుడు ఇంటి ఆయన పోయినంత దుఃఖమూ కలుగుతుందని ఒక సామెత ఉంది). అసలు అప్పు అడగడానికి వచ్చిన వాడు మిమ్మల్ని ఎక్కువగా పొగడినా, ఎంతో తియ్యగా మాట్లాడినా అపాయమే అని గుర్తుంచుకోండి. అలా కాక వెనక ముందాడుతూ, అడగ లేక అడిగే వారు కొంత నయం. బాకీ తిరిగి ఇవ్వవలసిన అవసరం వారికి గుర్తు ఉందన్న మాట. కాని అలా ఎంతో మొహమాట పడుతూ అడిగారని మీరే కలగ చేసుకొని అప్పు ఇచ్చేయకండి. అప్పు ఎప్పుడు ఇచ్చినా అది దేని కోసం తీసుకుంటున్నాడో, అతనికి తీర్చే సామర్థ్యమెంతో చూసే ఇవ్వండి. విశ్వాసం ఉన్న చోట ఇవ్వడానికేం అంటారా, అదీ చెప్పలేం. రుణం దెబ్బకొట్టేది ముఖ్యంగా విశ్వాసం మీదే. పరిస్థితులు మారితే పరమమిత్రుడు కూడా పరమ శత్రువు కావచ్చు. అలాంటి పరిణామానికి రుణాలు ఒక ప్రముఖకారణ మవుతూ ఉంటాయి. లోకంలో ఎన్నైనా ఉదాహరణలు కనిపిస్తాయి. పైగా విశ్వాసాన్ని కొలవలేం కదా పదులూ, పందలూ మీరు అడగ నక్కర్లేకుండానే, అన్న సమయానికె కొంచం ముందే తీర్చివేసి, మీ విశ్వాసాన్ని సంపాదించి, ఎప్పుడో పెద్ద మొత్తం తీసుకొని అప్పుడు భిన్నంగా వ్యవహరించవచ్చు, విశ్వాసం పోయిన తరువాత ఏమి చేయగలం? ఆషాఢ భూతి కథ విన్నారుకదూ. అందువల్లే అసలు అప్పు

ఇవ్వలేక పోవడం మేలు. అంతర్నిష్ఠూర్యం కన్నా ఆది నిష్ఠూర్యం మంచిదంటారు. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడుగా, మధ్యప్రదేశ్ గవర్నరుగా చేసిన కాంగ్రెసు అధికారిక చరిత్ర వ్రాసిన కీర్తిశేషులు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు ఎవరైనా అప్పు అడిగితే, ఎంతకావాలి, ఎంత కాలానికి కావాలి అని తెలుసుకొని ఆ ప్రకారం వడ్డీ లెక్కకట్టి 'ఇదుగో నీకయ్యే వడ్డీ ఇస్తున్నాను. ఈ వడ్డీ ముందే ఇచ్చి మరొక చోట అప్పు తీసుకో' అని పంపివేసేవారట. కొన్ని వందలు పోగొట్టుకునే కన్నా, కొన్ని పదులు పోగొట్టుకోవడం కొంత నయమనుకునే వారన్నమాట, అందువల్ల సాధ్యమైనంత వరకూ అప్పు ఇవ్వకండి. ఒక వేళ ఇవ్వవలసి వస్తే — అపవాదాలు అనేవి ఎప్పుడూ ఉంటాయి — మీరు మరీ నిక్కచ్చిగా ఉండలేక పోవచ్చు-మీ స్తోమత ఏలాగైనా చూసుకుంటారు కదా - అంటే ఒక వేళ ఆ అప్పు తిరిగి రాక పోయినా తట్టుకో కలిగిన స్తోమత కూడా -అవతలి వాడిస్తోమతా విశ్వసనీయతా-అదే క్రమంలో - పరిస్థితులతో అనుకోని మార్పు వచ్చినా మాట నిలుపుకునే స్తోమతా, తత్త్వము చూసుకొని మరీ ఇవ్వండి. ఎంతో కష్టాలు పడి, ఎన్నో త్యాగాలు చేసి కుటుంబం మీదఉన్న అప్పులు అణా పైసలతో సహా తీర్చిన వారు కొందరు లేక పోలేదు. ప్రసిద్ధ ఇంగ్లీషు నవలాకారుడు సర్ వాల్టర్ స్కాట్ అప్పులు తీర్చడానికే నవలలు రాయడం మొదలు పెట్టాడట. అందువల్ల మొత్తం మానవజాతిని అవిశ్వాసంతో కొట్టివేయకండి. మానధనులు కొందరు ఉంటారు. కాని వారు అరుదుగా ఉంటారు. అందువల్ల సాధారణంగా అప్పులివ్వడం అపాయకరమే అని గుర్తుంచుకోండి. అప్పుల దగ్గర స్పష్టమైన రాతకోతలు ఉండాలని వేరే చెప్పనక్కర్లేదు కదా అక్కడ ఏ మాత్రం మొహమాట పడకండి. అంతా స్పష్టంగా కచ్చితంగా వ్రాయించి, కాగితం తీసుకొని జాగ్రత్త పడండి. ఎంత ముందుగా గుర్తు చేయమంటారో, ముందే అడిగి తెలుసుకొని ఆ తేదీల్ని మీ దినచర్యలో

రాసిపెట్టుకోండి. రెండు మూడు సార్లు ఎంతో మర్యాదతోనే గుర్తు చేయండి. కాలదోషం పట్టనంత వరకూ కొంత ఓపిక పట్టడంలో తప్పులేదు. కాని పరిస్థితిని మెలకువతో గమనిస్తూ, అపాయ సూచన కాగానే తగుచర్య తీసుకోండి.

అప్పుల విషయం వదిలేయండి. చేబదుళ్ళ వ్యవహారం చూద్దాం. ఇవి సాధారణంగా చిన్న చిన్న మొత్తాలే అయి ఉంటాయి. ఇవి తీర్చే దృష్టి ఉండాలికాని ఏ పరిస్థితుల్లోనూ తీర్చలేనివి అయి ఉండవు. కాని చేబదుళ్ల దగ్గరే కోపాలూ, కక్షలూ వస్తూ ఉంటాయి. ఎందుకంటే సాధారణంగా చేబదుళ్ళకి ప్రత్యక్షమైన దాఖలాలుండవు. దానికి తోడు మతిమరుపు చాలా కొంటె పనులుచేస్తుంది. అమెరికాలో మహాధనవంతుల్లో ఒకరైన జాన్ డి. రాక్‌ఫెలర్‌ని గురించి ఒక కథ చెపుతారు. ఆయన స్నేహితుడొకడు—అతనూ కోటీశ్వరుడే-తన మరొక స్నేహితుడికి 60,000 డాలర్లు,—అప్పను అరవై వేల డాలర్లు, అంటే మన 7లక్షల అరవై వేల రూపాయలకు సమానం—చేబదులు ఇచ్చాడట. మనకి రూపాయలెలాగో కోటీశ్వరులకు వేలరూపాయిలూ అంతే. తీరా చేబదులు తీసుకొన్న మిత్రుడు ఆ సొమ్ము తీసుకున్నట్లే గుర్తు లేనట్లుగా వ్యవహరిస్తున్నాడట. ఎంత కోటీశ్వరుడికైనా 60 వేల డాలర్లు మరీ అంత చిన్న మొత్తం కాదు కదా. ఈ వ్యవహారంలో సలహాయిమ్మని అతను రాక్‌ఫెలర్‌ని అర్థించాడట. దాని మీద రాక్‌ఫెలర్ "అయితే ఒకపని చెయ్యి. నువ్వు చేబదులు తీసుకున్న 90,000 డాలర్లూ త్వరలో తిరిగి యివ్వవలసిందని ఉత్తరం వ్రాయి" అన్నాడట. ఆ స్నేహితుడు అలాగే చేశాడు. దాని మీదట చేబదులు తీసుకున్నవాడు. కోపంగా "నేను చేబదులు తీసుకున్నది అరవై వేలే అయితే 90 వేలని రాశావేమిటి?" అని రాశాడట. రాక్‌ఫెలర్ "ఆధారం దొరికింది కదా. ఆ కాగితం ఉదహరిస్తూ నోటీసియ్యి" అని చెప్పాడట. చూశారా ఆధారం లేకపోతే అది సృష్టించుకోవడానికి ఎంత

తిప్పలు పడవలసి వచ్చిందో ! రాక్‌ఫెలర్ వంటి కుశాగ్రబుద్ధి కాబట్టి ఆ ఉపాయమాలోచించాడు. మన కది సాధ్యం కాకపోవచ్చు. అందువల్ల చేబదులైనాసరే — రూపాయి అయినా, చిన్న చిల్లర అయినా—సాధారణంగా రూపాయిలూ, చిల్లరలే మన చేతుల్లో నుంచి జారిపోతాయి, అంతేకాదు తెలియకుండానే మన సంచీకి చిల్లుపడేస్తాయి—ఎప్పుడూ రాతపూర్వకమైన ఆధారం పెట్టుకోండి. మీ బల్లమీద కొన్ని చిన్న తెల్లకాగితం ముక్కల దొత్తి ఒకటి పెట్టుకోండి. ఏ స్నేహితుడైనా మీదగ్గర చేబదులు చేస్తే, ఆ కాగితం ముక్క మీద అతనిచేతే తేదీ, మొత్తమూ వేయించి పొట్టి సంతకం చేయించి ఆకాగితాలు వేరేభద్రపరచండి.బయటికి వెళ్ళినప్పుడు కూడాపాకెట్ డైరీలో కొన్ని స్లిప్పులు ఉంచుకోండి. మీ స్నేహితుడు కానీ పరిచితుడుకానీ చేబదులు తిరిగి ఇచ్చిన తరువాత ఆ స్లిప్పు చింపివేయవచ్చు. కాని ఆ స్లిప్పులు ఎక్కడపడితే అక్కడ ఇతరులకి అందుబాటులో పెట్టకండి ఒక జరిగిన సంఘటన చెబుతాను. ఒక పట్టణంలో ఒక 'పెద్ద మనిషి' ఉన్నాడు. ఆయన చేతలను గురించి చెప్పవలసివస్తే చాలా చెప్పాలి. మనకిక్కడ అవన్నీ అక్కరలేదు. ఆయన ఒకరిదగ్గర రెండువందల యాభై అప్పుచేశాడు. ప్రామిసరీ నోటు కూడా రాసిఇచ్చాడు. అప్పిచ్చినవాడు అడిగితే ఆ విషయం తనకి తెలియనట్లే ఆయన నటించాడు. దానితో అవతలివాడు అమాయకంగా ఆ నోటు తీసుకొని ఆయన ఇంటికి వచ్చి, ఆ నోటు చూపించాడట. "నేనే రాశానా ? ఎపుడురాశాను, ఏదీ" అని ఆనోటు తీసుకొని ఆ పెద్దమనిషి అది పర్రున చింపేసి, ముక్కలు ముక్కలుచేసి నలిపి అవతలపడేశాడట. అవతలి వాడు లబోదిబో మంటే మాత్రం ఏమి లాభం ? అలాగే కొందరు నిర్లక్ష్య మనుషులు మీరు చూడని సమయంలో, తాము రాసిన చీటీ చింపి వేయవచ్చు. కాబట్టి ఆ చీటీల ఆవిషయంలో జాగ్రత్తగా ఉండమని చెప్పినది. చేబదుళ్ళు కొంచెం పెద్దవైతే దినచర్యలో కూడా రాసుకొని తగినంత ముందుగా - మర్యాదగానే - అవతల వారికి గుర్తు చేయవచ్చు కూడా.

పైన చెప్పిన విధమైన చీటీలు కేవలం డబ్బు చేబదుళ్ళకే కాదు. ఎరువిచ్చే వస్తువులకూ, బదుళ్ళకూ వాడడం చాలా మంచిది. ఎరువిచ్చేట ట్లయితే మనయిల్లు మినహా తక్కినవన్నీ అడిగి పట్టుకు పోయే వారుంటారు. కేవలం బదుళ్ళ మీదే సంసారాలు సాగించే పక్కింటి పిన్నిగార్లుంటారు. వారి దాడుల నుంచి రక్షించుకోవాలంటే, ఈ చీటీలే దిక్కు. నిత్యావసర వస్తువులు - అందులోనూ గాజు సంబంధమైన తెర్మామీటరూ, ఫ్లాస్కూ, కప్పులూవగైరా కూడాలేకుండా,పొరుగిళ్ళ మీదపడేవాళ్ళని నిర్మొహమాటం గా తిప్పి కొట్టడం మంచిది. పట్టుకు వెళ్ళిన వారి దగ్గర ధర్మామీటరు పగిలి పోతే వారూ, మనమూ బాధ పడవలసి వస్తుంది. ఎలా వాడినా హాని జరగని వస్తువులిస్తే ఇవ్వండి. కాని సున్నిత మైనవీ ఎలక్ట్రానిక్ పరికరాల వంటివి ఇవ్వకండి. అవి చెడితే బాగు చేయిస్తామని చెపుతారు కాని చేయిం చడం చాలా అరుదు. చేయించే వాళ్లైతే చెప్పరు. చడీ చప్పుడూ కాకుండా బాగు చేయించి తిరిగి యిచ్చేస్తారు. ఏమైనా చిన్న వస్తువులైనా పెద్ద వస్తు వులైనా సరే ఇచ్చేటప్పుడు కేవలం జ్ఞాపక శక్తి మీద ఆధారపడ కుండా - ఎందు కంటే ఎప్పుడైనా కొందరు మొండి రకాలు మీ జ్ఞాపక శక్తికి, తమ జ్ఞాపకశక్తీ, మీ-మాటకి తమమాటా పోటీ పెడ్తారు-పైన చెప్పిన విధంగా చీటీలు వాడడం శ్రేయస్కరం, మొదట్లో చిన్న చిన్న వాటికి చీటీలు. వాడడం ఇబ్బందిగానే అనిపించవచ్చు కాని చిన్న చిన్న వాటికి చీటీలు ముఖ్యంగా కావాలి. కాబట్టి పట్టుదలతో అలవాటు చేసుకోండి. పక్కింటి పిన్నిగార్ల దండయాత్రల నరికట్టడానికి కూడా ఈ చీటీలు పనికి వస్తాయ నుకున్నాం కదా, ఒక చీటీ ఉండగా, మరొకచీటీ రాయనివ్వమని కచ్చితంగా చెప్పవచ్చు. పిన్నిగారు కనబడగానే ఆ చీటీ చేతిలోకి తీసుకుంటే తాయెత్తులా పనిచేస్తుంది.

## పుస్తకాలు :-

ఈ సందర్భంలో తరచు పరభుక్తమయి పోయే వస్తువులు ఉన్నాయి. అవి పుస్తకాలు. వాటిని గురించి ఒకసారి ఆలోచించాలి,

పుస్తకాల విషయంలో మామూలు నీతిసూత్రాలు వర్తించవేమోననిపిస్తుంది. ఎందుకంటే, ఎంతో మంచివారూ, నియమబద్ధ జీవితం గడిపేవారూ కూడా పుస్తకాలు తిరిగి ఇవ్వకపోవడం పెద్ద తప్పుగా ఎంచరు. అందుకే 'పుస్తకం వనితావిత్తం పరహస్తం గతం గతః' అన్న సంస్కృతోక్తి పుట్టింది. అల హాబాదులో 'ట్వెంటియత్ సెంచరీ' అన్న పత్రికకు చాలాకాలం సంపాద కుడిగా పనిచేసి గొప్పపేరు సంపాదించిన - మన ఆంధ్రుడే - కీ॥శే॥ కుందుర్తి ఈశ్వర దత్తుగారింటిలో ఆయన గదిలో ఎదురుగా గోడమీద ప్రము ఖంగా కనపడేటట్లు 'పుస్తకాలు అరువిచ్చేవాడు తెలివితక్కువవాడు, అవి తిరిగి తెచ్చేవాడు, మరీ తెలివి తక్కువవాడు' అన్న వాక్యం ఉన్న కార్డు ఉండేదని ప్రఖ్యాతకవీ, రచయితా వగైరా వగైరా శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ ఒక చోట రాశారు. ఒక్కొక్కప్పుడు మీరు కొన్న పుస్తకమే మీరు చదువు కునే భాగ్యం ఉండదు, మన పుస్తకాల మీద ఇతరులకి అంతప్రేమ అన్న మాట. ఒకాయన ఇంటి నిండా పుస్తకాలేనట. అవి ఎక్కడ బడితే అక్కడ పడి ఉండటం చూసి, ఒక ఆయన ఆశ్చర్యంతో అడిగాడట "ఇన్ని పుస్తకా లున్నప్పుడు బీరువాల్లో పెట్టుకోరేం? "దానికా ఇంటి యజమాని "పుస్తకాలు అరువు ఇచ్చే వాళ్ళు ఉన్నారు కాని బీరువాలు అరువిచ్చేవాళ్లు లేరుకదా" అని వాపోయాడట. పుస్తకాల విషయంలో తప్పక చీటీల పద్ధతి అవలంబించాలి.

మరి ఇంత వరకు ఇతరుల నుంచి వచ్చే సమస్యల గురించే ఆలో చించాం. మరి మీరే అప్పు చేయ వలసి వస్తే! మీకే ఒక వస్తువు అవసరంగా కావలసి వస్తే? కాని ఇతరులకు వర్తింప చేసే సూత్రాలు మీకే వర్తింప చేసుకోక పోతే ఎలా? నిజానికి, మీరు అప్పులూ, చేబదుళ్ళూ చేయకూడదు సరుకులు అరువు తెచ్చుకోకూడదు. తెర్మామీటర్లూ, ఫ్లాస్కులూ వంటివి మీరే కొనుక్కొని ఉంచుకోండి. మీరు చదవ వలసిన పుస్తకాలు మీరే కొనుక్కోండి. అంతగా కొనడానికి చాలా ఖరీదు అనుకుంటే, ఏ గ్రంథాల

యం నుంచో తెచ్చుకోండి. కాని స్నేహితుల దగ్గర నుంచీ, పరిచితుల దగ్గర నుంచీ తెచ్చుకోవద్దు. కాని ప్రతి సూత్రానికీ అపవాదాలుంటాయనుకున్నాం కదా. కొన్ని పరిస్థితులలో అప్పు చేయక తప్పక పోవచ్చు - నిజానికి ఆధునిక వ్యాపార ప్రపంచమంతా ఋణాల మీదే నడుస్తోంది. కొన్ని సమయాల్లో చేబదుళ్ళు చేయక తప్పక పోవచ్చు కూడా అలాగే మరి కొన్ని సమయాల్లో స్నేహితుల ఇళ్ళనుంచో పక్కవాళ్ళయిళ్ళనుంచో కొన్ని వస్తువులుతేవలసిరావచ్చు. కాని అలాంటివి అపవాదాలుగానే ఉంచండి. అప్పు చేస్తే అవతలి వాడు గుర్తుచేయక ముందే అన్న తేదీకి కొంచెం ముందుగానే తీర్చి వేయండి. చేబదులుచేస్తే, మీరే స్వయంగా చీటీ రాసి ఇవ్వండి. మాట నిలబెట్టుకొని ఆ చీటీచించి వేయండి. సున్నితమైనవీ, ఖరీదైనవీ వస్తువులు తేకండి. తెచ్చినా వాటిని తెచ్చినట్లున్న స్థితిలోనే తిరిగిఇచ్చి వేయండి. ఏమైనాచెడితే అవతలి వారికి చెప్పవద్దు. బాగు చేయించి తరువాత చెబితే చెప్పండి. వీటి అన్నింటిలో మీకు దినచర్యా, జమా ఖర్చుల పుస్తకం ఎంతో ఉపయోగిస్తాయి. వాటిని బాగా ఉపయోగించండి.

మనం ఉద్యమం, ఉద్ధరణ, త్యాగం, దేశభక్తీ వంటి పెద్ద మాటలు వాడవద్దు - అంటే నిషేధమని కాదు సుమండీ - ముందు పైన చెప్పిన రెండు పనులూ - దినచర్యా, జమా ఖర్చులు రాయడం - చేయండి. దినచర్య మీ జీవితంలో ఒక క్రమం తెస్తే, జమా ఖర్చుల అలవాటు మీ జీవితంలో ఒక కచ్చితం తెస్తుంది. మీ వ్యక్తిత్వానికి బలమైన పునాది వేసినట్లే అవుతుంది. ఆ పైన ఎంత ఎత్తైన భవనం కడతారో, ఎంత సుందరమైన భవనం కడతారో అది మీ ఓపికా కోరికానూ.

---

- అహం సూర్యాస్తమయం లాంటిది, మనలను చీకటినేలో ముంచుతుంది.
- ఆగ్రహం క్షణికోన్మాదం.

# 6

# వాదాలూ - వివాదాలూ

మనం నాలుగో అధ్యాయంలో దినచర్య గురించి చర్చించినప్పుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఆత్మకథ గురించీ, ఆయన అవలంబించిన ఒక చిత్రమైన ఆత్మ సంస్కరణా పథకం గురించీ మాట్లాడుకున్నాము. బెంజమిన్ ఫ్రాంక్లిన్ మాదిరిగా మీరు కూడా స్వయంగా ఆలోచించుకొని మీరు కోరే, అవలంబించ దలిచే మంచి అలవాట్లూ, లక్షణాలూ పరిహరించుకోదలచే అవలక్షణాలూ, అవాంఛనీయమైన అలవాట్లూ జాబితా తయారు చేసుకొని దినచర్య పుస్తకం సాయంతో వాటి విషయంలో అభ్యాసం చేయడం మంచిదని కూడా అనుకున్నాం. మీరీ పాటికి అటువంటి పథకమేదో తయారు చేసుకొని ఆచరిస్తూ ఉంటారని ఆశించవచ్చు గదా.

అయినా ఇక్కడ మనం కొన్ని విషయాల గురించి ఆలోచిద్దాం. మొదటిది, మనం తరుచు చిక్కుకునే వాదాలవల్ల లాభం కన్నా నష్టమే ఎక్కువ అని గుర్తించడం. నిజానికి డేల్ కార్నెగీ చెప్పినట్లు, వాదంలో పైచేయి కావాలనుకుంటే, వాదంలోకి దిగక పోవడమే మార్గం. పూర్వం తర్కం చదివిన వాడికి పిల్లనివ్వడానికి తల్లిదండ్రులు భయపడే వారట. ఎందుకంటే వాడు ప్రతి దానికీ వాదిస్తూ కూర్చుంటాడు, అందరితో పోట్లాటలు పెట్టుకుంటాడు, చివరికి పెళ్ళాంతో కూడా, అతని జీవితంలో ఎప్పుడూ తర్కపు వేడిగాడ్పులే తప్ప ప్రేమానురాగాల చల్లని వెన్నెలలు ఉండవని వారి భయమన్న మాట.

నిజానికి వాదన అంటే ఒక విధమైన పోరాటమే. వాదన సూచన అవగానే యుద్ధానికి పిలుపు వచ్చినట్లే, ఎవరి మట్టుకు వారు కవచాలు ధరించి, కత్తులువేసుకుని ముందుకు దూకుతారన్న మాట. ఆపైన బలాబలాల పరీక్షే. నలుగురు స్నేహితులు చేరి కులాసాగానే కబుర్లు మొదలు పెడతారు. ఇంతలో ఎవడో ఏదో అంటాడు. మరొకడు కాదంటాడు. అంతే వాదన ప్రారంభమవు తుంది. కంఠశోష వచ్చి అర్థాంతరంగా ఆగిపోతే, ఆగాలి కాని లేకపోతే ఎవరూ చస్తే ఓటమి అంగీకరించరు. ఇంగ్లీషు కవి ఆలివర్ గోల్డ్‌స్మిత్ అన్నట్లు ఓడిపోయినా వాదిస్తూనే ఉంటారు. తరచు అంతే కాదు, వ్యంగ్య బాణాలతో ప్రారంభించి తిట్లూ, తోసుకోవడాలూ, చివరికి కొట్టుకోవడాలూ వరకు కూడా ఈ చిన్న తగాదాలు పోతాయి.

అయినా స్నేహితులు స్నేహితులుగానే ఉన్నారంటే వారి మధ్య బంధాలు వాదాలకన్నా దృఢమైనవై ఉండాలి, లేదా వాదనకి హేతువు ఇరుపక్షాల వారికీ అంత ఆసక్తికరం కానిదైనా అయి ఉండాలి. వాదన ఎప్పుడూ స్నేహాన్ని పెంచదు. స్నేహాన్ని పరీక్షిస్తుంది, ఏమైతే తెరుస్తుంది. మీరు వాదనలో గొప్ప నైపుణ్యం ప్రదర్శించి అవతలి వాడి చేత 'హతోఽస్మి' అనిపించినా వాడి సుహృద్భావాన్ని మాత్రం కోల్పోవడం ఖాయం. అతని గుండెకే దెబ్బ తగులు తుంది. తన వ్యక్తిత్వానికే అవమాన మని అతను భావించినా ఆశ్చర్యం లేదు.

అందువల్ల వాదనద్వారా ఎవరికీ నచ్చచెప్పలేరు. నచ్చచెప్పే పద్ధతులు వేరు. వాదన దానికి విరుద్ధం. వాదన ద్వారా ఒక కమ్యూనిస్టుని కేపిటలిస్టుగా, కేపిటలిస్టుని కమ్యూనిస్టుగా, నాస్తికుడిని ఆస్తికుడిగా, ఆస్తికు

డిని నాస్తికుడిగా, ఎన్టీఆర్ భక్తుడిని ఎస్ వి ఆర్ (మీకు ఎవరో తెలుసు కదా) భక్తునిగా, ఎస్ వి ఆర్ భక్తుడిని ఎన్టీఆర్ భక్తుడిగా మార్చేశారు. ఇది నిజమో కాదో మీరే పరిశీలించి తెలుకోండి.

అసలు ఎవరు ఏమీ అపకతపకలు మాట్లాడినా పట్టించుకోకుండా ఊరు కొమ్మనీ, మీ అభిప్రాయం ఎప్పుడూ వెలువరించవద్దనీ కాదు. దానికి తరువాత వద్దాం.

మొదటిది, అనవసర వాదాల్లోకి దిగవద్దు. కథ చెపుతారు కదా, ఏమీ తోచని మొగుడు పొద్దున్నే లేచి పెళ్ళాన్ని పిలిచి '....సంతలో గేదె పెయ్య కొంటే పాలు మీ వాళ్ళకు పోస్తావా, మా వాళ్ళకు పోస్తావా?' అని కజ్జా పెట్టుకున్నాడని. అలాంటి తరగతిలోకే వస్తాయి కొన్ని వాదనలు. వాటిలోకి ఎప్పుడూ దిగకండి. అంతగా తోచకపోతే ఏదైనా ఆట ఆడుకోండి, పాట పాడుకోండి, పుస్తకం చదవండి' అంతేకాని వాదన మాత్రం పెట్టుకోవద్దు.

వాదనకి సమయం, సందర్భం గమనించండి. రెండో మనిషితో వాదన పెట్టుకుంటే అవతల ట్రెయిను వెళ్ళిపోవచ్చు. ప్రతి మాటకీ, ప్రతి వ్యవహారానికీ మనం 'రియాక్టు' అయినంత (ప్రతిస్పందించి) అవతలి వాడిది ఎందుకు తప్పో, మనమెలా రైటో వివరించి చెప్పడం అనవసరం. ఎవరో అనామకుడు, మనకి మళ్ళీ తటస్థపడనివాడు ఏదో అన్నాడను కోండి, అయినా ఏమి పోయింది? వాడి అభిప్రాయం వాడితోనే పోతుంది. ఆ విధంగా మనం వాడికి ఏమీ విలువ ఇవ్వనట్లవుతుంది. వాడితో వాదన పెట్టుకున్నామంటే వాడికి అనవసరమైన విలువ ఇచ్చినట్లవుతుంది.

ప్రతిదానికీ పట్టించుకుంటే ఏమవుతుందో ఒక కథ చెపుతాను. ఏమిటి, కథ లెక్కపై పోయామంటారా? పోనీ కథ వదిలేసి చదువుకు వెళ్లిపోండి. ఆసక్తి ఉన్నవారే కథ చదువుతారు. ఒక నవాబుగారు ఉన్నారట. ఏదో ఉత్సవం వంకని ఆయన పురవీధుల గుండా బ్రహ్మాండమైన ఊరేగింపుతో వెళ్తున్నాడు. జనం అటూ ఇటూ బారులు తీర్చి జేజేలు పలుకుతున్నారు. కాని ఒక చోట ఒక ముష్టివాడు—వాడు పిచ్చివాడు కూడా—నవాబు ఆడంబరం చూసి బిగ్గరగా నవ్వాడట. నవాబు గారి కోపం భగ్గుమంది. వెంటనే ఆ బిచ్చగాని తలనరికి, గడకి తగిలించి రాజవీథిలో ఒక ముఖ్యమయిన కూడలి మధ్యలో నిలబెట్టమని ఆజ్ఞ ఇచ్చాడు. భటులు తు చ తప్పకుండా ఆయన ఆజ్ఞ పాటించారు. మర్నాడు ఆ నవాబుగారు ఆ రాజవీథినే పోతూ ఆ గడకేసి గర్వంతో చూశాడట. తీరాచూస్తే గడచివర ఉన్న ముష్టివాడి తల నవ్వు మొగంతోనే కనిపించిందట. నవాబుగారు వెంటనే ఆ తలని భూమిలో లోతుగా పాతమని భటుల నాజ్ఞాపించాడు. కాని ఆ రాత్రి ఆ బిచ్చగాడు నవాబుగారి కలలోకి వచ్చి పకపకమని నవ్వసాగాడట. దానితో నవాబుగారు ఆత్మహత్య చేసుకున్నాడట. కాబట్టి ప్రతి మాటనీ పట్టించుకోవడం లేనిపోని ఘాతాలను సృష్టించు కోవడమవుతుంది. బురద మీద రాయి వేస్తే మొగమంతా చిమ్ముతుందంటారు. తగని వాళ్ళతో తగవు పెట్టుకుంటె అదే జరిగేది. కొందరు కావాలని మనల్ని రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తారు. రెచ్చకపోవడమే వాళ్ళకి విరుగుడు. ఒక రౌడీ ఒక పెద్ద మనిషి దారికడ్డంగా నిలబడి "నేను వెధవలకి దారి ఇయ్యను" అన్నాడట. దానికా పెద్దమనిషి "నేను ఇస్తాను" అని చెప్పి పక్కకి తప్పుకొని వెళ్లిపోయాడట. ఇంతకీ ఎవరు వెధవ అని తేలినట్లు ?

అది అలా వదిలేయ్యండి. బస్సులోనో, ట్రెయిన్‌లోనో, క్లబ్బులోనో పార్కులోనో, వినడానికి ఇష్టరు అమూయకులు దొరికేసరికి ఒకడు మీ వినికిడి

లో వారిముందు భూమి బల్లపరుపుగానే ఉంటుందనీ.సూర్యుడే భూమిచుట్టు ప్రదక్షిణంచేస్తాడనీ, పరిణామసిద్ధాంతం అంతా శుద్ధ అబద్ధమనీ అనర్గళంగా ఉపన్యాసం దంచేస్తున్నాడనుకోండి. లేకపోతే పత్రికల్లోనూ, పుస్తకాల్లోనూ కానవచ్చేయథార్థాలను అసత్యాలుగా, అసత్యాలను సత్యాలుగా ధీమాగా చెప్పేస్తున్నాడనుకోండి - చెప్పేవాడికి వినేవాడు లోకువ కదా. లేకపోతే ఒక రావుకి రాజకీయాల్లో ఓనమాలుతెలియవనీ, అతను పచ్చినియంత అనీ, మరొకరావు అసలైన సిసలైన ప్రజాస్వామ్యవాది అనీ, గొప్ప పరిపాలనాదక్షుడనీ ఢంకాబజాయించి చెపుతున్నాడనుకోండి. అతడిమాటలు మీకు భరింపరానివిగా తోచవచ్చు. అతడి ధీమాకి మీకు ఒళ్ళు మండవచ్చు. అయినా మీరుజోక్యం చేసుకోవలసినపనేమిటి? వాడి అజ్ఞానానికి మీలోమీరు చిరునవ్వు నవ్వుకొని ఈ చెవితోవిన్నది ఆ చెవితో వదిలెయ్యాలి. అంతేకాని వాడినికాదని రుజువుచేయడానికి మీరు కూర్చున్నారంటే ఇక మీపని అయినట్లే. అడ్డదిడ్డంగా వాదించేవాళ్ళని మీరు చచ్చి చెడి ఎలాగో సరిగానిలబెట్టినా కుక్కతోకవంకరలా మీరు వదలగానే మళ్ళీ మొదటికే వస్తూఉంటారు. ఒకడు తన కడుపులో పిల్లి చేరి నానాఅల్లరీ చేస్తోందని గోలపెట్టసాగాడట. ఎవరుచెప్పినా వినడం లేదట దానితో ఇలాకాదు అనిచెప్పి "సరే ఆపరేషన్‌చేసి తీసివేస్తాములే" అని ఒక డాక్టర్‌చేత చెప్పించి, అతనిని ఆపరేషను థియేటరుకి తీసుకుపోయి, మత్తుమందిచ్చి, ఉత్తుత్త ఆపరేషన్ హడావిడిచేసి, నడుంకి పెద్ద కట్టుకట్టి, తీసుకువచ్చి వార్డులో బెడ్‌మీద పడుకోబెట్టి, అతనికి తెలివి వచ్చిన తరువాత "నీ కడుపులోపిల్లిని తీసేశాం నీకింక పరవాలేదు"అని చెపితే "అయ్యో మీరు తీసినది తెల్లపిల్లి, నల్లపిల్లి ఇంకా అలాగే అల్లరి చేస్తోంది" అన్నాడట వాడు. అలా ఉంటుంది కొందరి వ్యవహారం. లోకంలో అడ్డదిడ్డ వాదనలూ,తలతిక్క సిద్ధాంతాలూ,అసత్యప్రచారాలూ లెక్కలేనన్ని చలామణీ అవుతూ ఉంటాయి. వాటిని అన్నింటినీ మీ రొక్కరే ఎదుర్కొలేరు కదా. మీకు శుభ్రత అంటే ఎంతో ఇష్టం. మీ యింటినీ, పరిసరాల్నీ శుభ్రంగా ఉంచగలరు కాని ఊళ్ళోవాళ్ళ అందరి యిళ్ళూ, వాకిళ్ళూ, ముంగిళ్ళూ శుభ్రం చేయగలరా? పట్టుదలకోసం, అదర్శంకోసం ఇరుగు పొరుగిళ్ళని శుభ్రంచేసి చూపించడానికి పూను

కుంటారనుకోండి, వారికేం హాయిగా చేయించుకుంటారు, వారుచేసే పని చేస్తూనే ఉంటారు. గాంధీగారు-ఏ ఆశ్రమంలో ఉండగానో గుర్తులేదు-తన శిష్యుల్ని తీసుకొని గ్రామస్థులకు శుచీ, శుభ్రతానేర్పడానికి వారంలో ఒకరోజు గ్రామమంతా శుభ్రంగాతుడవడం మొదలుపెట్టారట. గ్రామస్థులేమైనా పాఠం నేర్చుకున్నారా? గాంధీగారినుంచి నేర్చుకొని ఎవడైనా తన యింటిముందు శుభ్రంచేయబోతే "ఎలాగైనా గాంధీగారూ, ఆయన మనుష్యులూవచ్చి శుభ్రంచేస్తారు, మధ్య నీకెందుకురా" అని చెప్పి మాన్పించేవారట. తలక్రిందులుగా నడిచేవాళ్ళందరినీ ఒక్కొక్కరినే సరిగా నిలబెట్టుకుపోతూంటే కొన్నాళ్లకు మీరే తలక్రిందులుగా నడవడం మొదలుపెడతారేమో చూడండి. ఆస్కార్ వైల్డ్ 'ద పిక్చర్ ఆవ్ డోరియన్ గ్రే' అన్న నవల ఒకటిరాశాడు. అందులో ఒకడు డోరియన్ గ్రే అన్న సకల దుర్గుణాభిరాముడిని చిత్రించడానికి పూనుకుంటాడు. ఆ దుర్గుణాలన్నీ ఆ మనిషిరూపంలో ప్రస్ఫుటంకావాలని ప్రయత్నిస్తాడు. చివరికి చిత్రం పూర్తయ్యేసరికి తనే డోరియన్‌గ్రేలా అయిపోయినట్లు తెలుసుకుంటాడు. 'పంచపాండవులంటే తెలియదేమిటి మంచం కోళ్లలా ముగ్గురు' అని రెండువేళ్లు చూపేవాడిని ఎంతవరకు సరిదిద్దగలరు? ఇలా అంటున్నామని మీ కళ్లఎదుట అసత్యాలనీ పట్టించుకోవద్దనికాదు. వాదన పెట్టుకోవద్దని మాత్రమే. వాదన అందుకు సరియైన సాధనం కాదు. ఒకడు తప్పు చెప్తున్నాడనుకోండి - పొరబాటున కావచ్చు, అజ్ఞానంవల్ల కావచ్చు. మీరు అతనిని సరిదిద్దవచ్చు. అవతలివాడు వెంటనే గ్రహిస్తే మంచిదే. కాని విననివాడైతే? తాబట్టిన కుందేలుకి మూడేకాళ్లు అనేవాడితో వాదించి సరిదిద్దుదామని ప్రయత్నిస్తే మీ అమూల్యమైన సమయమూ, శక్తీ ఖర్చుకావడమేతప్ప మరోప్రయోజనం ఉండదు. పైగా వాడికోపానికీ, పగకీకూడా మీరు గురికావచ్చు. మీరు చేసేపని లక్ష్యం ఏమిటి, ప్రయోజనం ఏమిటి అన్నది ఆలోచించుకునే చేయండి ఏ పనైనా. మీయింట్లో బామ్మగారినీ, పక్కింటి తాతయ్యగారినీ, అవతలి యింటి ఒంటెత్తు ఏకాంబరాన్నీ, ఆపైయింటి తిక్క శంకరాన్నీ గంటలకొద్దీ వాదించి ఒప్పించి సాధించేదేమిటి

చెప్పండి. వారు జీవ పరిణామ సిద్ధాంతం ఒప్పుకుంటే మీరు విజ్ఞాన ప్రగతికి దోసాదం చేసినట్లేనా?

వీరిని వదిలేయండి. పైన చూశాం కదా వాదన ద్వారా కమ్యూనిస్టుని కేపిటలిస్టుగా మార్చలేము, కేపిటలిస్టుని కమ్యూనిస్టుగా మార్చలేముఅంటు. ప్రయత్నించి చూడండి ఏమవుతుందో. నక్షలైట్ భావాలు గల యువకుడిని పిలిచి శాంత్యహింసలు బోధించ యత్నించండి. అంటే పూర్తిగా ఒక భావానికో, సిద్ధాంతానికో కట్టుబడిపోయిన వాడిని మీరు వాదన ద్వారా మార్చలేరు. అలా ప్రయత్నం చేస్తే నెత్తి బొప్పి కట్టవచ్చు కూడా.

అంటే పై తరగతి వారితో కూడా వాదించి లాభం లేదన్న మాటే గదా! మరి ఎవరితో వాదించగలం? (వాదించక తప్పదా ఏమిటి?) ఉదారభావాలు కలవారి ముందూ, నిజం తెలుసు కుందామని కోరే వారి ముందూ, దృఢమైన మైత్రీబంధం కలవారి ముందూ - వాదనలు మైత్రిని పరీక్ష పెడతాయనీ ముందే అనుకున్నాం కదా - కోర్టులో న్యాయాధికారి ముందూ, కళాశాలల్లో వక్తృత్వపు పోటీల్లోనూ. చివరి రెండూ వదిలేద్దాం. అవి మనం చర్చిస్తున్న వాటి కోవకి చెందవు. వ్యాయామపు పోటీల వంటివి.

తక్కిన పై మూడు తరగతుల వారి ముందు కూడా వాదన అనగానే పోరాటానికి సంకేతంలా పనిచేస్తుందని చూశాం. విజ్ఞానమంటే వ్యక్తిగత భావోద్రేకాలకూ, ఇష్టాయిష్టాలకూ అతీతమయినదిగా కేవలం వస్తునిష్ఠంగా, యథార్థాల ఆధారంగా సాగేదని అందరూ ఒప్పు కొంటారు. కాని అలాంటి రంగంలో పనిచేసే వైజ్ఞానికులు కూడా వాదన వచ్చేటప్పటికి విభేదిస్తారు. ఇన్‌స్టైయిన్ అంతటివాడు, మాక్స్ ప్లాంక్ 'క్వాంటం మెకానిక్స్' సిద్ధాంతాన్నీ, హైజెన్‌బర్గ 'అనిశ్చితా

సూత్రాన్ని' చాలా కాలం ఒప్పుకోలేక పోయాడు. అందువల్ల మనం ఎంతో తర్కబద్ధంగా, నిష్పక్షపాతంగా వాదిస్తున్నామన్నా సుముఖత లభిస్తుందని చెప్పలేం. చాలా శాంతంగా వాదించగలిగితేనే దిగాలి. ఏ మాత్రం వేడి సూచన కలిగినా వాదన వెంటనే కట్టి పెట్టి వేయడం మంచిది. వాదన-మనవల్ల కాకపోవచ్చు, అవతలి వారివల్లే కావచ్చు-తప్పుదారిన పట్టినట్లే. అటు ఇంకా పోతే అపాయమే.

మరి అసత్యాలు ప్రచారమై పోతూంటే,ఆ విధంగా అక్రమాలూ, అన్యాయాలూ చెలరేగి పోతూంటే దారుణాలు జరిగి పోతూంటే, చూస్తూ ఊరుకోవడమేనా అని మళ్ళీ మన ప్రశ్న దగ్గరకి వస్తాం. ఉహుం, ఊరుకోమని కానేకాదు. అంతరాత్మ అంటు ఉన్నవాడూ, సమాజ బాధ్యత తెలసిన వాడూ ఎవడూ అలా చెప్పడు, అసత్యాన్ని ఖండించవలసిందే, అక్రమాన్నీ, అన్యాయాన్నీ ఎదిరించవలసిందే, దారుణాన్ని నివారించ వలసిందే, కాని పద్ధతి వేరని మాత్రమే నివేదించేది. వాదన ద్వారా సాధించే దానికన్నా పోగొట్టుకునేదే ఎక్కువ. అది తరుచు లక్ష్యాన్నే చెడగొట్టుంది, హింస ద్వారా అహింస సాధించజూచినట్లు.

అయితే ఏం చేద్దాం? ఈ సందర్భంలో డేల్ కార్నెగీ తన పుస్తకంలో ఇచ్చిన సూచనల్ని కొన్నిటిని ఒక్కమారు పరిశీలించి మననం చేసుకోవడం మంచిది. మనపని తేలిక అవుతుంది, పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే ఆయన పుస్తకమే చదవడం మంచిది.

ఆయన కూడా మనం ముందనుకున్నట్లే వాదనలో నెగ్గడానికి ఉపాయం వాదననుంచి తప్పించుకోవడమే అంటాడు.

1. మొట్టమొదట తీసుకోవలసిన జాగ్రత్త అవతలి వాడు 'ఔన'ంటే 'కాద'నీ,'కాద'ంటే'ఔన'నీ వెంటనే ఎదుర్కొకూడదు.ఒకసారి

ఆ స్థితి ఏర్పడిందంటే పరమ మిత్రుణ్ణైనా కదల్పలేం. ఈసందర్భంలో డేల్ కార్నెగీ ఉదహరించిన, మనందరికీ తెలిసిన, పాతకాలపు నీతికథ జ్ఞాపకం చేసుకోవడం మంచిది. ఒక ప్రయాణీకుడు కోటు తొడుక్కొని పోతూ ఉంటాడు. అతని కోటు తీయించి వెయ్యాలని సూర్యుడూ, వాయువూ పందెం కాస్తారు. ముందు వాయువు వీచి అతని కోటు ఎగర గొట్టే ప్రయత్నం చేస్తాడు. కాని గాలి ఎంత బలంగా వీస్తే అంత గట్టిగా కోటు అదిమి పట్టుకుంటాడు ప్రయాణీకుడు. వాయువు చివరికి వదిలేస్తాడు అప్పుడు సూర్యుడు బయటకు వచ్చి ప్రకాశిస్తాడు. ప్రయాణీకుడు,'ఉక్కబోస్తోందే' అని అనుకొని కోటు విప్పి చేతిమీద పెట్టుకొని పోతాడు. అలాగే ఒకమారు నేరుగా ఎదుర్కొన్నా మంటే ఇక ప్రతిఘటన తప్పదు. అందువల్ల అవతలి వాడిని తిన్నగా ఖండిచడం కానీ, అతనన్నది తప్పని కానీ అనవద్దు.

2. మొదట అతనితోకూడా కొంతదూరం కలిసి నడవాలి.అంటే ముందు ఏకీభవిస్తున్నట్లే, అతను చెప్పినది మనంకూడా కొంతవరకూ సమర్థిస్తున్నట్లే, కనబడాలి. ఇది మోసానికి కాదు. సాధారణంగా ఏ వ్యక్తీ పూర్తిగా అన్యాయంగా మాట్లాడడు. ఏవో కొన్ని అంశాలైనా అతనికి ఆధారంగా ఉంటాయి. అంతేకాక సత్యం మన వైపునేఉన్నా, దానికి సంబంధించిన మనంచూడని కొన్ని పక్షాలు అతను చూసి ఉండ వచ్చు. మనం అతనితో ఎంతవరకు వీలైతే అంతవరకు ఏకీభవించ డానికి ప్రయత్నించి నప్పుడు ఈ అంశాలూ, పక్షాలూ మన దృష్టిలోకి వస్తాయి. ఆవిధంగా మన నిర్ణయం కానీ, అభిప్రాయంకానీ అసమగ్రమూ పాక్షికమూ కాకుండా జాగ్రత పడవచ్చు. రెండవదీ, అంతకన్న ముఖ్యమైనదీ, అవతలి వాడిలో వ్యతిరేకత రెచ్చగొట్టకుండా మనపట్ల కొంత అనుకూలత సిద్ధింప జేసుకోవడం అవుతుంది.

3) తరువాత, చెప్పేదేదో స్నేహభావంతో చెప్పండి. నేరుగా ఖండించవద్దని ముందే అనుకున్నాం కదా. అదేకాక నిస్సందేహంగా, నిశ్చితంగా, కచ్చితంగా ఉన్నట్లు మాట్లాడకండి. 'మీరన్నది నేను ప్రశ్నించడం లేదు. కాని నాకుకొన్ని సందేహాలున్నాయండి' అని సందేహం తీర్చుకునేటట్లో, 'నాకీ అంశాలు దృష్టికి వచ్చాయండి' అనో మీకు తెలిసిన యథార్థాలు మెల్లగా చెప్పండి. యథార్థాలు చెప్పి, అతను సుముఖత కానీ, ఆసక్తి కానీ కనబరచిన తరువాతే వివరాల్లోకి పొండి.

4) మీరెప్పుడు మాట్లాడినా సరియైన ఆధారాలు చూసుకునే మాట్లాడండి. ఉదాహరణకు ఇటీవల శ్రీ ఎన్టీఆర్ ప్రభుత్వాన్ని పడగొట్టిన సందర్భంలో 'పైనుంచి పదికోట్ల రూపాయలు వచ్చాయ'ని ఒకరంటే 'కాదు, పన్నెండు కోట్లు'అని మరొకరన్నారు. చూస్తూండగానే మాటామాటా పెరగసాగింది. ఎలాగో వివాదం ఆపించి వేశారనుకోండి. కాని పది కోట్లో పన్నెండు కోట్లో ఎవరు చూసివచ్చారు? అలాంటి వాటికి స్పష్టమైన దాఖలాలెక్కడ ఉంటాయి? పైగా పదికోట్లయితేనేం పన్నెండు కోట్లయితేనేం, అసలు విషయం జరిగిన అన్యాయం. దానిని గురించే మనం మాట్లాడుకోవాలి.

5) కచ్చితమైన ఆధారాలు లేనప్పుడు, 'ఇది నా అభిప్రాయం-లేదా, ఊహ-మాత్రమేనండి' అన్నట్లుగానే మాట్లాడండి.

6) ఎదరవాడిని చెప్పవలసినదంతా చెప్పనీయండి. అతనినే ఎక్కువ మాట్లాడనీయండి. దానివల్ల మనకి నష్టమేమీలేదు. మనకి గట్టి ఆధారాలున్నప్పుడు, సత్యం మనపక్షానే ఉన్నప్పుడు, అంతిమ విజయం మనదే అవుతుంది. ముందుకి దూకాలంటే కొంచెం వెనక్కు పోవాలి కదా.

7. ఎన్నడూ ఎదరవాడి అహం దెబ్బ తినేటట్లు మాట్లాడకండి. అతని అహాన్ని సంతృప్తి పరుస్తూనే కళ్లు తెరిపించడానికి ప్రయత్నం చేయండి. ఈ 'అహం' ఉందే చాల విచిత్రమైనదండీ. దానిని కొంచెం పొడిచారో అది రెచ్చిన ఆబోతులా కొమ్ములు ముందుకు పెట్టుకొని వచ్చేస్తుంది. గంగడోలు రాసి ముక్కుతాడువేసి పట్టుకున్నారో మీతో కూడా ఎటుపడితే అటు వచ్చేస్తుంది. ఒకాయనవల్ల మీకు పని ఉందనుకొండి. ఆయనకి పేకాటంటే ఇష్టమని మీకు తెలిసింది. ఎలాగో అలాగ ఆయనతో పేకాడి ఓడిపోవాలి. అవును, ఓడిపోవాలి. అప్పుడు మీ పని సగమైనట్లే. గెలిచారో వెంటనే తిరుగు ముఖం పట్టడం మంచిది. ఒక ఆయన పెద్ద భవనం కట్టాలనుకున్నాడు. వాస్తు శిల్పులను పిలిపించి ప్లాను వేయమన్నాడు. ఎవరెంత బాగావేసినా ఆ పెద్దమనిషి దానిలో ఏవో లోటు పాట్లు చూపించి, మార్పులు చెప్పేవాడట. దానికి వాస్తుశిల్పులు ఒప్పుకునేవారు కాదు. కళాకారులు కదా, తిక్కపాలు ఎక్కువ ఉంటుంది. అందువల్ల పేచీ వచ్చి వెనక్కి తిరిగి పోయేవారు. చివరికి ఒక తెలివైన వాస్తుశిల్పి ముందుకువచ్చాడు-రెండు మూడు కోట్ల పథకమాయె, వదులుకోవలసింది కాదు. ఆయన మంచిప్లాను తయారుచేసి కావాలనే అనవసరమైనచోట ఒక కిటికీ పెట్టాడు. పెద్దమనిషి ప్లాను చూసి 'అంతా బాగానే ఉంది కాని ఇక్కడ ఈ కిటికీ ఎందుకు? తీసివెయ్యి' అన్నాడట. వాస్తుశిల్పి అలాగేనని కావాలనేపెట్టిన ఆ అనవసరమైన కిటికీ తీసివేశాడు. ఆ విధంగా తన ప్లానుని యథాతథంగా రక్షించుకోగలిగాడు. మరొక కథ: ఒక చాలా పెద్దపారిశ్రామికవేత్త. ఆయన నుంచి ఎన్నోకోట్లవిలువైన కాంట్రాక్టు సంపాదించడానికి ఎన్నోసంస్థల 'సేల్స్‌మెన్' -ఎంతో అనుభవం, సామర్థ్యం ఉన్నవారు - ప్రయత్నించి విఫలులయ్యారు. ప్రతిభావంతుడైన ఒక యువ 'సేల్స్‌మన్'కి ఒక

ఆలోచన తట్టింది. వెళ్లి ఆ పారిశ్రామికవేత్తను కలుసుకొని తనకంపెనీ తయారీని గురించి వల్లించిన పాఠం అప్పజెప్పాడు. ఆ పెద్దాయన ఒకటే ముక్క చెప్పాడు: 'పో!'అని. యువకుడు ఆయనకు సాల్యూట్ చేసి లేచి గుమ్మం వరకూ వచ్చి, అంతలో వెనుతిరిగి ఆయన దగ్గరకి వెళ్లి "సర్, నేను మిమ్మల్ని ఒకసలహా అడగదలచుకున్నాను, అడగ వచ్చా?" అన్నాడు. పారిశ్రామికవేత్త తెల్లబోయి అడగమన్నాడు. "నేను 'సేల్స్‌మన్'గా ప్రకాశించలేకపోతున్నాను. నేను నిరాశలో మునిగిపో తున్నాను. మీరు అపూర్వమైన అనుభవమున్నవారు. అన్ని రంగాలూ తెలిసినవారు. మీరు నాకు ఏమైనా సలహా యిస్తే, దానిని పాటించి నా జీవితం బాగుచేసుకుంటాను. మీకు మిక్కిలి ఋణపడి ఉంటాను," అన్నాడు యువకుడు. పారిశ్రామికవేత్త రెండుక్షణాలు ఆలోచించి "నేను ఇప్పుడు చాలా బిజీగా ఉన్నాను. ఒక సలభై అయిదు నిమిషా లలో తిరిగి రాగలరా?'' అన్నాడు. అలాగే వస్తానని సమయమవగానే తిరిగి ఆయన వద్దకు వెళ్ళాడు యువకుడు. ఆయన ఇరవై నిమిషాలు అతనికి 'సేల్సుమన్‌షిప్' గురించి సలహాలిచ్చి, తన జీవితంలో అను భవాలుకూడా చెప్పి, చివర ఆ శ్రద్ధాళువైన యువ 'సేల్సుమన్'కి ఆ కోట్లవిలువైన కాంట్రాక్టుకూడా ఇచ్చి పంపాడట. చూశారా, అహం ఎంతపని చేస్తుందో! దానిని వడుపుగా పట్టుకొని వాడుకుంటే ఎంతైనా లాభిస్తుంది మనకి. అవతలి వాడి అహం తృప్తిపరచడంవల్ల మనకి పోయేది ఏమీ లేదుకదా. చివరకి విజయం మనదే అవుతుంది. అందు వల్ల ఎప్పుడూ ముందు అవతలి వారి సద్భావం సంపాదించినతరువాతే మీరు చెప్పతలచుకున్నది చెప్పండి. చక్కగా దున్ని, నీరు పెట్టిన పొలంలో విత్తనం పాతినట్లవుతుందన్నమాట.

ఇక్కడ ఒక విశేషం చెప్పవలసి ఉంది. అవతలివారి సద్భావం సంపాదించిన తరువాతే మీ అభిప్రాయం వెలవరించండి అని గదా

చెప్పుకున్నాం. డేల్ కార్నెగీ కూడా అదే సలహా ఇస్తాడు. కాని మానవ స్వభావంలో మరో లక్షణముంది. ఒక్కొక్కప్పుడు ఒకవ్యక్తి తనకి వ్యతిరేకవైఖరి అవలంభించి, తనని గేలిచేస్తున సమూహాన్ని కోపంతో సవాలుచేసి, కవ్వించి, అప్పుడప్పుడు దూషించికూడా నిర్భీకంగా,ధాటీగా వాదం వినిపించి శ్రోతలను ఆశ్చర్యచకితుల్నిచేసి తన పాదాక్రాంతులుగా చేసుకున్న సంఘటనలుకూడా ఉన్నాయి. చెంపలు వాయించిన వాడికి చేతులు జోడిస్తారన్నమాట. కాని అలా చేయడానికి అసాధారణ సామర్థ్యం, గుండె దిటవూ, వాగ్ధాటీ కావాలి. సాధారణంగా మనం చెప్పుకున్న సూచనే వర్తిస్తుంది. అది క్షేమకరం కూడా.

ఇంతవరకూ మన అభిప్రాయాలను, మనకు తెలిసిన యథార్థాలను ఎదుటవాళ్ళకి చెప్పడం గురించి చెప్పుకున్నాం.మరి మనం ఇతరుల అభిప్రాయాలూ, వారికి తెలిసిన యథార్థాలూ వినవలసివస్తే? ఇతరుల వాదం వినడానికీ, వారికి తెలిసిన యథార్థాలను స్వీకరించడానికీ మనం సిద్ధంగా లేకపోతే ఇతరుల నుంచి అటువంటి నడవడి ఎలా ఆశించగలం ? కాని అవతలివారి అభిప్రాయాలతో ఏకీభవించడానికి ప్రయత్నించండి, అవతలివారు చెప్పినది పూర్తిగా వినండి, అన్న పైన చెప్పిన సూచనలు కొంతవరకు ఇక్కడ అక్కరకు వస్తాయి. అవి పూర్తిగా చాలవు. అవి అవతలివారి పట్ల సానుభూతి ప్రదర్శించడం. వారి సద్భావం సంపాదించడం వరకే పరిమితం. మనం చెప్పదలుచుకున్నది మరింత ప్రభావవంతంగా చెప్పగలగడానికి ఎత్తుగడల వంటివి మాత్రమే. ఇక్కడ అదికాదు, విభిన్న అభిప్రాయాలూ తెలునుకోవాలి, సంబంధించిన యథార్థాలన్నీ తెలుసుకోవాలన్న క్రియాత్మకమైన ఆసక్తి-సత్యంకోసం తపన అన్నమాట-కావలసింది. ఈలక్షణం కనుక మీలో ఉంటే అది మీ వ్యక్తిత్వాన్ని వికసింపజేయడమే కాదు, మిమల్ని

ఎంతో పైకి తీసుకువెళ్తుంది. అంతేకాదు, అది మీలో సహజంగానే సహనం, సౌజన్యం, ఔదార్యం పెంచుతుంది. గాంధీగారు తన ఆత్మ కథకి 'సత్యంతో నా ప్రయోగాలు' అని పెట్టుకున్నాడు. తన సాధనానికి కూడా 'సత్యాగ్రహం' అని పేరు పెట్టుకున్నాడు. కేవలం సత్యంపట్ల ఆయన శ్రద్ధే ఆయనని అంతదూరం తీసుకు వెళ్ళిందన్నమాట.

కాబట్టి మనం ఇతరుల అభిప్రాయాలూ, వారికితెలిసిన యథార్థాలను సానుభూతితో వినడమేగాక, క్రియాత్మకంగా ఆహ్వానించాలి. ఇక్కడ ఒక వ్యత్యాసం గుర్తు పెట్టుకోండి. అభిప్రాయం,తథ్యం(ఫాక్టు) వేరు వేరు. రెండూ ఒకదానికి ఒకటి పొరబడకండి. ఎదరవారి సంబంధంలోనైనా, మన సంబంధంలోనైనా సరే ఈ వ్యత్యాసం గుర్తు పెట్టుకున్ననాడు ఘర్షణలకీ, వైమనస్యాలకీ అవకాశం-కొంతమాత్రమే-తగ్గుతుంది. అవతలివాడి అభిప్రాయాలు మనకి భరింపరానివిగా ఉన్నా, అవి అతని అభిప్రాయాలు మాత్రమే అనుకుంటే అంత బాధపడవలసిన పని ఉండదు. అలాగే ఎదుటవారికి చెప్పేటప్పుడు 'ఇది నా అభిప్రాయం మాత్రమే' అని చెప్పామంటే అవతలివాడు అంత విరుచుకు పడకపోవచ్చు. మనకి తీపి ఇష్టంలేదంటే, ఎందుకు ఇష్టం కాకూడదని పోరాడరు కదా. తథ్యాల విషయం వేరు. అవి తథ్యాలైతే ఆవిధంగానే స్వీకరించాలి. తథ్యాలయినంత మాత్రాన వాటి ఆధారంగా నిర్ణయం చేయకూడదు. ఎందుకంటే తథ్యాలు (ఫాక్ట్స్) అసంఖ్యాకం. విజ్ఞానం ఏమి కోరుతుందంటే అవి సంబంధించినవై ఉండాలి.సమగ్రంగాఉండాలి. అలాగే మనంకూడా సంబంధించిన తథ్యాలు అన్నీ లభించాయా లేధా తెలుసుకొని మరీ వ్యవహరించాలి. తథ్యాలమీద యుద్ధం అవివేకం వాటి గురించి ఆవేశం అనవసరం. కాబట్టి ఎదుటవాడు ఎంత తలతిక్కగా మాట్లాడుతున్నా, మీరు ఆగ్రహం తెచ్చుకోక, శాంతంగా,

హేతుబద్ధంగానే మాట్లాడుతూ ఉండండి. ఎటువచ్చీ వినయంతో వ్యవహరించండి. ఏమీ తెలియనివాడే అన్నీ తెలుసుననుకొని విర్రవీగుతాడు. నిజంగా తెలిసినవాడు 'అయ్యో నాకు తెలిసినదెంత? తెలుసుకోవలసినది అనంతంగా ఉందే!' అనుకుంటాడు. జిజ్ఞాసా, వినయం ( జిజ్ఞాసలోనే సత్యంపట్ల శ్రద్ధ మిళితమై ఉంటుంది. అలాగే వినయంలో సహజంగా సహనం, సౌజన్యం కలిసి ఉంటాయి). ఈ రెండూ తప్పక మిమల్ని ఎంతోదూరం తీసుకువెళ్తాయి.

మనం ఈ అధ్యాయం ముగించేలోగా ఒక యథార్థాన్నికూడా గుర్తించడం మంచిది. పైనే చెప్పుకున్నాం కదా ఒక్కొక్కప్పుడు కోపంతో ఆవేశంతో ఎదుటివారిని ఎదిరిస్తూ, సవాలుచేస్తూ, ధాటీగా మాట్లాడడం ద్వారాకూడా అద్భుతమైన ప్రభావం కలుగచేయవచ్చని-కాని అది అపవాదం మాత్రమే అనుకున్నాం, సాధారణసూత్రం కాకూడదనుకున్నాం. ఆ అపవాదు గురించే మనం మరికొంచెం మాట్లాడుకోవాలి. కొందరు చూడండి బారెడుచుట్ట నోట్లో పెట్టుకొని పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్త విషయాలమీద కచ్చితమైన అభిప్రాయాలు పొగ ఊదినట్లే ఊదేస్తూ ఉంటారు. వారికి తథ్యానికీ అభిప్రాయానికి తేడా తెలియదు. వారికి తెలిసినది కొంచెం, కాని ఆత్మవిశ్వాసం అనంతం. పాకిస్తాన్ ప్రభుత్వాధినేత జియా ఉల్‌హక్, ఇరాన్ మతగురువు ఖోమైనీకూడా అంత ధీమాగా మాట్లాడరేమో! 'ఆ రీగన్ కేమీ తెలియదు ........ ఈ బీజేపీ వాళ్ళున్నారే ఉత్త పిడివాదులు .... నన్నడిగితే ఈ ఎమ్మెల్యేలనందరినీ ఒక్కొక్కళ్ళనీ తీసుకువచ్చి గదిలోపెట్టి జాగ్రత్తగా మసులుకుంటాను అని ఒట్టువేసేవరకూ చాపచితగ్గొట్టాలి' ఈవిధంగా ఉంటాయి వారు సెలవిచ్చే అభిప్రాయాలు. 1977వ సంవత్సరం ప్రారంభంలో ఒక మిత్రుడన్నాడు:"ఇందిరాగాంధి ఎందుకు ప్రతిపక్షాలకు అంత

తయపడుతోందో బోధపడడం లేదు. ఇప్పుడామె ఎన్నికలు పెట్టిందంటే నూటికి తొంభై తొమ్మిది మంది ఆమెకే ఓటువేస్తారు" మరి వారంరోజుల్లోనే అత్యవసరపరిస్థితి ఎత్తివేయడం,మరోనెలలో ఎన్నికలు పెట్టడం, ఇందిరాగాంధి చిత్తుగా ఓడిపోవడం ఇదంతా చరిత్రేకదా. నూటికి తొంభైతొమ్మిదిమంది అభిప్రాయం గురించి మాట్లాడేవాడు కనీసం తొమ్మిదిమందినైనా కలుసుకొని వారి అభిప్రాయం తెలుసుకొని ఉండడు. ఆఖరికి అతని భార్య అభిప్రాయం కూడా అతనికి సరిగా తెలియకపోయినా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇలాంటివారు వినేవాళ్ల అమాయకత్వం, సౌజన్యం అలుసుగా తీసుకుంటారు. తమని ఖడించడానికి నిర్లక్ష్యంవల్లో, మొగమాటంవల్లో పూనుకోకపోవడమే తమ అభిప్రాయాలు తిరుగులేని తీర్పుల్లా భావిస్తారు. ఇలాంటి వారిని పట్టించుకోవద్దని మనం మొదట్లో అనుకున్నాం. కాని వారు అనామకులూ ఎవరూ పట్టించుకోనివారైతే పరవాలేదు. వారినలాగే వదిలెయ్యవచ్చు; కాని వారు వృత్తిరీత్యా కానీ, పదవిరీత్యా కానీ, స్తోమతరీత్యా కానీ సమాజంలో తగిన స్థానం ఉన్నవారే. కాబట్టి వారి మాటలు సమాజంమీద కొంత ప్రభావం చూపి తీరుతాయి. ఆ ప్రభావం హానికరమూ కావచ్చు,కనీసం మంచిమొక్కలు పెరగకుండా పిచ్చిమొక్కలు అడ్డుపడినట్లు ఆరోగ్యదాయకమైన ధోరణులు వర్ధిల్లకుండా చేస్తాయి. కాబట్టి సమాజం మంచికీ, మన మంచికీ - వారి మంచికికూడా-వారిని సరిదిద్దడం, కనీసం అదుపులో పెట్టడం అవసరంకావచ్చు. కాని మనం పైనచూపిన ఎత్తులు వారి దగ్గర ఏమీ పని చేయవు. మనం వారు చెప్పదలచుకున్నది వినదలిస్తే వారు చెప్పుకుపోతారేకాని మనం ఒక్కమాట మాట్లాడడానికి అవకాశమే ఇవ్వరు. మనం ఏకీభవించినట్లు కనబడితే అది వారి గొప్పతనం అన్నట్లు భావిస్తారు. కాని మనం ఏమాత్రం భిన్నయథార్థం రూపించబోయినా ఏదో వంకని అక్కడ ఆపివేసి లేచిపోతారు. కాబట్టి

అలాంటివారితో వ్యవహరించవలసివచ్చినప్పుడు ఎడ్డెమంటే తెడ్డెమనడం, వారిది సహజంగా ఒకవైపు అతివాదమైతే మనం-మర్యాదగానే సుమండీ-సరిగ్గా దానికి ప్రతికూలంగా అతివాదంచేయాలి. గట్టిగా అరిచేవాడి ముందు మనం మరింత గట్టిగాఅరిస్తేనే వాడు తగ్గివస్తాడు. అలాగే వారు తమ అభిప్రాయానికి పూర్తిగా విభిన్నమయిన అంతే తీవ్రమైన అభిప్రాయం ఎదురవుతేనే, నోట్లోనుంచి చుట్టతీసి, నోరు తెరచి కొంచెం సేపు మాట్లాడకుండా ఉంటారు. వారిలో ఏమాత్రం హేతుబద్ధదృక్పథం ఛాయలుకనిపించినా మీరు ఎంతోసౌమ్యంగా వారికిమెల్లగా నచ్చజెప్పండి. మీ మర్యాదతో కూడిన వ్యవహారానికి లోబడే ఇదంతాచేయండి. వారికి ఒక్కొక్కప్పుడు కోపంవస్తే రావచ్చు, రానీయండి. అంటే వారిలో కదలిక వచ్చిందన్నమాట. కాని వారితో మీకు భిన్నాభిప్రాయమే కాని శతృత్వం లేదనీ, వారి సద్భావమే కావాలని కోరుతున్నారనీ మరో అవకాశం తీసుకొని వారికి తెలిసేటట్టు చేయండి.

చివరికి చెప్పవచ్చేదేమిటంటే ఆచరణలో ఏమి చేయాలి అన్నది నిర్ణయించుకోవలసింది మీరే. తగు నిర్ణయం చేయడంలోనే మీ విజ్ఞత ప్రదర్శితమవుతుంది.

---

* సన్నని రంధ్రాలగుండా వెలుతురు వెలికి వస్తుంది, అలాగే చిన్న చిన్న విషయాలు వ్యక్తి యొక్క శీలాన్ని బయట పెడతాయి.

* వెయ్యి మైళ్ళ ప్రయాణంకూడా ఒక్క అడుగుతోనే ప్రారంభ మవుతుంది.

* మిత భాష అతి హాయి, అతి భాష మతి హాని.

7

# మంచితనం

మనం ముందు అధ్యాయంలో మర్యాద ఆవశ్యకతను గురించి చర్చించుకున్నాం. ఇతర దేశాలవారి మర్యాద ఎంత సహజంగా ఉంటుందో, అందులోనూ జపానీస్ మర్యాద గొప్పగా ఉంటుందనీ తెలుసుకున్నాం. టోకియోలో మీకు సరిగా తెలియదనుకోండి. ఒక జపానీస్ నడిగితే అతడు మీకు సూచనలుచేసి ఊరుకోడు. మీ కూడా నాలుగు వీధులు తిరిగివచ్చి,మీ గమ్యస్థానికి చేర్చి మరీ వెళతాడు. అలాగే వారెంతో సున్నితమైన మనస్కులని పేరు. పువ్వుల అలంకరణని ఒక కళ-ఇకేబానా-గా తయారుచేశారు. మీరు చూడకుండా పువ్వుని తొక్కి వేశారనుకోండి. వారు గిజగిజలాడి పోతారు కాని వారే ఒకడు దారి ప్రక్కన ఒక కుక్కను వేలాడగట్టి, దానిని నానా చిత్రహింసలు పెట్టినా చలించకుండా, పట్టించుకోకుండా వెళ్ళిపోతారుట. వారి నడవడిలో ఈ వైరుధ్యం రెండవ ప్రపంచయుద్ధసమయంలో వారు ఆక్రమించినప్రాంతాలలో చేసిన మహాదారుణాల్లో ప్రతిఫలించింది. ఒక ఉదాహరణ చెబుతారు. బర్మాలో జరిగిందట,జపాన్ సైనికులకు గొడ్డుమాంసం కావలసివచ్చింది. ఒక ఆవునో,ఎద్దునో చంపితే కావలసిందిపోగా తక్కినది వ్యర్థమైపోతుందనే ఉద్దేశ్యంతో ఒక ఆవునో ఎద్దునోపట్టుకొని కావలసినంత మాంసం కోసితీసుకొని దానిని వదిలేసేవారట.మళ్ళీ కావలసివచ్చినప్పుడు తాజాగా కోసుకుందు కన్నమాట. ఇది తలచుకుంటేనే మీ మనస్సు విలవిల

లాడుతోంది కదూ? జపానీస్‌ని పదిలేయండి. పశ్చిమదేశాల వారి నైనా తీసుకోండి. వారి వ్యవహారం కూడా మర్యాదా సంపన్నంగా ఉంటుందని అనుకున్నాం కదా-కాని యుద్ధాలూ, ఆవేశకావేషాలూ వస్తే వారు ఎంతో క్రూరంగా, దారుణంగా వ్యవహరించ గలరని ఎన్నో ఉదంతాలు ఉన్నాయి. అమెరికాలో మాఫియా ముఠాలని ఉంటాయట (ఇవి ఇటలీ నుంచి వచ్చాయని చెబుతారు) హత్యచేయడం కాలిపోయిన అగ్గిపుల్లని విసిరేసినట్లుంటుంది వారికి. వారి నాయకుడిని మీరు కలుసుకుంటే అతడు మీతో ఎంతో మర్యాదగానే వ్యవహరిస్తాడు. కాని అంతే శాంతంగా మీరు వెన్నుతిప్పగానే, మీ తలలోనుంచి పిస్తోలు తూటా పోనిచ్చి మిమల్ని తూము కాలవలో పడదోయించి వేయగలడు.

కాబట్టి మర్యాద ఆవశ్యకమన్నామంటే పైపై మర్యాదకాదు. లోపలి సౌజన్యం విచ్చుకుంటే దాని పరిమళంగా వచ్చేమర్యాదే విలువైనది. (పై మర్యాదకైనా అసలు విలువ ఉండదనికాదు.)

మర్యాద నేర్చుకోవచ్చు గాని, మంచితనం నేర్చేదికాదు. ఒక్కొక్కరు మంచిగా నటించవచ్చు గాని, ఆ నటన ఎప్పుడో ఒకప్పుడు బయటపడి పోతుంది. ఎందుకంటే అలా నటించడానికి కారణం ఏదో ప్రయోజనం దృష్టిలో పెట్టుకోవడంవల్లనైఉంటుంది. డేల్ కార్నెగీ పుస్తకం 'హౌటు విన్ ఫ్రండ్జ్ అండ్ ఇన్ఫ్లుయన్స్ పీపుల్'అన్నదాని నిండా అద్భుతమైన సలహాలూ,సూచనలూ ఉన్నాయని మనంచెప్పుకున్నాంకదా! కాని ఆయన పుస్తకంపొడుగునా తను చెప్పిన సలహాలూ, చేసిన సూచనలూ పాటిస్తే, మనకే ఎంతలాభదాయకంగా ఉంటుందో,ఎన్నో ఆసక్తికరమైన కథలూ-అన్నీ వాస్తవగాథలే-చెబుతాడు.ఆవిధంగామనుష్యులను దారిలోకితెద్దామనీ, సాంఘిక సంబంధాలు (లేదా మనం మొదట్లో అనుకున్న మానవ సంబంధాలు) బాగుపరుద్దామనీ, ఆయన ఉద్దేశ్యమై ఉండవచ్చు. కాని

అది అత్యుత్తమమైన పద్ధతి కాకపోవచ్చు. ఆయన పుస్తకం ఈపాటికి కోటికిపైగా ప్రతులు అమ్ముడుపోయి ఉంటుందని అనుకున్నాం.వాటిలో అధికశాతం అమెరికాలోనే అమ్ముడై ఉంటాయి. ఆ పుస్తకం అక్కడి సభ్యసమాజంమీద గొప్ప ప్రభావం చూపి ఉండాలే. కాని ఆ సమాజంలో కూడా తక్కిన దేశ సమాజాల్లో ఏయే చెడ్డ లక్షణాలు కనిపిస్తాయో స్వార్థబుద్ధీ, అన్యాయా, అపోహా, ద్వేషం వంటివన్నీ కనిపిస్తూనే ఉంటాయి. పుస్తకం చదివినవారు తమ జీవితాన్ని సంస్కరించుకొని సమాజంలో గొప్ప పేరూ, పలుకుబడీ సంపాదించవచ్చు, ప్రభావ వంతులైన వ్యక్తులుగా రూపొంది, పెద్దపెద్ద పదవులు అధిష్ఠించవచ్చు. కాని వారంతా మంచివారుకూడా అయి ఉండాలని ఎక్కడాలేదు. వారు పెట్టుకున్న లక్ష్యాలువేరు, ఆశించిన ప్రయోజనాలు వేరు. ఏమీ చదువూ సంస్కారంలేని అనాగరికజాతులంటామే వారిలోనే నమ్మకం,నిజాయితీ, సరళత్వం కనిపిస్తాయేమోననిపిస్తుంది. ఇదంతా డేల్ కార్నెగీని విమర్శిం చడానికి కాదు. ఆయన రాసిన విధంగా రాయకపోయి ఉంటే ఇన్ని లక్షలమంది పాఠకుల్ని ఆకర్షించలేక పోవును. వారిజీవితాల్లో మార్పు తేలేకపోవును. మతాలుకూడా చేస్తున్నదేమిటి? పాపులు నరకబాధలను భవిస్తారనీ, పుణ్యవంతులు స్వర్గసుఖాలనుభవిస్తారనీ చెప్పడం లేదూ? మానవ సంబంధాలను మెరుగు పరచుకోవడంద్వారా వ్యక్తికీ, సమాజా నికి మేలే అని చూపించడంలో డేల్ కార్నెగీ కొత్తదారి తొక్కాడు, మహోపకారం చేశాడు. కాని అది చాలదనే మనమనేది. మంచితనం పునాదిమీద నిలబడితేనే మానవ సంబంధాలు నిలకడపొంది మెరుగు పడతాయి.

కాని మంచితనానికి మంచిగా ఉండటమే తప్ప మరో ప్రయో జనం, లక్ష్యం ఉండవు. కొందరు తల్లిదండ్రులు తమ పిల్లలతో వాడు

మంచిగా ఉంటే మిఠాయి పెడతామనో, సినిమాకి తీసుకు వెళతామనో, పారితోషికమైనవస్తువు కొనిపెడతామనో ఆశ పెడతారు. కాని అది మంచిది కాదు. 'నువ్వు ఒక గంట మౌనంగా కూర్చుంటే నీకు రూపాయి ఇస్తాను' 'నువ్వు బళ్ళో ఇచ్చిన ఇంటిపని పూర్తి చేస్తే సినిమాకు తీసుకు వెళతాము' అనో అనవచ్చును. కాని మంచికీ ప్రలోభానికీ ముడిపెట్ట కూడదు. దానివల్ల పిల్లలలో కపటపు ధోరణులు రావచ్చు.

కొందరు ఇది అర్థం చేసుకోక మంచిపనులు చేయడమే మంచి తనం అనుకుంటారు. మంచి పనులని తోసిపుచ్చడం కాదు. ఒకడు లక్ష లార్జించాడు. ఆ ఆస్తి చూసుకొని తాగి తందనాలు ఆడి, దుష్కృత్యాలు చేయకుండా, ఏ కళాశాలకో, వైద్యశాలకో, అనాధ శరణాలయానికో దానాలు చేశాడనుకోండి. దానివలన సమాజానికి కొంత మేలే కదా! కాని ఆ మంచి పనులనుబట్టే ఆ వ్యక్తి మంచివాడని నమ్మకంగా చెప్ప లేం. దొంగ సాధువుల్ని గురించీ, తమ దుష్ట వ్యాపారాల్ని కప్పి పుచ్చేందుకు దాతలుగా, పెద్దమనుషులుగా నటించే వాళ్ళని గురించీ వింటు ఉంటాము కూడా. మరి అయితే మంచి పనులు చేసేవాళ్ళకీ, మంచివాళ్ళకీ మధ్య తేడా గుర్తించడం ఎలా అంటే ఈ మంచిపనులు చేసేవాళ్ళు ఏదో ప్రయోజనం ఆశించే చేస్తారు- పేరుకోసం కావచ్చు, పలుకుబడి కోసం, పదవీ పెత్తనంకోసం కూడా కావచ్చు - ఆఖరికి పుణ్యం వస్తుం దని చేసినా ఈ కోవకిందకే వస్తారు, ఏదో నిగూఢమైన ప్రయోజనం ఆశించి చేసేవారు ఇప్పుడే అనుకున్నట్లు అపాయకారులుకూడా-వారి చర్యలు దుర్మార్గాన్ని కప్పిపుచ్చుతాయి కాబట్టి. మంచివాడు మంచిపను లనుకొని చేయడు. అతని మంచితనం అతని పనులద్వారా వ్యక్తమవు తుంది. సహజంగా అవి మంచిపనులు అవుతాయి. కాని చిత్రంగా సమాజస్థితిగతుల్నిబట్టి అవి ఒక్కొక్కప్పుడు చెడ్డవిగానూ, అప్రియం

గానూ కూడా కనపడవచ్చు మంచి వాడు తనకోసం ఒక ప్రయోజనం ఆశించి చేయడు. అలా చేయడం అతనికి సహజం. అలా చేయకపోతే బాధకు గురి అవుతాడు కూడా.

అయితే మీరు మనుషుల్ని మంచివారుగా, చెడ్డవారుగా విభజిస్తారా ? అని అడగవచ్చు. కొందరు అసాధారణ వ్యక్తుల్లో తప్ప ప్రతి మనిషిలోనూ మంచీ, చెడూ రెండూ ఉంటాయి. పాళ్ళు తేడా ఉండవచ్చు "అంటే మంచితనం వ్యక్తుల లోపలే ఉంటుంది. నేర్చుకొనేదికాదు. అని మీరు అంటారు కదూ" అనవచ్చు. అవును, అది నేర్పేది కాదు. బయటనుంచి తెచ్చేదీ, తెచ్చుకొనేది కాదు అని ముందే అనుకున్నాం. "మరి మంచి నేర్చుకోలేనిదైతే మీరెందుకంత ఈ సొద అంతా చెప్పేది? మంచితనం అన్నది కొద్దో, గొప్పో ప్రతి వారిలోనూ ఉంటుందనికూడా మీరే అన్నారు. ఇక దాని గురించి మీరు చేయగలిగినదేమిటి" అని ప్రశ్నించవచ్చు. 'విద్య' అన్నమాటకి ఇంగ్లీషు పర్యాయపదం 'ఎడ్యుకేషన్.' 'పైకి తేవడం' అని దాని అర్థం. అంటే విద్య ద్వారా మీరు బాలురలో తెలివి తేటలు పెట్టలేరు; వాటిని పైకి తేవడమే మీరు చేయగలిగేది; వాటిని వెలికితెచ్చి, ప్రోత్సాహమిచ్చి, పెరగడానికి అవకాశమివ్వగలరు అనే. అలాచేస్తే ఒక వ్యక్తి ఎంతవరకు పోతాడు అన్నది అతనిలో స్వతహాగా ఉన్న తెలివితేటల మీదే ఆధారపడి ఉంటుంది. మీరు ఎంత ప్రయాసపడినా ఒకడిని పాఠశాల చదువు పూర్తి చేయించడమే కష్టం. మరొకడు కొంచెం అవకాశం లభిస్తే చాలు ఎంతపైకైనా పోతాడు. ఒక్కొక్కడు ప్రతికూలపరిస్థితులున్నా, అవే సవాలుగా తీసుకొని వాటిని లొంగదీసుకొని ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచుతాడు. కాని సాధారణవ్యక్తుల విషయంలో అవకాశం ఇవ్వక పోవడంద్వారా, మానసికంగా, భౌతికంగా ప్రతికూలపరిస్థితులు సృష్టించడంద్వారా ఒకడిలోని తెలివితేటలు అణచివేయవచ్చుకూడా. విద్య గురించి అన్నట్లే మంచితనం గురించీ అలాగే చెప్పవచ్చు.

కాని "ఈ మంచితనం అనేది ఎక్కడ ఉంటుంది? గుండెలోనా? మెదడులోనా? అది ఎలా ఉంటుంది? అది ఏమిటి?" అని ప్రశ్నిస్తే ఏమని చెప్పగలం? మనం మొదట్లోనే అనుకున్నామే, ఈనాడు పాత కాలపు నీతిసూత్రాల్నిబట్టే కాక మానవసంబంధాల దృక్కోణంనుంచి చూడడం అవసరం అనుకున్నామే, అదే ఇక్కడ వర్తిస్తుంది. మంచి తనం అనేది ఒక పదార్థం కాదు. అది ఒక లక్షణం మాత్రమే. ఒకటి అనికూడా అనలేం. మనిషిలో తనఅస్తిత్వం - కేవలం తనఆస్తిత్వమనే కాదు, తన జాతి-అంటే మానవజాతి-అస్తిత్వం కాపాడి, పెంచి వ్యాపింపజేసే సహజధోరణులు కొన్ని ఉంటాయి. పక్షులూ, జంతువుల కార్యకలాపాలు చూడండి. వాటికవి ఎవరు నేర్పారు? అవి అన్నీ ఆయా జాతుల సంరక్షణకీ, భవిష్యత్తులో ఆజాతి కొనసాగి, వృద్ధి పొందడానికీ దోహదపడేవే. చెట్ల విషయంలోకూడా ఇదే చూస్తాం. అలాగే మనిషి విషయంలోకూడా. మానవజాతి మనుగడకి అవసరమైనధోరణులు ప్రతివాడిలోనూ సహజంగాఉంటాయి. మనం ధోరణులు అన్నాం కాని ధోరణి అనలేదు. (పైనకూడా అనుకున్నాం - మంచితనం అన్నది ఒకే లక్షణం అనుకోలేమని)అతనిలో అనేక సహజప్రవృత్తులుఉంటాయి. శుద్ధంగా అయితే అవిఅన్నీ, మనమిప్పుడే అనుకున్నట్లు, మానవజాతి మనుగడకి దోహదపడేవే. కాని పరిస్థితులప్రభావంవల్ల ఆ ధోరణుల్లో కొంత అల్లకల్లోలం కలిగి కొన్ని అనారోగ్యకరంగా తయారై, ఘర్షణలు బయలుదేరుతాయి. ఒక్కొక్కప్పుడు ఆరోగ్యకరమైన ధోరణులు- అంటే జాతిమనుగడకి దోహదపడే ధోరణులు - అణిగి పోవచ్చుకూడా. మనం చేయగలిగేది అనారోగ్యకరధోరణుల్ని అరికట్టి, మనిషినడవడిలో తిరిగి సమన్వయం, సమతూకం వచ్చేటట్లుచేసి అతనిలోని సహజధోరణులు ఆరోగ్యకరంగా పెరిగేట్లు చూడడమే. ఇక్కడే మానవుడిమనస్సు

ముఖ్యమైన పాత్ర వహించేది. జంతువులలో తమంతట తాము తమ స్వాభావికమైన నడవడిని మార్చుకోవడం అసంభవమని చెప్పవచ్చు. మనిషిలో మాత్రం అతని మనస్సుమూలంగానే అది సంభవం. అతను ఆలోచించి స్వయంగా తెలుసుకోగలుగుతాడు. ఇతరులకూ తెలియజెప్ప గలుగుతాడు. అందుకే ఇంత అనంత సాహిత్యం సృష్టి అవుతోంది. అది అంతా మానవుడి ఆనందంకోసమే కాదు, అతని బాగుకోసంకూడా ప్రయత్నిస్తుంది. మానవుడి జ్ఞానం అతనిమీద ఒక పెద్దబాధ్యత కూడా మోపుతుంది.మానవుడు తనమనస్సుకారణంగా తనబాగూ,తనజాతి(అంటే మానవజాతే అనుకున్నాం కదా) బాగే కాకుండా సమస్త జీవరాసుల-జీవ రాసులేకాదు, సమస్త చరాచర ప్రపంచం - బాగునిగురించికూడా ఆలో చించవలసి వస్తోంది. జ్ఞానమే శక్తి అని విజ్ఞానం చెబుతుంది. (మొట్ట మొదట ఈవాక్యం అన్నది ఆధునికవిజ్ఞానానికి పథ ప్రదర్శకుడు అని చెప్పబడే లార్డ్ బేకన్) కాని మనం జ్ఞానం బాధ్యతకూడా గుర్తించాలి. మన ప్రాచీనులు చెప్పిన ధర్మం అన్న నిర్వచనం దీనికి సరిగావర్తిస్తుంది. 'ధారయతీతి ధర్మః' అంటారు. అంటే మానవతనేకాదు, సృష్టినే నిల బెట్టేది ధర్మం అని. అందుకే "ధర్మో రక్షతి రక్షితః" అన్న వాక్యం కూడా వచ్చింది. నువ్వు ధర్మాన్ని రక్షిస్తే (పాటిస్తే) అది నిన్ను రక్షి స్తుంది అని. అంటే మనమాటల్లో చెప్పాలంటే మనబాధ్యతల్ని గుర్తించ టంలోనే భద్రత ఉందన్నమాట.

ఇదేమిటి,ఏవో సంస్కృతశ్లోకాలువల్లిస్తూ,ధర్మం,బాధ్యతా అంటు గంభీరవిషయాల్లోకి వెళ్ళిపోతున్నారే అని మీరు ఆశ్చర్యపడుతున్నారు కదూ. మీకు కొంచెం ఊపిరాడనట్లయింది కదూ,నిజంచెప్పొద్దూ, నాకూ కొంచెం ఇబ్బందే అనిపించిదండి, కాని అప్పుడప్పుడు గంభీరవిషయా ల్లోకి పోకతప్పదు. జీవితమంటే అంతేకదా. అప్పుడప్పుడు ఎండలో

మాడవలసి వస్తుంది, వర్షంలో తడవ వలసి వస్తుంది, [illegible] కాళ్ళూ, చేతులూ కాయలుకాసేటట్లు పనిచేయవలసి వస్తుంది. కాని [illegible] కొంత సేపు ఉంటేనే నీడలోని చల్లదనం తెలిసివస్తుంది. [illegible] లాడితేనే వెచ్చదనం హాయి అనుభవించేది. ఇప్పుడు [illegible] ఎండలోనుంచి చల్లని నీడలోకి వద్దాం.

మళ్ళీ ఒకసారి మంచితనం అనేది వేరుగా ఉండదని. ఆరోగ్య-కరమైన సహజ ప్రవృత్తుల వికాసాన్నే మంచితనం అంటామని. అనారోగ్యకరంగామారి, సంఘర్షణనీ,కష్టాల్నీ, బాధల్నీ కలిగించే వాటి విజృంభణే చెడ్డ అని గుర్తు చేసుకుందాం, పొడుగునా గుర్తు ఉంచుకుందాం.

ఆవిధంగా గుర్తు ఉంచుకున్న తరువాత, మంచిని గురించి మనం పైన అనుకున్నవి-ప్రతివాడిలోనూ మంచి సహజంగా ఉంటుందనీ, కొన్ని పరిస్థితుల వల్ల అది అణగిపోవచ్చునీ, అలా అణగిపోయినది కూడా ఒక్కొక్కప్పుడు వెలికి వస్తుందనీ, మంచిని [illegible] మనం చేయగలిగిందనీ-ఎలానిజమో చూద్దాం.

మీరు చాలాకథలు వినేఉంటారు, సినిమాలు చూసి ఉంటారు. (తెలుగులో 'బంగారు పాప' అని ఒకటి వచ్చింది.) ఒక గజదొంగ కానీ, పరమ దుర్మార్గుడుకానీ ఉంటాడు. అతనెన్ని హత్యలూ, [illegible] మానభంగాలూ చేశాడో లెక్కేఉండదు. అలాంటివాడు ఒక పసిబిడ్డను రక్షించే పరిస్థితి ఏర్పడుతుంది. అతనిలో మానవత్వం మేలుకొంటుంది. అది సహజంగా మొదట్లో తప్పటడుగువేస్తుంది. కాని కొద్దిలోనే స్థిరంగా ముందుకు సాగుతుంది. మనిషి మారిపోతాడు. అపూర్వ త్యాగాలుచేస్తాడు. ఈవిధంగా అణగిపోయిన మానవత్వాన్ని తట్టి మేల్కొల్పడమే

మహాత్మాగాంధీ యొక్క సత్యాగ్రహం యొక్క లక్ష్యం. అందుకే ఆయన శిష్యుడు వినోభాబావేనుంచి ప్రేరణపొంది జయప్రకాశ్‌నారాయణ్ కరుడు గట్టిన ఎందరో బందిపోట్లను మార్చి సంఘంలో బాధ్యతకల వ్యక్తులు చేయగలిగాడు (శాంతారాం హిందీ చిత్రం "దో ఆంఖే బారహ్ హాథ్" కూడా మీరు చూసివుంటారు). చెంఘిజ్‌ఖాన్ గురించి విననివారు ఉండరు కదా. ఆరేడు శతాబ్దాల క్రిందట ఆసియా యూరోపుల్లోని ఎన్నో దేశాలు అతని మంగోలు సైన్యాల (వాటిని 'బంగారు మూకలు' అనేవారు). ముందు పాదాక్రాంతమై గడగడ వణకిపోయాయి. ఈనాడుమంగోలులు బౌద్ధ ప్రభావం కారణంగా తమ బ్రతుకులేవో తాము చడీచప్పుడు లేకుండా నడుపుకుంటున్నారు. అశోకుడి కథ మనమెరుగున్నదే. స్విస్ వారూ. స్వీడస్‌వారూ రెండు మూడు శతాబ్దాల పూర్వంవరకూ అతి భయంకర యుద్ధజాతులని పేరు కాని ఈనాడు వారు ప్రపంచంలో అత్యంత శాంతికాముకులుగా పేరు పొందారు.

ఇకమంచి ఎలా చెడుగా పరిణమించ వచ్చో-అంటే పరిస్థితుల ప్రాబల్యంవల్ల అనారోగ్యకరమైన ప్రవృత్తులు విజృంభించి వ్యక్తిత్వాన్ని మొత్తం కప్పివేయడం లేదా విషపూరితం చేయడం గురించి ఒక కథ-కల్పిత గాథకాదు, నిజమైనదే-దాని ఫలిత ఈనాటికి కఠిన యదార్థంగా మనల్ని బాధపెడుతోంది-చూదాం.

మూడు, నాలుగు శతాబ్దాలక్రిందట ఒక బెంగాల్ రాకుమారుడు ఉండేవాడు, అతడు కాలాపహాడ్‌గా పేరుపొందాడు. అతడు పూరీ జగన్నాధుని భక్తుడు అతడొక ముస్లిం రాజకుమారిని ప్రేమించాడు. ఆమె అతనికోసం ఇస్లాంవదలి హిందుత్వంలోకి రావడానికి సిద్ధపడిందికూడా. కాని పూరీ పూజారులూ ఇతరచోట్ల బ్రాహ్మణులూ అందుకు అంగీకరించకపోగా అతన్ని దూషణావమానాలకు గురిచేశారు. దానితో అతనిలో

పగవచ్చి, అతడే ముస్లింగామారి ఆ తరువాత బెంగాలు అంతటా స్వైర విహారంచేసి, హిందువుల్ని సకలబాధలు పెట్టసాగాడు. అతని బాధలకు తట్టుకోలేక చాలామంది ఇస్లాంలోకి మారిపోయారు. స్వాతంత్ర్యం రాక ముందు బెంగాలురాష్ట్రం ముస్లింజనాభా అధికంగాకలది కావడానికి కారణం ఆనాడు కాలాపహాడ్ పగతో చేసిన చర్యలే !

పగవల్ల రాక్షసుడై మళ్ళీ మానవత్వం మేల్కొని అమరుడైన ఒక వ్యక్తి కథ ఉంది. అతడే కొరియోలినస్ (ఈ పేరున షేక్స్పియర్ నాటకమొకటి ఉంది.) అతడు గొప్పసైనికుడే కాని అంతకన్నా గొప్ప అహంభావీ, గర్విష్ఠి అని రోమునగరపు పెద్దలూ, ప్రజలూకూడా భావించి, అతనిని నానా అవమానాలకీ గురిచేసి, నగరంనుంచి తరిమి వేస్తారు. అతడు పగతోరగిలిపోతూ రోమ్‌నగరశత్రువుల దగ్గరికిపోయి, వారికి రోమ్‌నగరాన్ని జయించిపెడ్తానని మాటయిచ్చి, పెద్దశత్రుసేనని తీసుకొని రోమ్‌మీదకి దండెత్తి వస్తాడు. అతనిముందు రోమ్‌సైన్యాలు నిలబడలేక పోతాయి. రోమ్ నగరానికి సర్వనాశనం తప్పదని భయం వ్యాపిస్తుంది. అతనినలా అవమానించి తరమవలసినది కాదని అప్పుడు పశ్చాత్తాప పడతారు నగరపౌరులూ, పెద్దలూ. కాని అప్పుడు చేయ గలిగిందేమీ లేదు. 'నీ సొంతనగరాన్ని నాశనం చేయవద్దు' అని ఏ మొగం పెట్టుకొని అతని నభ్యర్థించగలరు ? అభ్యర్థించినా ప్రతీకా రేచ్ఛతో ఉన్నఅతను వింటాడా ? చివరికి వారు కొరియోలినస్ తల్లినీ, భార్యనీ, పిల్లల్నీ అతని దగ్గరకు పంపుతారు. వారు మాతృనగరాన్ని నాశనం చేయవద్దని అతనిని బ్రతిమాలుతారు. అతను మొదట్లో వినడు. కాని చివరికి ప్రేమజయిస్తుంది.తాను తనసైన్యాన్ని వెనక్కి తీసుకుపోతా నని హామీయిచ్చి కొరియోలినస్ అ విధంగానే చేస్తాడు. కాని తాము పెట్టుకున్న ఆశల్ని భంగపరచాడనే కోపంతో శత్రునాయకులు కొరియోలినస్‌ని అందరూ కలిసి పొడిచి చంపివేస్తారు.

మరొక కథ. ప్రసిద్ధ నవలారచయిత విక్టర్‌హ్యూగో రచించిన 'లే మిరాబ్లే'(బీదలపాట్లు) మీరుచదివి ఉంటారు,కనీసం విన్నైనాఉంటారు. అందులోనూ ఆ నవల ప్రధానపాత్రధారి జీన్ వాల్‌జీన్ కథతెలియని పాఠశాల బాలుడుండడు. ఆ కథటుకీగా గుర్తుచేస్తున్నాను. జీన్‌వాల్‌జీన్ బీదవాడు. అతనికెక్కడా పనిదొరకదు. పస్తులుండవలసివస్తుంది. దాని కతడు బాధపడడు. అతని అక్కా పిల్లలూ ఆకలితో అలమటిస్తుంటే తట్టుకోలేకపోతాడు. ఒకరోజు ఒక రొట్టెల దుకాణంనుంచి ఎవరూ చూడడం లేదనుకొని-తనకోసంకాదు అక్కపిల్లలకోసం-ఒకరొట్టెదొంగి లించబోతాడు. దుకాణపుయజమాని అతనిపట్ల ముందే అనుమానం కలిగి, చాటున నిలబడి అతను చెయ్యి లోపలపెట్టగానే పట్టుకుంటాడు. జీన్ వాల్‌జీన్ తప్పించుకుపోబోతాడు. కాని జనం పోగుబడతారు, పోలీసులు వస్తారు. జైలుకు లాగుకుపోతారు. దొంగిలించబోయిన ఒకరొట్టె కోసం రెండేళ్ళ కఠినశిక్షబడుతుంది అతనికి. ఆ రోజుల్లో శిక్ష అంటే నరకయాతనే. జైలులో పెట్టిన బాధలకుకాక అక్కపిల్లలు ఏమయ్యారో అన్న ఉద్రాకొద్దీ శిక్ష పూర్తికాకముందే అతను జైలుగోడదూకి పారిపోతాడు. కాని పోలీసులు వెంటాడి పట్టుకుంటారు. జైలునుంచి పారిపోబోయినందుకు అతనికి మరోరెండేళ్ళు శిక్ష-కఠినశిక్షే- పడుతుంది. మళ్లీ పూర్తికాకముందే పారిపోతాడు. మళ్లీ పట్టుకోవడం, మళ్లీ శిక్షపడడం ఇలా చాలాసార్లుజరిగి చివరికి అతను మొత్తం పందొమ్మిదేళ్ళకుపైగా శిక్ష అనుభవిస్తాడు. అతనిగుండె ఇప్పుడు రాయి అయిపోయిందనీ, మానవజాతి అంటేనే ద్వేషంఏర్పడిందనీ, మంచిఅనేది హతించిపోయిందనీ అంటే ఆశ్చర్యమేముంది? జైయిల్‌నుంచి బయటకివచ్చినా అతని బాధలు తీరలేదు. మరిన్నితయారైయాయి. ఒక పరమకిరాతకుడు జైలునుంచి విడుదల అయ్యాడని అతనికన్నా ముందరే వార్త ప్రయా

జించింది. జనం ఇళ్ళకుపరుగెత్తి తలుపులువేసేసుకుంటారు. ఊరు నిర్జనమయిపోయినట్లవుతుంది. అతనికి ఆకలివేస్తుంది. జైలుఅధికారులు తనకిచ్చిన డబ్బులుపెట్టి ఏమన్నా కొందామన్నా అతని మొగంమీద దుకాణం తలుపులు వేసేస్తారు. ఊళ్లో ఒక్క ఇంటినుంచే వీధిలోకి వెలుతురుపడుతూ ఉంటుంది. జీన్ వాల్‌జీన్ తిన్నగా ఆ యింటికివస్తాడు.

అది చర్చ్, మతగురువు ఇల్లూకూడా. మతగురువు చెల్లెలూ, పరిచారికా జీన్‌వాల్‌జీన్ రాకగురించి పుకార్లువిని భయభ్రాంతులై తలుపులు మూసివేద్దామంటారు. కాని మతగురువు "ఇది దేవునిగృహం, ఇది ఎల్లప్పుడూ, ఎల్లరికీ తెరిచి ఉంచవలసిందే" అంటాడు. అతను భోజనానికి కూర్చున్న సమయంలో జీన్‌వాల్‌జీన్ లోపలికివచ్చి ఆకలితోఉండడం వల్ల బెదిరింపుగా బల్లమీద గట్టిగా ఒక్కగుద్దు గుద్ది, హుంకరించి మతగురువుముందు ప్లేటులో ఒకటి లాగుకొని తినేస్తూ ఉంటాడు. "ఏమిటి నాయనా, అలా నిలబడి తింటున్నావేమిటి? కూర్చొని తాపీగాతిను, ఇది దేవుడి గృహమయ్యా, ఆకలిగొన్నవారికి ఆకలితీర్చకపోతే మరెందుకు? కూర్చో బాబూ, నీకు కావలసినదంతా తిను" అని పరిచారికని జీన్‌వాల్‌జీన్‌కికూడా వడ్డించమంటాడు ఆమె అలాంటి దుర్మార్గుడిని లోపలికి రానిచ్చినందుకు భయపడుతూ, విసుగుకుంటు వడ్డిస్తుంది. మతగురువు బలవంతంమీద జీన్‌వాల్‌జీన్ కూర్చొని తినడం సాగిస్తాడు. ఎప్పుడూ తిట్లకీ, తిరస్కారాలకీ, దారుణమైన శిక్షలకీ అలవాటైన అతనికి మతగురువు ప్రవర్తన విడ్డూరంగా అసహజంగా తోస్తుంది. మనస్సుకి కొంచెం చికాకు కలిగిస్తుంది కూడా. భోజనమయిన తరువాత మతగురువు అతనిని మెల్లగా మృదువుగా ప్రశ్నిస్తాడు: "నువ్వెవరవు నాయనా? ఏమిటి చేస్తున్నావు? ఎందుకిలా ప్రవర్తిస్తున్నావు?". కాని జీన్‌వాల్‌జీన్ మరొక హుంకరింపుతో జవాబు చెప్పడం ఇష్టంలేదని

సూచిస్తాడు "పోనీలే నాయనా, నువ్వు చెప్పదలుచుకోకపోతే నిన్ను బల వంతం చేయను. రాత్రిపడింది, ఇప్పుడెక్కడికీ పోలేవు, ఇక్కడే పడు కొని ఉదయమే నీ దారినా నువ్వు పోదువుగాని" అని అతనికి పడుకునే చోటు చూపిస్తాడు ఆయన. "పోలీసులకి చెప్పావో చంపేస్తాను" అని హుంకరించాడు అతను."నీకేమీ భయంలేదని చెప్పాను కదా, నాయనా, నిశ్చింతగా పడుకో"అని వెళ్ళిపోయాడు మతగురువు. కాని జీన్‌వాల్ జీన్‌కి సులువుగా నిద్రపట్టదు. ఒకటి, కటిక నేలమీద పడుకోడానికి అలవాటుపడిన అతనికి మంచం పరుపుమీద పడుకోవడం కొంచెం ఇబ్బందిగానే తోచింది. రెండవది, వినకూడని మాట వింటే మామూలు వాళ్ళు ఎలా అలజడి పొందుతారో అలా మత గురువు నడవడి అతనిలో అశాంతి రేపుతోంది. గది నలు దెసలాచూశాడు. అతని దృష్టి ముఖ్యంగా రెండు వెండి కొవ్వొత్తులసిమ్మె మీదపడింది చాలాసార్లు వాటికేసే చూశాడు. కొంతసేపటికిలేచి ఒకదాని కొవ్వువత్తులు ఆర్పివేసి, అది సంచిలో పడేసుకొని చడీచప్పుడు కాకుండా-అసలతనికి అడ్డంకి ఉంటేగదా - బయటికి నడిచాడు. ఊరి బయటికి కొంతదూరం నడచి ఒక చెట్టుకింద రాతిమీద తల పెట్టుకొని నిద్రపోయి తెల్లవారగానే నడకసాగించాడు. ఆ ప్రాంతంలో ఒక పోలీసు అధికారి ఉన్నాడు. నేరస్తుడు ఎప్పుడూ నేరస్తుడే అనిఅతని సిద్ధాంతం. జీన్‌వాల్‌జీన్ విడుదల అయ్యాడని తెలిసిన తరువాత అతనిమీద నిఘా వేశాడు. జీన్‌వాల్‌జీన్‌ని కనుగొని, ఆపి, తన పోలీసులచేత అతని సంచి వెతికిస్తే వెండి కొవ్వొత్తులసిమ్మె కనిపించింది. 'నేను చెప్పలేదూ!' అని సంతృప్తితో చిరునవ్వు నవ్వుకొని, అతనికి బేడిలు వేయించి, నేరానికి రుజువు సంపాదించడానికి తిన్నగా మతగురువు దగ్గరకి తీసుకువచ్చాడు. మతగురువుకి విషయం చెప్పాడు.మతగురువు"అదేమిటి

నాయనా, నీకవసరంవస్తే రెండు సిమ్మెలూ పట్టుకు వెళ్తావనే అక్కడ పెడితే ఒక్కటే పట్టుకువెళ్ళావేమిటి?" అని లోపలికివెళ్ళి ఆ రెండో సిమ్మెకూడా తెచ్చి జీన్‌వాల్‌జీన్‌కి ఇచ్చాడు. పోలీసు అధికారి వట్టి చేతులతో వెనక్కి వెళ్లిపోవలసి వచ్చింది. జీన్‌వాల్‌జీన్ మతగురువు కాళ్ళ మీద పడ్డాడు. ఎప్పుడో ఇగిరి పోయాయనుకున్న రెండు కన్నీటిబొట్లు అతని రాతిగుండెలోని చిన్న పగులుద్వారా బయటికి వచ్చి మతగురువు పాదాలు తడిపాయి. మతగురువు "పోయిరా నాయనా, రెండు సిమ్మెలూ అమ్మి ఆ సొమ్ముతో ఏ వ్యాపారమో చేబట్టి న్యాయమైన సంపాదన మీద బ్రతుకు. మంచితనం నిలుపుకో"అనిచెప్పి అతనిని సాగనంపాడు.

జీన్‌వాల్‌జీన్ ఆలాగే మరొకపట్టణంలో ఆ సిమ్మెలు అమ్మివేసి ఆ సొమ్ముతో గాజుసామాను కొని వీధుల్లో తిరిగి అమ్మాడు. కొంత లాభంవచ్చింది. దానితో మర్నాడు మరింత సామానుకొని అమ్మాడు. మరింత లాభం వచ్చింది. త్వరలో తనసొంత దుకాణం పెట్టాడు. అతను పట్టిందల్లా బంగారమయింది. చివరికి తనే ఆ గాజుసామాను తయారు చేసే ఫ్యాక్టరీ నెలకొల్పాడు. ధనవంతుడయ్యాడు. అక్కర ఉన్న వారెందరికో దానాలూ, సహాయాలు చేశారు. ఊరివారికెందరికో ఉపకారాలు చేశాడు. కొంతకాలానికి అతను ఆ ఊరికి మేయరుకూడా అయ్యాడు. అతను తన అక్కగారి పిల్లలకోసం అన్వేషిస్తూనే ఉంటాడు. చివరికి ఇద్దరిని కనుగొంటాడు. ఈలోగా పోలీసుఅధికారి మాత్రంఅతనిని వెన్నాడడం మానలేదు. తన సిద్ధాంతం రుజువవుతుందనే అతని ధీమా. అతను తనను వెంటాడుతున్నాడని జీన్‌వాల్‌జీన్ కూడా గమనించాడు. అయినా కలవరపడలేదు. అతనెన్నో అపూర్వ త్యాగాలు చేస్తాడు. అది కళ్లారాచూసి ఆ పోలీసు అధికారి 'ఇంత మంచివారిని వేధించానే! నాఅంత పాపరెవడు ఉంటాడు!' అని పశ్చాత్తాపానికి తట్టుకొలేక దగ్గర ఉన్న

నదిలోదూకి చచ్చిపోతాడు. తరువాత జీన్‌వాల్‌జీన్ తను తలచుకున్న కర్తవ్యం నెరవేర్చి ఆ ప్రయత్నంలోనే ఆసువులుబాస్తాడు.

పై ఉదాహరణలనిబట్టి మంచివాళ్ళు చెడ్డవాళ్ళుగా మారవచ్చనీ, చెడ్డవాళ్ళు మంచివాళ్ళుగా మారవచ్చనీ, చెడ్డవారుగా మారిన మంచివారు తిరిగి మంచివారుగా మారవచ్చనీ తెలుస్తోంది కదూ. అది వారు ఎదుర్కొనే పరిస్థితులబా, ఆ పరిస్థితులకి వారు ప్రతిస్పందించిన తీరూబట్టి ఉంటుంది. కాబట్టి ముందే మనుషుల్ని మంచివాళ్ళుగా, చెడ్డవాళ్ళుగా విభజించడం సరికాదు. ఎవరూ అలా పుట్టరు. మంచిగా వ్యవహరిస్తున్న వారూ, చెడ్డవారుగా వ్యవహరిస్తున్న వారూ (పైకి అలా కనిపిస్తున్న వారిని గురించి మనం మాట్లాడుకోవడం లేదు, పరీక్షిస్తే నిజం తెలిసిపోతుంది) అని మాత్రమే వర్గీకరించుకోవచ్చు. అప్పుడు వారు ఎందుకు అలా వ్యవహరిస్తున్నారో తెలుసుకోవడానికి అవకాశమేర్పడుతుంది. వారిలో మార్పురావడానికి కానీ, తేవడానికి కానీ అవకాశం ఇంకామిగిలి ఉన్నట్లుకూడా అవుతుంది.

ఇప్పుడు మనం మంచిగా ఎలా వ్యవహరించగలమో ఆలోచిద్దాం. మన (మానవ)జాతి మనుగడకితోడ్పడే ఆరోగ్యకరమైన సహజ ప్రవృత్తుల వికాసమే మంచితన మనుకున్నాం కదా. మన జ్ఞానం కేవలం మానవజాతి గురించేగాక సమస్తసృష్టిని గురించికూడా ఆలోచించే బాధ్యత మనమీద పెడుతుందనికూడా అనుకున్నాం ఇది మరొక మెట్టన్న మాట. ముందు మొదటిమెట్టు గురించే ఆలోచిద్దాం. మన(మానవ) జాతి మనుగడకి తోడ్పడే....అంటే మంచితనం అన్నది నలుగురితో వ్యవహారంమీదే ఆధారపడి ఉందనీ, కేవలం మన మొక్కరమే మంచివాళ్లు కావడమన్న ప్రశ్నేలేదని తెలుస్తుంది, 'నేను చాలా మంచివాడిని కాని చుట్టు వెధవలు ఒక్కడూ మంచివాడు కాకపోతే నేనేం చెయ్యను?'

అన్నది అసంగతం, ఆత్మవంచనా కూడా. మనం మంచిగా వ్యవహరిస్తున్నా చుట్టు వాళ్లు చెడ్డగా వ్యవహరిస్తున్నారని బాధపడవచ్చు, అది తప్పులేదు. అప్పుడు మనం ఏవిధంగా మంచిగా వ్యవహరిస్తున్నాం చుట్టు వాళ్లు ఎందుకలా వ్యవహరిస్తున్నారు అన్నది పరిశీలించి తెలుసుకోవచ్చు.

కాబట్టి మంచితనానికి మొట్టమొదటి లక్షణం చుట్టుఉన్నవారు మనలాంటివారే అని గుర్తించడం. పైన ఎన్ని వ్యత్యాసాలున్నా అడుగున మనమంతా మానవులమే అన్న గుర్తింపువస్తే మన దృక్పథమే వేరుగా ఉంటుంది. అప్పుడు ఘర్షణలు తగ్గడానికీ, స్నేహ సుహృద్భావాలు పెరడానికీ దారి ఏర్పడుతుంది.

ఒక ఉదాహరణ చెబుతాను. సుమారు ముప్పైఏళ్ళ క్రితం నేను మొదటిసారి బొంబాయి వెళ్తున్నాను. అప్పుడు హైదరాబాద్ నుంచి బొంబాయికి ఒక 'డైరెక్ట్‌బోగీ' మాత్రం ఉండేది. దానిని వాడీలో మద్రాసు బొంబాయి మెయిల్‌కు కలిపేవారు. ఆవేళ బోగీ నిండా ప్రయాణీకులు కిటకిటలాడిపోతున్నారు. కాలు కదపడానికి వీలులేక పోయింది. ఆఖరికి లఘుశంక తీర్చుకుందుకు వెళ్దామన్నా ఒక సాహస యాత్ర చేసినంతపని అయ్యేది. దానికితోడు ఉక్క. అంటే వాతావరణం సరిగా తయారైందన్నమాట. ఇక జగడాలకు ఆలస్యమేముంది? చిలికి చిలికి గాలివాన అయినట్లు మాటామాటా పెరిగి పీకలు నులిమేసు కుంటారనే దాకా వెళ్ళసాగింది. ఏమీ మాట్లాడకుండా ఉగ్గపెట్టుకు కూర్చునవాళ్ళం కూడా ఏమి దెబ్బలు తగులుతాయో అని భయపడ్డాం. కొన్ని గంటల తరువాత కేవలం అలసట మూలాన పోట్లాటలు ఆరి పోయిన సిసింద్రీల్లా అయ్యాయి. తెల్లవారింది మధ్యస్టేషన్‌లో కొంత మంది దిగిపోవడంవల్ల రద్దీ తగ్గింది. పైగా ప్రాతఃకాలపు చల్లనిగాలి

కూడా ప్రవేశించింది. ఒక స్టేషన్‌దగ్గర బండి ఆగింది. చిత్రమేమంటే రాత్రి ఒకరినొకరు చంపుకుంటారనుకున్న ఇద్దరిలో ఒకాయన రెండో ఆయన కుర్రవాడిని తనతోకూడా కాఫీకి తీసుకెళ్లాడు. అంటే పరిస్థితుల వల్లా, చిరాకువల్లా మానవత్వం మరచిపోవడం జరిగింది. ఆ భావం తిరిగిరాగానే సామరస్యం తిరిగినెలకొంది అన్న మాటే కదా.

మరొక కథ. చాలా కాలంక్రితం ఒక ఇంగ్లీషు చిత్రం చూశాను. ఒక మెక్సికన్ కుటుంబం ఉంటుంది. భూలోకస్వర్గం అనిపించే అమెరికా చేరుకోవాలని ప్రపంచంలో చాలా దేశాలప్రజలు ఉబలాట పడతారు. అలాగే ఆ కుటుంబంకూడా. గంపెడాశతో. కళ్ళనిండా కలలతో న్యూయార్క్ నగరం చేరుకుంటుంది. వారి ఆశ కూలిపోవడానికీ, కలలు చెదిరిపోవడానికీ ఎంతోకాలం పట్టదు. తండ్రికి కానీ, తల్లికి కానీ ఏపనీ దొరకదు. కుటుంబాన్ని గడపడమే దినదినగండంగా తయారవుతుంది. దానికి తోడు కొత్తగా వలస వచ్చినవారు కావడంమూలాన మరిన్ని సమస్యలు. వారికి పదమూడు పధ్నాలుగు ఏళ్ళ కుర్రవాడు ఒకడు ఉన్నాడు. అతని విధి బజారుకుపోయి కూరలూ, ఇతర వస్తువులూ తేవడం. అతను ఇంటికి వచ్చేదారిలో ఒక కుర్రగూండా ఉన్నాడు. వాడికో ముఠా ఉంది. ఆ గూండా, వాడి అనుచరులూ కూరలూ, సామాన్లూ తెస్తున్న కుర్రవాడిని చూడనట్లుగావచ్చి ఢీకొని, రోడ్డుమీద చెలా చెదురైపోయిన కూరగాయలూ, సామాన్లూ వెనకవాడు పరిగెత్తుతుంటే వినోదంగాచూసి బిగ్గరగా నవ్వుకుంటారు. ఇలా చాలాసార్లు జరుగుతుంది- ఒకరోజు ఆ కుర్రవాడు తెగింపుకువచ్చి 'ఈ వేళ వాడి అంతో నా అంతో చూడవలసిందే' అనుకుంటాడు. రోజూలాగే ముఠా నాయకుడు వచ్చి ఢీ కొంటాడు. వాడు వెంటనే గూండామీదికి ఎగిరి కొట్టడం మొదలుపెడతాడు. గూండా తిరిగి కొడతాడు. వాళ్ళు కొట్టు

కుంటుంటే పోలీస్ విసిల్ వినిపిస్తుంది. దానితో తక్కిన కుర్రవాళ్ళు అక్కడినుంచి జారుకుంటారు. కాని వాళ్ళిద్దరూ కిందపడుతూ, మీద పడుతూ కొట్టుకుంటునే ఉంటారు. పోలీస్ కానిస్టేబుల్ దగ్గరకువచ్చి వేస్తాడు. దానితో కొట్టుకుంటున్న ఇద్దరూ కొట్లాటమాని పరుగెత్తుతారు. మరో దారిలేక ఇద్దరూ ఒకే సందులోకి పరిగెత్తుతారు. పోలీసు ఆ సందులోకి వచ్చివేస్తాడు. ఇద్దరూ మరోసందులోకి దూరుతారు. పోలీసు వెంటాడుతూనే ఉంటాడు. ఈలోగా వర్షంవస్తుంది. ఆ వర్షంలో ఇద్దరూ తడుస్తూ, సందులూ గొందులగుండా పరిగెత్తుతూ చివరికి ఒక ఆవరణ గోడఎక్కి అవతలికి దూకి అక్కడఉన్న పెద్దఇసుకగుట్ట అవలివైపుకు పరిగెత్తి, అక్కడ ఆయాసంతో పగరుస్తూ కూలబడిపో తారు. పోలీసు అక్కడికి రాలేదు. కొంత సేపటికి ఆ కుర్రగూండా తామిద్దరూ ఒకవైపుకు పరుగెత్తి అలా తప్పించుకోవలసిరావడం చోద్యంగా తోచిందికాబోలు, ఆ కుర్రవాడికేసి చూసి నవ్వుతాడు. ఆ కుర్రవాడుకూడా కొంచెం సంశయంతోనే నవ్వుతాడు. ఆ గూండాలేచి వచ్చి ఆ కుర్రవాడివైపు చేయిచాపుతాడు. ఆ కుర్రవాడు అతని చేయి అందుకుంటాడు. అంతే, ఇద్దరూ స్నేహితులైపోతారు. తరువాత ఆ కుర్రవాడి ఆక్కని మరెవరో అల్లరిచేయబోతే అంతకు ముందు గూండాగా వ్యవహరించినవాడే తన కొత్త స్నేహితుడికి సాయపడతాడు. ఎంతో సాహసం కూడా ప్రదర్శిస్తాడు.

అంటే మనం పైన అనుకున్నట్లు మనతోడివాడు కూడా మన లాంటివాడే అని మరచిపోయినప్పుడు అతను శత్రువులాగానే తోచ వచ్చు, కాని ఆ గుర్తింపు వచ్చినప్పుడు సామరస్యం ఏర్పడే అవకాశ ముందన్నమాట.

ఇలా గుర్తింపుకు అడ్డుపడే వాటిలో మొట్టమొదటిది ఇంగ్లీషులో వాడే 'ప్రిజిడిస్ ' దానికి సరియైన తెలుగుమాట వాడుకలోకి వచ్చినట్లు తోచదు. పరిశీలన లేకుండా ఏర్పరచుకునే దురభిప్రాయ మనవచ్చు. ఫలానా కులంవాళ్ళు అలా వ్యవహరిస్తారనో, ఆ యింటి వాళ్ళంతా దుర్మార్గులుగా కనిపిస్తున్నారనో ముందే ఊహించుకొని దానిప్రకారం వారిపట్ల మనం వ్యవహరించడం ఎన్నో సమస్యలకీ, సంఘర్షణలుకీ, ఒక్కొక్కప్పుడు దారుణాలకి దారితీస్తుంది. ఇటీవల ఢిల్లీలో శ్రీమతి ఇందిరాగాంధీ హత్య తరువాత జరిగిన సిఖ్ఖుల ఊచకోత చూడండి· సుమారు 2 వేలకుపైగా అమాయకులు-కదలలేని ముసలివాళ్ళూ పిల్లలూ కూడా-దారుణమైన చావులకి గురయ్యారు. ఆ దృశ్యాలు స్మరిస్తే ఏమాత్రం మానవత్వం ఉన్నవాడికైనా గుండె తరుక్కుపోతుంది. డెభ్భైఏళ్ళ ముసలిమనిషి మెడలో కాలుతున్న మోటారుటైరువేసి అతనిని నాట్యం చేయమని బెదిరించి అతను యమయాతనకి గురిఅవుతూ కాలి చచ్చిపోతుంటే నవ్వుతూ కేరింతలు కొట్టిన సంఘటన లున్నాయని పత్రికల్లో చదివాం. మరొక సంఘటన: ఢిల్లీలోనే నవంబరు(84)ఒకటవ తేది ఒకామె-ఆమె కమ్యూనిస్టు, హిందూత్వం అంటే ఏమాత్రం సరి పడనిది, అయినా హిందువుగా జన్మించింది కాబట్టి నిర్భయంగానే-తన బిడ్డను తీసుకొని ఆటోలో ఎక్కడికో వెళ్తోందిట. మధ్యలో ఒక పదేళ్ళ సిఖ్ఖు కుర్రవాడు దుండగుల బారినుంచి తప్పించుకుందుకు ఆయాసపడుతూ ఆ ఆటోవెనుక పరిగెత్తసాగాడట. అదిచూసి ఆమె ఆటో ఆపించి ఆ కుర్రవాడిని ఎక్కించుకొని ఆటోను ముందుకు పొమ్మందిట-కాని దౌర్జన్యం మూకలువచ్చి చుట్టుముట్టేశారుట. ఆటో డ్రైవరు నెత్తిమీద కర్రతో ఒకటికొట్టి ఆటో ఆపివేశారట తరువాత లోపల స్త్రీప్రక్కన కూర్చున్న సిఖ్ఖు కుర్రవాడిని ఇవతలికి ఈడ్చి,

ఆమె కళ్ళముందే దారుణంగా కొట్టి చంపేశారట. ఆ స్త్రీ తన ఆవేదన ఒక పత్రికా విలేఖరికి చెప్పుకొంది. ఆదృశ్యం తలచుకుంటే మనం కూడా బాధపడతాం. అదిచాలదు, మీ అబ్బాయో, తమ్ముడో పదేళ్ళవాడు ఆ సిక్కుబాలుని పరిస్థితిలో చిక్కుకుంటే ఎలా ఉంటుందో మనో నేత్రం ముందు ఆ దృశ్యం పూర్తిగా ఊహించుకోండి ఎంత చలించి పోతారో. ఇతియోపియా (పూర్వపు అబిసీనియా)లో కొన్ని లక్షలమంది కరువు రక్కసినోట చిక్కుకున్నారని చదివినా, ఆ దారుణదృశ్యాలు చూసినా లేక మరో భూకంపమో, వరదో, అగ్నిప్రమాదమో ఏదో జరిగి కొన్ని వేలమంది చచ్చిపోయినా వాటిని వార్తలుగా తీసుకుంటాం. చిత్రాలేమైనా పత్రికల్లో పడితే చోద్యంగా చూస్తాం, పాపం అంటాం ఒకసారి. అంతేకాదు రోజూ ఎన్ని ప్రమాదాల గురించి వింటాం! అయినా వాటిని మనమెంతో తేలికగా తీసుకుంటాం. కాని బడికివెళ్ళిన తమ పిల్లవాడు ఒక గంట ఆలస్యంగావస్తే తల్లిదండ్రులు ఎంత ఆందో ళన పడిపోతారో చూడండి. ఆయితే లోకంలో జరిగే ప్రమాదాలూ, దారుణాల్లో మనమో, మనవాళ్ళమో ఉన్నట్లుగా ఊహించుకొని బాధ పడమని మీకు సలహా చెప్పడంలేదు! అలా అయితే మనం బ్రతుకు సాగించడం కష్టం. లోకంలో ప్రతి నిమిషం ఎన్నిలక్షలమందో చచ్చి పోతూ ఉంటారు. వాందరికోసం శోకిస్తూ కూర్చుంటే మనజీవితంకాదు కదా, మరో వెయ్యి జీవితాలుకూడా చాలవు. అలాగని మన ఎదుకలో దారుణం జరిగినా ప్రతిస్పందించకపోతే మానవత్వం కోల్పోతాం. ఇక్కడ మనం ప్రధానంగా మనచర్యలూ, మన నడవడీ సంబంధంగా ఆలోచిస్తున్నాం. మనం ఎవరితో వ్యవహరించినా వారినిగురించి ఏమీ తెలుసుకోకుండా, లేక సరిగా తెలుసుకోకుండా ఒక అభిప్రాయం ఏర్ప రచుకొని దానినిబట్టే పోవడం తగదన్నదే మనం గుర్తించుకోవలసింది.

రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'కార్నర్ సీట్' మీరు చదివే ఉంటారు. అందులో ఒకడు ముడికిపట్టిన ఆకుపచ్చకోటు తొడుగుకొని రైలుపెట్టెలో ఒక మూలచేరి తన ప్రపంచంలో మునిగి ఉంటాడు. కథను చెప్పేపాత్ర అతను మూలసీటుకొట్టేశాడేఅన్న గుర్రుతోబాటు ఆతని వాలకాన్నిబట్టి సలుగురిలో కలిసిఉండని వ్యక్తిగానూ, దుష్టబుద్ధి కల వ్యక్తిగానూ ఊహించుకొని ఏమేమో తలపోస్తాడు. కొద్దిసేపు తరువాత రైలుబండి ఒకస్టేషనులో ఆగుతుంది. మూలసీటు ఆక్రమించుకున్నవాడు లేచివెళ్తాడు. వదిలాడు శనిగ్రహం అనుకుంటాడు కథకుడు (పాత్ర). రైలు బయలుదేరి అంతలోనే ఆగిపోతుంది. జనం పరిగెత్తుతారు. ఎవరో రైలుక్రిందపడ్డారని తెలుస్తుంది. చివరికి ఆ వద్ద వాడు అంతకుముందు మూలసీటు ఆక్రమించుకు కూర్చున్నవాడే అని తేలుతుంది. ఆత్మహత్య చేసుకున్నాడన్నమాట. కథకుడు (పాత్ర) ఊహించినదంతా నిరాధారమని రుజువవుతుంది. ఆ అభాగ్యుడు తన సమస్యలతోనే పోరాడలేక ప్రాణం తీసుకున్నాడు కదా.

ఈ రచయితదే ఒక చిన్న అనుభవం. ఒక సహాధ్యాపకుడు ఉన్నాడు. అతనితో అప్పుడప్పుడు విభాగంలో కలుసుకోవడం, ఒహో అంటే ఒహో అనుకోవడం తప్ప పెద్దగా సంబంధముండేది కాదు. సహజంగా అతనిపట్ల స్పష్టంగా అమిత్రపైఖరి కాదు కాని ఎటువంటి సద్భావమూ లేకపోయింది. కాని ఒకసారి పరీక్షాపత్రాలుదిద్దే సందర్భంలో ఒక కేంద్రంలో ఇద్దరం పదిహేనురోజులు పక్క పక్కనే కూర్చొని పని చేయవలసి వచ్చింది. సహజంగా మాట్లాడుకోవడం తప్పదు కదా. ఎంతో మంచితనం, అవగాహన ఉన్నవాడని తేలి అతని పట్ల ఎంతో సద్భావం కలిగింది. మన ఇరుగు పొరుగుల్లో కొందరితో ఏవిధమైన సంపర్కమూ ఉండదు. ఏదైనా ప్రత్యేక సందర్భం పురస్క

రించుకొని వారితో పరిచయం ఏర్పడితే వారు ఎంతో మంచివారని మనకి బోధపడుతుంది. ఒక్కొక్కప్పుడు అలాంటి యాదృచ్ఛిక పరిచయాలే చిర స్నేహాల క్రింద మారుతాయి. అది అలా ఉంచండి. కొందరు మాట పెళుసు, వ్యవహారం పెడసరంగానూ కనిపిస్తారు. కాని అది వారి నైజాన్ని ప్రతిఫలించక పోవచ్చు. కొందరు ఎప్పుడూ తిట్లకీ, శాపనార్థలకీ గురి అయి, ప్రేమాసానుభూతులకు కరువై రక్షక కవచంలాంటి పేచీకోరు స్వభావం ధరిస్తారు. కొద్దిపాటి ఓరిమీ, కొంచెం సానుభూతితో వ్యవహరిస్తేచాలు వారు కవచం తొలగించుకొని గుండెను తెరచిపెడ్తారు. కొబ్బరికాయ కానీ, పనసకాయ కానీ, అనాసపండు కానీ వారిని వర్ణించడానికి తోడ్పడవచ్చు. ఇది అందరి విషయంలో ఒకేలా ఉంటుందని చెప్పలేం, కొందరిలో లోనా పైనా నిలువెల్లా విషమే ఉంటుంది. పైన కనిపించేది (సముద్రంలో తేలే) మంచుకొండ కొనలా లోపల ఉన్న పరమ దుష్టత్వానికి ఒక చిన్న సూచనమాత్రమే కావచ్చు. మరి కొందరు గోముఖ వ్యాఘ్రం, పయోముఖ విషకుంభం, తేనేపూసిన కత్తి అంటామే అలాంటి వారూ ఉంటారు. కాబట్టి మంచివారిని చెడ్డవారిగా ఊహించుకోవడం ఎంత తెలివితక్కువో, హానికరమో, చెడ్డవారిని మంచివారని ఊహించుకోవడం కూడా అపాయకరమే. అవతలి వారిని గురించి తెలుసుకోకుండానే కేవలం మనం ఊహించుకున్న అభిప్రాయం ఆధారంగా వ్యవహరించటం అవివేకం అని ఒప్పుకునట్లే కదా.

రక్షక కవచాలు ధరించే వారందరినీ వాటిని తొలగించుకునేటట్లు, గుల్లలోని పురుగులా ముడుచుకొని ఉండేవారిని మాటాడించేటట్లు చేయడానికి మీకు సమయం ఉండకపోవచ్చు. నిజమే. కాని వారిని గురించి తప్పుడు అభిప్రాయాలు ఏర్పరచుకోవద్దనే కదా మన మనుకున్నది. అలా మనకి సంబంధం అంతగాలేనివారి విషయంలోకూడా. ఒకముందు

అధ్యాయంలో అనుకున్నట్లే తరచు కనిపిస్తుంటే కనక ఒక చిరుపలక రింపు చిలకరిస్తుండడం మంచిది, ఎప్పుడైనా అక్కరకు రావచ్చు.

కాబట్టి ఇతరులతో (ఇతరులు అంటే పరాయి వారే అని కాదు, తను కానివారు ఇతరులే, తన తమ్ముడే కావచ్చు, తండ్రే కావచ్చు) వ్యవహరించేటప్పుడు వారుకూడా మనలాంటి వారే, వారికీ మనలాగే పరి స్థితులూ, కారణాలూ, అభిప్రాయాలూ, ఊహలూ, కోరికలూ ఉండ వచ్చని గుర్తించడం చాలా చాలా అవసరం.

ముఖ్యంగా మనకి కోపం వచ్చినప్పుడు ఈ జాగ్రత్త మరీ అవ సరం. ఎవరో మనకి చేస్తానని చేయలేదు, లేకపోతే వస్తానన్న సమయా నికి రాలేదు, లేదా మనకి వ్యతిరేకంచేసి ఉండవచ్చు, అలాగని వారు కనిపించీ కనిపించగానే వారిమీద విరుచుకుపడడం, చెడామడా తిట్టే యడం అవివేకానికి పరాకాష్ఠ. ఒక ఉదాహరణ చెపుతాను.

ఒక ఆఫీసరు చండశాసనుడు. తన క్రింది గుమస్తాలను మెడ తిప్పుకోనియడు. ఆలస్యానికి అగ్గిబరాటా అయిపోతాడు, చస్తే సెలవు ఇవ్వడు. ఒకరోజు ఒక గుమాస్తా ఆలస్యంగా వచ్చాడు. ఇంకేముంది, చండశాసనుడు నిప్పులవర్షం కురిపించాడు. ఇంగ్లీషూ, తెలుగూ కలిపి అరచి అరచి "ఇంతకీ ఆలస్యం ఎందుకయిందో చెప్పలేదేం" అని ఉరి మాడు. అసలు అందుకు అవకాశమిస్తేగా!

"తమరు సెలవివ్వరని తెలిసి ఎలాగో అలాగా కార్యక్రమం ముగించుకొని వచ్చేసరికి కొంచెం ఆలస్యమయిందండీ" అన్నాడు బక్కమేక కళ్ళ నీళ్ళ పర్యంతమై

"ఏమిటంత అర్జంటు కార్యక్రమం?"

"మా రెండో పిల్లవాడు - చంటిబిడ్డ - ఈ తెల్లవారు జామున జారిపోయాడు, తెల్లవారిన తరువాత శ్మశానానికి తీసుకువెళ్ళి పూడ్చి పెట్టి, స్నానంచేసి వచ్చేటప్పటికి కొంచెం ఆలస్యమయిందండీ"

ఒకొక్కొక్కప్పుడు మనం ఒకరిమీద మండిపడతాం. తీరా తప్పు చేసినది మరొకరని తేలుతుంది. అప్పుడు వెర్రిమొగం వేయవలసి వస్తుంది.వెర్రిమొగంవేయవలసి వచ్చినందుకు మళ్ళీకోపం.అలాంటప్పుడు కొందరు వంటింట్లో తన పని తాను చూసుకుంటున్న శ్రీమతిని పిలిచి ఏదో వంకని ఆమెమీద తమ మంట వెడలగక్కుతారు.ఎందుకీఅవస్థలు? చాలామంది అంటూ ఉంటారు చూడండి.'నేను కోపంవస్తే మనిషినిగాను అని.కోపంవస్తేఏమవుతుందో వారు నిజమే చెప్పారనాలి. అయితే అసలు కోపమేతప్పంటారా?కాని మనిషన్నాక కోపంరాకుండా ఎలా ఉంటుంది? అది సహజప్రవృత్తి కదా? అనవచ్చు. నిజమే, మనిషన్నతరువాత కోపం రావడం సహజమే,కాని ఆ కోపంలో మనిషిగా కాకుండాపోకూడదు కదా. నిజానికి కోపం వచ్చినప్పుడే తాను మనిషిని అని గుర్తుంచుకొని వ్యవహరించాలి. అంటే వివేకం కోల్పోకుండా చూసుకోవాలి. కోపం బలీయమైన అశ్వం లాంటిది. వివేకం కళ్ళెం లాంటిది. రౌతు బలహీనుడైతే గుర్రం అతనిని కిందపడేసి వెనక కాళ్ళతో తన్ని ఎటో పారిపోతుంది. వేరు మాటల్లో చెప్పాలంటే మన కోపతాపాలకు మనం బానిసలం కాకూడదు. వాటిని మన నెత్తిమీదసవారీ చేయనీయకూడదు. మనం యజమానులుగానే ఉండి వాటిని అదుపులో పెట్టుకోవాలి. అప్పుడు కోపం కూడా లొంగదీసుకున్న గుర్రంలా మనకి ఉపయోగకారి కూడా అవుతుంది.

అంటే ఏమి చేయాలి? కోపం రాగానే పది అంకెలు లెక్కపెట్టమని ఒకసలహా చెబుతారు. ఆసలహా చాలదు. కోపం వస్తూండగానే

మనం చకచకా ఆలోచించాలి.మనకు ఎవరుకోపం కలిగించారో ఏవిధంగా కలిగించారోముందు స్పష్టంగాగుర్తించాలి. తరువాత మనకోపం పూర్తిగా సహేతుకమైనదేనా అని ఆలోచించాలి.ముందు అవతలి పక్షం చెప్పేది విన్నామా చూసుకోవాలి. లేకపోతే అవతలి పక్షం వినితీరాలి. కనీసం ఇంతచేసినా మంచిదే. కొన్ని పొరబాట్లూ, ఇరకాటాల నుంచి తప్పించుకోగలుగుతాం. కాని మన మంచితనం సంపూర్ణం కావాలంటే, అవతలి పక్షం ఓపికగా వినడమేకాదు-విన్నా కూడా మనకోపం చల్లారకపోవచ్చు, పైగా మరింత ఎగదోసినట్లవవచ్చు - అవతలివాడి దృష్టితో కూడా చూడాలి. ఆమనిషి ఉన్న పరిస్థితుల్లో మనమే ఉంటే అలాగే వ్యవహరించే వాళ్ళమేమో ఆలోచించాలి. సానుభూతితోకూడా ఆలోచించాలి. మన వ్యక్తిత్వ ఔన్నత్యం కారణంగా అలాంటి పరిస్థితుల్లో మనం అతనిలా చేయము అనుకోవచ్చు. అతడు దుర్మార్గుడుకాక బలహీనుడేమో. పరిస్థితులకు వివశుడయ్యాడేమో. కొంచెం సానుభూతీ, కొంచెం మానవత్వం అదే కావలసది. అప్పుడు మనమీద మనం సంపూర్ణ అధికారం కలిగి ఉన్నామన్నమాటే. అదే వ్యక్తిత్వ ఔన్నత్యానికి సంకేతం.

పైవిధంగా చేయటమంటే మనకోపం తక్షణం వెళ్ళగక్కకుండా వాయిదా వేసుకోవటమే అవుతుంది. వెనక జర్మనీలో ఎవడైనా సిపాయి ఫిర్యాదు చేయదలిస్తే ముందు అతను ఒకరాత్రి నిర్బంధంలో గడపవలసివచ్చేది. అప్పుడే అతని ఫిర్యాదు వినేవారట. సాధారణంగా పన్నెండుగంటలు వ్యవధిఇస్తే వేడి చల్లారుతుంది. ఆలోచనకు అవకాశం కలుగుతుంది. ఆలోచించుకొన్న తరువాత ఫిర్యాదు అనవసరం అనిపిస్తుంది. అప్పటికీ ఉందంటే బలమైన కారణం ఉన్నట్లే అనుకునేవారన్నమాట. అందువల్ల కోపం వచ్చినా దానిని వాయిదా వేయడంవల్ల హాని ఏమీలేదు. డేల్ కార్నెగీ తన పుస్తకంలో అబ్రహాం లింకన్‌ని

గురించి ఒక ఉదంతం చెపుతాడు. అంతర్యుద్ధ సమయంలో యూనియన్ సేనానాయకుడు ఒక తప్పుచేస్తాడు. అధ్యక్షుని సూచనలకు పూర్తిగా విరుద్ధంగా చేస్తాడు. తిరుగుబాటు సైన్యాల్ని ఎదిరించవలసిన చోట ఎదిరించక తేలికగా వదిలివేస్తాడు. దానివల్ల ఆ సైన్యాలు తప్పించుకుపోతాయి. ఫలితంగా యుద్ధం మరికొంత కాలం కొనసాగడం, మరిన్ని చావులూ, మరిన్ని నష్టాలూ సిద్ధిస్తాయి. ఏ కోణంనుంచి చూసినా ఆ సైన్యాధిపతి చర్య తప్పే. అందువల్ల దేశాధ్యక్షుడిగా అతనిని కఠినంగా మందలించవలసి ఉంది. లింకన్ ఆ సేనానాయకుడిని ఉద్దేశించి ఒక ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరంలోకూడా వ్యక్తిని సూటిగా నిందించలేదు ఆశించిన విధంగా జరగనందుకు తన బాధ వ్యక్తం చేస్తూ ఆ సేనాని (మీడ్) చర్య ఫలితమేమైందో తెలియజేస్తాడు. కాని ఆ ఉత్తరం జనరల్ మీడ్‌కి వెళ్ళనేలేదు. అధ్యక్షుడు లింకన్ పునరాలోచించుకున్నాడన్నమాట. ఆ ఉత్తరంవల్ల ఏమిటి ప్రయోజనం సిద్ధించేది? జరిగిపోయిందేదో జరిగిపోయింది దానినిప్పుడు సరిదిద్దడం సాధ్యంకాదు. పైగా ఉత్తరం చదివిన ఆ సేనాని తనని తాను ఏదోవిధంగా సమర్థించుకుంటాడు. పైపెచ్చు లింకన్‌మీద ద్వేషం వహిస్తాడు. యుద్ధంలో ఆ ఘట్టంలో అతనిని తొలగించడం మరింత నష్టదాయకం. అందువల్ల అతనికి కోపం కలిగించి తిరస్కార వైఖరి రెచ్చగొట్టే కన్నా ఊరుకోవడమే శ్రేయస్కరం. అతని తప్పు అతనికే తెలిసివస్తుంది అని లింకన్ అనుకున్నాడన్నమాట. ఆయన వివిధ వ్యక్తులతో వ్యవహరించిన తీరువల్లే అంత గొప్పవాడుగా పేరుపొందాడు.

కాబట్టి కోపం రాగానే పేలిపోకూడదు. ముందు ఓరిమితో అవతలిపక్షం తెలుసుకోవాలి. సానుభూతితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. వీలైతే అసలు కోప ప్రకటనే వాయిదావేయడం

మరీ మంచిది. (ఇలాంటి ఘట్టాలు మీ దినచర్యలో తప్పక రాసుకోండి) మరి అవతలివాడు తప్పుచేస్తే ఊరుకోవలసిందేనా అనవచ్చు. దాని విష యం తరువాత ఆలోచిద్దాం. కాని కోపం విషయంలో పై జాగ్రత్తలు ఎంతైనా అవసరమని మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకోండి (అవసరమైతే దిన చర్య పుస్తకంతో ఒకకార్డు పెట్టుకున్నారే దానిమీద ఈ సూచన ప్రము ఖంగా రాసుకోండి)

ఇలాగే ఆగ్రహామంతటివి కావు కాని, ఆగ్రహానికి పిల్లవేర్లు అన వచ్చు, పెరగనిస్తే అవే వాగులయి ఊరకలువేసి ఉత్పాతం తెచ్చిపెడ తాయి. మనని ఎవరో ఏదో అంటారు, అది మనకి చుర్రున తగులు తుంది. లేదా వారి ప్రశ్న ఏదో మనకి పెద్ద చిరాకు కలిగిస్తుంది. అంతే వెంటనే వాడిగా, వేడిగా జవాబిస్తాం. అవతలివాడు వెంటనే పొరబాటు గుర్తించి మనని సముదాయించడానికి ప్రయత్నిస్తే సరే సరి, మనం వేడిగా జవాబివ్వగానే అవతలివాడూ మరింత వేడిగా ఎదుర్కొంటే (సాధారణంగా అదే జరుగుతుంది) ఇంకేం, మంట అంటుకుంటుంది. అటువంటి న ఘటనలవల్ల మనస్సులో గాయా లేర్పడడం, కొన్ని మాననివిగా తయారవడం, వాతావరణం విషపూరితం కావడంతప్ప మరో ప్రయోజనం లేదు. మనం వెంటనే వేడిగా ప్రతిస్పందించకపోతే నష్టమేమిటి? మనదే దోషమూ లేనప్పుడు ఎందుకంత కంగారు పడాలి? మనం నిర్భయంగా ఉండవచ్చునే. మనం నిదానంతో వ్యవహరిస్తే అవతలివాడి బాణం మనల్ని గుచ్చుకోలేదు, కవచానికి తగిలి వమ్మైపో యినట్లయింది అని సూచించామన్నమాట. మనం వెంటనే ప్రతిస్పం దించడంవల్ల మనం కొంతబలహీనత ప్రదర్శించినట్లవుతుంది. కొంద రుంటారు చూడండి. ఎవరెప్పుడు ఏమంటారా, ఎంత తీక్షణంగా జవా బివ్వాలా అని ఎదురు చూస్తూ ఉంటారు. ఇంగ్లీషులో వారిని 'విత్ ఏ

చిప్ ఆన్ ద షోల్డర్' వ్యక్తులంటారు. వాళ్ళెప్పుడూ ముళ్ళ కంపలా దరిజేరబోయిన వారిని పొడవబోతూ ఉంటారన్నమాట. వారి స్వభావం వల్ల అవతలివాడు మామూలుగా అన్న దానికే ఇట్టే తప్పు అర్థం తీసుకొని ఏదో పేలుతారు. వారికి తమమీదే తమకే విశ్వాసం లేదన్నమాట. అందుకే వారలా పేలుతారు. వారిది సున్నితత్వం కాదు, బలహీనత. వారిని గొంగళీ పురుగులనవచ్చు. వారు ఆ తత్త్వాన్ని వదులుకుంటే కాని వారు పూర్ణమైన వ్యక్తులు కాలేరు. వారిని అలా వదిలివేయండి. వారికి మిత్రులంటు ఉండడంకష్టం, వారిస్వభావం కారణంగా ఎప్పుడో అప్పుడు ప్రతిఒక్కరితో ఘర్షణతెచ్చుకొని సర్వత్రావిరోధభావం సంపాదించుకుంటారు. మనం గుర్తించుకోవలసింది వెంటనే వేడిగా ప్రతిస్పందించకపోవడం. పడ్డవాడు చెడ్డవాడు కాదని ఒక సామెత ఉందికూడా. పైనే అన్నట్లు మనకి ఆత్మవిశ్వాసంఉంటే చిన్నచిన్న పోట్లు, దెబ్బలూ పట్టించుకోకపోవడమే సరియైన విధానం. దానివల్లే మనం తేలికైనవ్యక్తులం, బలహీనమైన వ్యక్తులం కామని రుజువుపరచిన వారమవుతాం. అంతగా జవాబివ్వవలసివస్తే నిదానంగా, హుందాగానే జవాబివ్వవచ్చు. దారిలో వెళ్తున్నామనుకోండి - ఎక్కడో చిన్నముల్లు గుచ్చుకుంది అనుకోండి. దానిని తీసి అవతలపడేసి అంతటితో దానిమాట మరచిపోతాం. అంతేకాని చాణక్యుడిలా అక్కడే ఉండిపోయి మంటజేసి అందులో ఆ ముల్లునువేసి కాల్చి ఆభస్మాన్ని నీళ్ళల్లో కలిపి తాగడానికి పూనుకోం కదా. అలా అయితే మన జీవితం అయినట్లే. (చాణక్యుడి మహా ప్రతిభనీ, దీక్షనీ సూచించడానికి మాత్రమే ఆ కథ ప్రచారమైందనుకుంటాను.)

అంతేకాదు ఎవరో యాదాలాపంగా ఏదో అంటే అది తీవ్రంగా తీసుకొని జవాబివ్వడంద్వారా మనం కొన్ని అనర్థాలు తెచ్చుకుంటాం.

లోకంలో అందరూ మనని గురించే ఆలోచిస్తూ కూర్చోరు. వారు ఏదో సందర్భంలో ఏదో అంటారు. అంతటితో మరచిపోతారు. కాని మనం దానిపై రాద్ధాంతం చేయడంవల్ల బలవంతంగా వారి దృష్టి మనమీదకి లాగుకొని మన నడవడిని వారిముందు తెరచిపెట్టినట్లవుతుంది. లేని పోనివి కూడా బయటపడే అవకాశం ఏర్పడుతుంది. ప్రపంచకథకుల్లో అగ్రశ్రేణివారిలో ఒకడుగా భావించబడే రష్యన్ కథారచయిత అంటన్ చెఖోవ్ 'ముద్దు' అని ఒకకథ రాశాడు. ఒక ఇంట్లో విందుజరుగుతుంది. అతిథులందరూవచ్చి కూర్చున్నారు. కబుర్లు చెప్పుకుంటున్నారు. విందు ప్రారంభం కావలసి ఉంది. యజమానో, ఆయన మిత్రుడో నాకు జ్ఞాపకంలేదు, వంట పూర్తయిందో, లేదో తెలుసుకోవడానికి వంట గదిలోకి వెళ్తాడు. వంట పదార్థాలు అన్నీ సిద్ధంగానే ఉన్నాయి. ఆయన వాసనలు ఆఘ్రాణిస్తూ ముందుకు కదులుతాడు. ఒక పెద్ద పాత్రలో నుంచి మరీ కమ్మగా వాసన రాగా అనుకోకుండా నోరూరుస్తాడు. అది విచిత్రంగా ముద్దుపెట్టుకుంటే ఎలాచప్పుడవుతుందో అలాగే అయింది. దానితో ఆయన తను వంటగత్తెని ముద్దుపెట్టుకున్నానని అతిథులను కుంటారేమో అని సంశయపడ్డాడు. అందువల్ల సమయం చూసుకొని ఒక్కొక్క అతిథినే సంభాషణలోకి లాగి కొంచెం పక్కకి తీసుకువెళ్లి "మీకు వంటింట్లోనుంచి ముద్దుపెట్టుకున్న చప్పుడు వినిపించింది కదూ? అది ముద్దుపెట్టుకోవడం కాదు. నేనే ఒక పదార్థం ఎలా ఉందో ఆఘ్రాణిస్తుంటే అలా శబ్దం అయింది" అని వివరిస్తాడు. మర్నాడు ఊరంతా ఫలానా పెద్దమనిషి తనవంటగత్తెని ముద్దు పెట్టుకున్నాడని చెప్పకో సాగారంటే ఆశ్చర్యం ఏముంది?

అందువల్ల ప్రతి చిన్న విషయాన్నీ పట్టించుకోకండి. తడుముకోకుండా వేడిగా, వాడిగా జవాబివ్వడం కట్టిపెట్టివేయండి. మీకు నిజంగా

పోయేదేమీ లేదు - మీ అహానికి కొంచెం అసంతృప్తి కలుగుతుంది తప్ప.

పై కోవకు చెందినవే వినుగునుంచి వచ్చేమాటలు. ఇందులో మరొకరు ఏదో అనడం కానీ, ప్రశ్నతో పొడవడంగానీ అన్నది లేదు. మనమే మన చిరాకులో తీవ్రంగా మాట్లాడడం, నిరపాయకరమైన మాటలను గూడా తప్పుగా అర్థం చేసుకొని మండిపడడం జరుగుతుంది. తరువాత 'ఏదో చిరాకులో అనేశాను' అని మన మనస్థితి (మూడ్) మీద నెపంవేసి తప్పించుకోజూస్తాం. కాని చిరాకు సమర్థన కానేరదు. మీరెప్పుడైనా పరీక్షచేసి చూడండి. నూటికి కనీసం 90 సార్లు (మనల్ని బాగా అర్థంచేసుకున్నవారో, మనమంటే అమితప్రేమ ఉన్నవారో, మన అధికారానికి జడిసినవారో అయితే తప్ప) మనం చికాకులో ఒకమాట అంటే అవతలివారు రెట్టింపు చికాకుతో రెండుమాటలు అంటిస్తారు. కాబట్టి ఒకటే ఉపాయం: చిరాకుగా ఉన్నప్పుడు మౌనవ్రతం పాటించడమే.

ఇక కొన్ని వర్జనీయమైన లక్షణాల గురించి మాట్లాడుకుందాం.

<u>దెప్పుళ్ళు</u> : ఇవి సాధారణంగా తక్కువ సంస్కారాన్ని సూచిస్తాయి. కాని అన్ని దెప్పుళ్ళనీ అలా తీసివేయలేం. హాస్యానికి దెప్పుతారు కొందరు. ఏమాత్రం చెడుభావం లేకుండా అవతలివారి పట్ల పూర్తి అభిమానముండే దెప్పితే సరదాగానే ఉంటుంది. కాని దెప్పుడు అనేది ఎప్పుడూ అపాయకరమే. అనుకోకుండా మనం విసిరిన పూల చెండులో ముల్లులాంటిది ఏదోఎక్కడో సున్నితమైన చోట గాఢమైన గాయం కలిగించవచ్చు. గాయం పడిన తరువాత మాన్పడానికి ప్రయత్నించడం కష్టం కావచ్చు. నిరపాయకరంగాత్తోచే దెప్పుళ్ళే ఒక్కొక్క

ప్పుడు వికటించి ప్రాణమిత్రులు బద్ధవైరులు అయిన సంఘటనలు లేక పోలేదు. మరోరకం దెప్పుళ్ళు ఉన్నాయి. ఇలాంటివి గొప్పవారుకూడా అప్పుడప్పుడు వాడుతూ ఉంటారు. వీటిని చమత్కారపు ఎత్తిపొడుపు లనవచ్చు. మన సాహిత్యంలో ముఖ్యంగా కవుల వాగ్వాదాల్లో, రాజకీయ వేత్తల ప్రసంగాలలో ఇవి ఎన్నో కనిపిస్తాయి. జార్జి బెర్నార్డుషా గురించి తెలియని వారుండరు. ఆయన పొడుగ్గా, సన్నగా ఉండేవాడు. జి. కే. చెస్టర్‌టన్ అనే మరో ప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత ఒకసారి షాని కలుసుకున్నప్పుడు "మిమ్మల్నిచూస్తే దేశంలో కరువుందని తోస్తుంది ఎవరికైనా" అన్నాడట. "ఆకరువుకి కారణమేదో మిమ్మలిచూస్తే తెలుస్తుంది" అన్నాడట షా. (చెస్టర్‌టన్ చాలాలావుగా ఉండేవాడు) ఈ వరాచికాలు ఏమాత్రం ఆ మిత్రభావంతో చేసినవికావు అని తెలుస్తూ ఉంటుంది. కాబట్టి అపాయం లేకపోవచ్చు, కానీ అటువంటి ఎత్తి పొడుపుకు మాటుగా సమాధానంవస్తే దానికి తట్టుకోగలిగి ఉండాలి. ఇదేగాక సూటిగా చెప్పడం కన్నా ఇలావక్రంగా చెపితేనే విమర్శమరింత ప్రభావవంతంగా ఉంటుందని ఆవిధంగా చేస్తారు. కాని ఈవిధమైన దెప్పుళ్ళు ఎంతో నైపుణ్యముంటేనే వాడాలి. లేకపోతే చేతిలోపేలిన తూటాలా ప్రమాదం తెచ్చిపెడతాయి. అసలుప్రమాదకరమైన దెప్పుళ్ళకి వస్తున్నాం. ఇవి విషంలో ముంచిన బాణాలవంటివి. ఇవి అవతలివారి పట్ల అసూయతో, ద్వేషంతో, అక్కసుతో, అసహనంతో చేసేవి. ధైర్యంగా ఎదుర్కోలేక చాటునుంచి పొడవడం వంటివి. ఇవి నిజంగా పిరికిసందల, హీనమనస్తత్వం కలవాళ్ళ ఆయుధాలు. వీటి జోలికి ఎన్నడూ పోకూడదు. ధైర్యం ఉంటే సూటిగా విమర్శించడం మేలు. అంతేకాని దొంగచాటుగా విషబాణాలు విసరడం సంస్కారవంతులైన వ్యక్తులకి ఎంతమాత్రం తగదు.

ఇక సాధింపులు : ఇవి సాధారణంగా ఇంట్లో పెద్దవారూ - అమ్మమ్మలూ, నాయనమ్మలూ - గృహిణిలూ చేసేవిగా భావిస్తాం. ఈ సాధింపుల వెనక ఉన్నది మంచి ఉద్దేశ్యమేకాని ఆ ఉద్దేశ్యాన్ని ఎలా సాధించుకోవాలో తెలియక దానిని చెడగొట్టుకోవడమే జరుగుతుంది. అసలు విమర్శే చెడ్డదనుకున్నాం కదా. అటువంటప్పుడు సాధింపుల్ని గురించి వేరే చెప్పేదేమిటి ? సాధింపులు విమర్శలే. సమయం, మితీ తెలియని విమర్శలు. పదే పదే సుదీర్ఘంగా మాట్లాడడం జరుగుతుంది. రెండు మాటలు చెప్పవలసినచోట పాతిక మాటలు చెపుతారన్నమాట. సాధారణంగా చూస్తాం, భార్యో, తల్లో, బామ్మో ఏదో అంటుంది. ఇంటి ఆయన మొదట శాంతంగానే వింటాడు. కాని ఆ మాటల ప్రవాహం ఆగకపోయేసరికి సహనం హరించి ఛర్రున లేస్తాడు. సాధింపులు అవతలివాడికి పిచ్చెత్తినంతపని చేస్తాయి. అందుకే ఇంట్లోనుంచి పిల్లలు పారిపోవడాలూ, ఇంటాయన సన్యాసం పుచ్చుకోవడాలూ, ఒక్కొక్కప్పుడు ఆత్మహత్యలూకూడా జరుగుతాయి. ప్రపంచసాహిత్య కారుల్లో చాలా గొప్పవాడైన టాల్‌స్టాయీ, అతని భార్యా తమ పెళ్ళి అయిన కొత్తలో తమ యిద్దరినీ దంపతులుగా చేసినందుకు మోకాళ్ళ మీద వాలి భగవంతుడికి ధన్యవాదాలు తెలుపుకున్నారట. కాని తరువాత ముసలితనంలో అదే భార్య సాధింపులు భరించలేక టాల్‌స్టాయ్ తన సంస్థానం, భవనం విడిచి పారిపోతూ దారిపక్కన ఒక చిన్న స్టేషనులో ప్రాణాలు విడిచేశాడట. మనం ఒక్కొక్కప్పుడు ఎవరికో పదే పదే గుర్తుచేయవలసి ఉంటుంది. అలా గుర్తుచేయడం తప్పుకాదు, కాని గుర్తుచేసినా మృదువుగా ఒకటి రెండు మాటలతోనే గుర్తుచేయాలి. అంతేకాని ఇసుకకాగితం పెట్టి రాసి రాసి మంట పుట్టించకూడదు.

సాధింపులకు దగ్గరిదే అతివాగుడు : ఎటువచ్చీ ఇందులో విమర్శ ఉండదు. ఏదో అంతులేకుండా వాగుతూపోవడమే. ఇంగ్లీషులో దీనికి 'డయేరియా'ని అనుసరించి 'వెర్బోరియా' అన్న పదం సృష్టించారు. మనం మాటల 'అతిసారం' అనవచ్చు. (వీరే ఇంతకు ముందు మనం చర్చించుకున్న 'బోర్'లు) వయస్సు వచ్చినవారిలో ఈ లక్షణం మరీ కనిపిస్తుంది. వయస్సుతో పాటు 'మితభాషిత్వం' వస్తేనే వివేకం ఇంకా ఉన్నట్లు లెక్క.

<u>బడాయిలూ, గొప్ప చెప్పుకోవడాలూ</u> : బడాయిలు చెప్పుకోవడానికి బాగుంటాయేమోకాని వినడానికి బాగుండవు. నిజమైన గొప్పవాడెవడూ తనని గురించి చెప్పుకోడు. అతని చేతలూ, సాధించినవీ అతని గొప్ప తనాన్ని చాటుతాయి, నలుగురూ తమంతట తామే గుర్తిస్తారు. ఒక్కొక్కప్పుడు ఒక మనిషిలోని గొప్ప తనాన్ని కానీ, అతని గొప్ప కృతులు (రచనలూ వగైరా) కానీ ప్రజలు గుర్తించకపోవచ్చు. మెరిసే వాటికి ప్రాధాన్యమున్న ఈ రోజుల్లో అది సంభవమే. అయినా నిజమైన గొప్పవాడు తను చేసిన దానికి గుర్తింపు వచ్చేందుకు ప్రయత్నిస్తాడే కాని తన గొప్పతనం తానే చెప్పుకోడు. కాని కొన్ని ప్రత్యేక సందర్భాలున్నాయన్నది కూడా మనం మరచిపోకూడదు. ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళ్ళినప్పుడు తనుచేసినదేదో ప్రభావవంతంగా చెప్పుకోవాలి. అలాగే కొన్ని సందర్భాలలో తన గురించి పరిచయం చేసుకోవలసి ఉంటుంది. కాని అలాంటి సందర్భాలలో కూడా తనని గురించి అతిశయోక్తిగా చెప్పనేకూడదు. విషయం ఉన్నదున్నట్లుగా కేవలం-తథ్యాలు పేర్కొన్నట్లు-చెప్పాలి. స్వప్రశంసకూడదు. తనని తగ్గించుకు చెప్పుకుంటేనే నిజంగా గొప్పతనం. బడాయిలు చెప్పుకునేవారు ఇలాకాదు. వారికి నిజంగా తమలోకానీ తాముచేసిన

వాటిలోకానీ విశ్వాసం తక్కువ. అందువల్ల తమని గురించి సాధ్యమైనంత ఎక్కువగా చెప్పుకోకపోతే తమకి గుర్తింపు రాదేమోనని భయం. పైగా వారికి మనిషికి ఏదివిలువ ఇస్తుందో తెలియదు. తమకి ఇన్ని మేడలున్నాయనీ, ఇన్ని బట్టలున్నాయనీ, తాము ఖరీదైన వస్తువులే వాడతామనీ, తమయింట్లో అవి ఉన్నాయనీ, ఇవి ఉన్నాయనీ చెప్పుకుంటారు. (ఈ ధోరణికి చిహ్నమే వంటిట్లో ఉండవలసిన ఫ్రిజ్ డ్రాయింగ్ రూంల్లో పెట్టడంలో వ్యక్తమవుతుంది) ఒకామె తను ఖరీదైన వజ్రపుటుంగరం కొనుక్కుందట, కాని ఆమె ఎన్ని విన్యాసాలు చేసినా భరతనాట్యంలోలా ఎన్ని ముద్రలు వేసి చూపించినా ఎవరూ గమనించలేదు. దానితో ఆవిడ "అబ్బ ఉక్కపోస్తోంది, కాసేపు ఉంగరం తీసేయనేమిటి?" అందట బిగ్గరగా. ఆమాటకేనా అందరూ ఉంగరం చూస్తారని పాపం ఆమె ఆశ! కాని బడాయి అంతకన్నా బడాయిని రెచ్చగొడుతుంది. ఒకామె "నేను నా వజ్రాలు పాతబడితే పాలతో కడుగుతాను, వైడూర్యాలు ఫలానా దానితో కడుగుతాను. గోమేధికాలు ఫలానాదానితో కడుగుతాను-" అంటు చెప్పుకుంటు పోయిందట. అంటే తన దగ్గర నవరత్నాలూ ఉన్నాయని తెలియజేయాలని తాపత్రయం. దానికి మరొక ఆమె అందట; "నేను నా నవరత్నాలూ పాతబడితే దేనితోనూ కడగను. అవతల పడేస్తాను." ఆఖరికి వట్టిగొప్పలు కూడా పోటీని రెచ్చగొడతాయి. ఒకడు అన్నాడట "ఒరేయి ఈవేళ నేను తెల్లవారగట్లే లేచి బహిర్భూమికి వెళ్తూంటే పులి ఎదురయింది. అప్పుడు ఏం చేయను? సమయస్ఫూర్తితో చేతిలో చెంబులోని నీళ్ళు దాని మొగంమీద విసిరాను. దానితో అది వెళ్ళిపోయింది." దానికి వెంటనే మరొకడు "అవును నిజమే, తరువాత ఆపులే నాకెదురయింది. దానిమొగం తడిమితే చల్లగా తగిలింది" అన్నాడట. అప్పుడప్పుడు స్నేహితులమధ్యఉండగా

'మనమంటే ఎవరనుకున్నారు' అని తనుచేసినది చెప్పుకోవడంచూస్తాం. అందులో పెద్దహాని లేదు. ఎందుకంటే అది తను ఒకటి సాధించి నందుకు ఆనందం పెల్లుబకడం క్రిందే వస్తుంది. దానిని వినేవాళ్ళు కూడా నవ్వుతూ సరదాగానే తీసుకుంటారు. ఒలింపిక్స్‌లో నాలుగు రికార్డులు నెలకొల్పినప్పుడు కార్ల్ లూయిస్, వికెట్లు తీసుకున్నప్పుడు కపిల్ దేవ్ ఎలా ఎగిరిగంతులువేశారో చూడండి. అది స్వచ్ఛమైన ఆనందం మాత్రమే. అందులో ఇతరులను కించపరచాలన్న కోరిక ఎంత మాత్రం ఉండదు. బడాయిలు చెప్పుకునే వారి విషయంలో అలాకాదు. వారు తాము ఇతరులకన్నా గొప్పవారమని తెలిసేటట్లు చేయాలని ఆరాటపడిపోతారు. అందుకే ఇతరులు వారిని ఈసడించుకుంటారు. ఇతరులేనా వారికన్నా తీసిపోయింది? మిడిసిపడటం వల్లే మూతిపళ్ళు రాలేటట్లు పడడానికి అవకాశముంది, ఒదిగి నడవడంలోనే భద్రత ఉంది. తనని తగ్గించుకున్నవాడు తగ్గిపోయినట్లుకాదు.

మళ్ళీ విమర్శలకి వద్దాం. మీ తమ్ముడుకానీ, అబ్బాయికానీ ఉన్నాడనుకోండి. అధికారస్వరంలో ('ఫలానా') పనిచెయ్యి అనండి. ముప్పాతిక మువ్వంతులు 'నాకు హోంవర్కుంది నేనుచెయ్యను' అని తిరస్కారపూర్వకమైన జవాబే వస్తుంది.('మీరంటే విపరీతమైన భయం ఉంటే అదివేరు, చేతిలో ఏదిఉంటే అది పెట్టి,లేదా తాడోపేడో తీసుకొని దారుణంగాకొట్టే కొందరు తండ్రుల్ని ఈ రచయిత ఎరుగును.) అలా కాక అనునయపూర్వకంగా ఫలానాపని చేయమని కోరండి. 'హోం వర్కు ఉందన్నయ్యా, తరువాత చేస్తాను' అని మెల్లగానే సమాధాన మిస్తాడు. లేదా ఆపని చేసేవస్తాడు. అలాగే విమర్శ వెంటనే వ్యతిరేకత రెచ్చగొడుతుంది. బుజ్జగిస్తూ మంచిగా చేయించుకున్నట్లుగా, తిట్టికొట్టీ చేయించుకోలేం. ఇంట్లోవాళ్ళ విషయంలో మరీజాగ్రత్త వహించాలి.

'అతి పరిచయాదవజ్ఞా' అన్నట్లు చాలా మంది ఇంట్లో వారిని తేలికగా తీసేసి మాట్లాడుతారు, తూల నాడుతారు. బయట వారితో ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తారు. కొందరు దీనికి పూర్తిగా విరుద్ధంగానూ వ్యవహరిస్తారు. రెండూ తప్పే. ఎవరిపట్ల అయినా ఓర్పుతో, సానుభూతితో, సౌమనస్యంతోనే వ్యవహరించాలి. 'గాంధీ' చిత్రంలో మీరు చూసి ఉంటారు. (భంగీల విషయంలో) తన ఆదర్శాలు అర్థం చేసుకోలే దన్న కోపంతో గాంధీగారు కస్తూరిబాను ఇంట్లోనుంచి బయటికి గెంటి వేయబోతాడు. కస్తూరిబా గట్టిగా నిలదీస్తుంది "నేను పరాయి దానిని కాదు, మీ భార్యను, నన్నింట్లోనుంచి తోసివేస్తే నేనెక్కడికి పోగలను?" అని. గాంధీగారు వెంటనే పశ్చాత్తాప పడతాడు. అహింసా ప్రవక్తా, సత్యాగ్రహీ అయిన మహాత్ముడు తన కొడుకుల్లో పెద్దవాడిని దూరం చేసుకున్నాడనీ, ఆ కొడుకుతండ్రిఆదర్శాలకు పూర్తిగావ్యతిరేకంగా నడుచుకుంటూ బ్రతికి ఉండగా తండ్రిని మళ్ళీ ఎన్నడూ చూడలేదని మీకు తెలుసునా? కాబట్టి ఆత్మీయులని నిర్లక్ష్యం వహించరాదు.

అటు పరాయి వారితో అసహనంతో, ఆగ్రహంతో వ్యవహరించే వారున్నారు. అత్తగారు తన కూతురితో మాట్లాడినట్లు కోడలితో కూడా మాట్లాడితే ఆ యింటి వాతావరణంలో ఎంత తేడా వస్తుంది! అలాగే అత్తగారితో కోడలి వ్యవహారం మృదువుగా ఉంటే కూడా.

ఇంకొకటి, ఇంట్లో కుర్రవాడు సరిగా చదవక పరీక్షలో తప్పాడు. ఆ వేళే ఫలితాలు తెలిశాయి. వాడే అవమానంలో బాధ పడుతూ ఉంటాడు. అలాటప్పుడే మౌనంతో, సానుభూతితో వ్యవహరించవలసినది. అప్పుడే అతను పశ్చాత్తాపపడి పరివర్తన చెందే అవకాశం కొంతైనా ఉంటుంది. అలా కాక పలో పంటలనుంచి ఇంట్లో

వారందరూ వాడిమీద దాడి మొదలు పెడితే అవమానంతో కుంగిపోయి వాడు నూతిలోనో, నదిలోనో, దూకవచ్చు. ఏ రైలు కిందో పడవచ్చు. అప్పుడప్పుడు కుర్రవాడిని గట్టిగా నిలవేసి, మందలించవలసిన అవసరం రావచ్చు. అప్పుడు కూడా పద్మవ్యూహంలో అభిమన్యుణ్ణి చుట్టుముట్టి మట్టు పెట్టినట్లు గాక ఒకరు మాత్రం ప్రధానంగా ఆ భారం వేసుకొని (అవసరమైతే మరొకరు ఆయనకు సమర్థనగా ఉండి - కుర్రవాడు మరీ మొండి వైఖరీ, ధిక్కార వైఖరీ అవలంభిస్తేనే) ఒకరు అతని వైపున సానుభూతితో నిలబడాలి. అప్పుడే అతని వ్యక్తిత్వానికి మానని గాయం కాకుండా తనని విమర్శిస్తున్నవారు తనపై ద్వేషంతో కాదు, తన బాగు కోసమే చేస్తున్నారు అని అతను గ్రహించడానికి కొంతైనా అవకాశం ఉంటుంది. ఇది కేవలం పిల్లల విషయమే కాదు, ఎవరిని విమర్శించవలసి వచ్చినా అవలంబించదగిన పద్ధతి. ఈ విధంగా మనం పైన అనుకున్నట్లు అవతలి పక్షాన్ని కూడా తెలుసుకొని మరీ వ్యవహరించినట్లవుతుంది.

పైన చూసినదంతా మనకి తెలియజేసేది మనం ఇతరులతో (ఇతరులంటే ఇక్కడ మనం కానివారెవరైనా-తమ్ముడైనా, కొడుకైనా భార్యఅయినా అన్నఅర్థంలోనే తీసుకుంటున్నాం) వ్యవహరించేటప్పుడు అవతలివాళ్ళ దృష్టితో కూడా ఆలోచిస్తూ ఉండాలనీ, వారిని సానుభూతితో అర్థం చేసుకొందుకు ప్రయత్నం చేయాలనీ. కొందరున్నారు చూడండి, నాయిష్టం, నా అలవాట్లు, నా మాటా, నాకోపం,నా చిరాకూ అన్నట్లుగా కేవలం తమదృష్టితోనేగాక, తమ మీదే దృష్టి కేంద్రీకరించుకొని వ్యవహరిస్తూ ఉంటారు. వారు ఎంత చదువుచదివినా (వారిది నిజం చదువు కానేరదు) ఎంత ఉద్యోగంచేస్తున్నా, ఎంత అధికారం చలాయిస్తున్నా ఎంత ధనవంతులయినా, సంస్కారం లేనివారే. సమాజం

ఏ కారణావల్లనైతేనేమీ వారిని భరిస్తోంది కాబట్టి వారు అలా కొనసాగుతున్నారు. మనిషి సమాజంలోనే పుడతాడు, సమాజంలోనే మరణిస్తాడు, సమాజం లేనిదే వ్యక్తి లేడు (వ్యక్తిత్వాన్ని నాశనం చేసుకొమని చెప్పడం కాదు) అని వారికి తెలియదు తమ గొప్పతనం రుజువవుతోందనుకుంటారు కాని, తమతోకూడా అపాయాన్ని కొని తెచ్చుకుంటున్నామని గ్రహించరు. నేను చాలా గొప్పవాడినన్నట్లు ఠీవిగా నిలబడి మెడ వంచకుండా నడుస్తూ ఏరాయో గొయ్యోవస్తే బొక్కబోరగిలపడి మొగమంతా గాయాలై నవ్వుల పాలైనట్లు అవుతుంది వారిపని. మనం చిన్నప్పుడు పుస్తకాలలో చదువుకున్నాం చిన్న మొక్కనుచూసి హేళన చేసిన వృక్షరాజం తుఫానురాగానే ఫెళఫెళా విరిగినేల కూలుతుందనీ, వంగి ఉండగలిగే చిన్న మొక్క తుఫానుకు తట్టుకొని తరువాత మళ్ళీ లేచినిలబడుతుందనీ. ఈ అహంభావ వ్యక్తులే కొందరు కట్టెపిరిచి పొయ్యిలో పెట్టినట్లు మాట్లాడడం, పరుషంగా మాట్లాడడం అదేదో తమ గొప్పతనానికి నిదర్శనమన్నట్లు వ్యవహరిస్తారు. నిజంగా అవి తమ మొగంమీద మొటిమలూ, కురుపుల్లా అసహ్యం కలిగిస్తాయని వారికి తెలియదు. సమాజమనే అద్దంలో వారు చూడరుగదా.

టూకీగా చెప్పాలంటే అహంభావం.ఆత్మాతిశయమూ కురూపిత్వం దుర్గంధం లాటివనీ, సౌజన్యం,వినయమూ సౌందర్యం,సుగంధంలాంటివనీ చెప్పవచ్చు. కొంచెం వంగి నడిచేవాడు వ్యక్తిత్వంలేనివాడు కాడు. ఇతరుల దృష్టితోకూడా ఆలోచించేవాడూ, వారిని సానుభూతితో అర్థం చేసుకోడానికి ప్రయత్నించే వాడూ ఆత్మద్రోహం చేసుకున్నట్లుకాదు. నిజానికి అతనే కార్యసాధకుడవుతాడు. తన లక్ష్యాన్ని చేరుకోగలుగుతాడు. ఇలా అంటున్నామంటే నలుగురూ ఎలా అంటే అలాగే నడవమని కాదు. తండ్రీ, కొడుకూ, గాడిదా కథ ఉందికదా. మన వ్యక్తిత్వాన్ని

నిలుపుకుంటూనే చుట్టు సమాజంతో సమన్వయం సాధించుకోవడానికి ప్రయత్నించాలి. ఒక్కొక్కప్పుడు సమాజాన్ని ఎదిరించి నిలబడవలసి వస్తుంది. అప్పుడుకూడా అలా చేయడానికి కారణం కేవలం తన దృష్టితోకాక సమాజం హితం దృష్టితోనే ఆలోచించడమే. సమాజాన్ని సంస్కరించిన వారూ, విప్లవాలు తెచ్చినవారూ మొదట్లో సమాజం నుంచి ఎంతో ప్రతిఘటనా, దౌర్జన్యం కూడా ఎదుర్కొని ఉంటారు. కాని వారు నిలబడింది సమాజం కోసమే, అందుకే చివరికి సమాజం వారి వెనుక నడుస్తుంది. కాబట్టి సమాజదృష్టి మన నడవడికి ప్రాథమిక లక్షణం కావాలి. ఆ విధంగా మనకి మనమేమీ నష్టం కలిగించుకోవడం లేదు. సమాజానికి మంచిచేసి దానిద్వారానే మన మంచీ సాధించుకొంటామన్న మాట.

ఈ సందర్భంలోనే నాయకత్వం గురించి ఒకటి రెండుమాటలు చెప్పుకోవాలి. నాయకుల్లో రకాలు ఉంటారు. తాము నాయకులం కావాలని ప్రబలకాంక్షకు పట్టుదల జోడించుకుని వారు ఎలాగో గొప్ప వారవుతారు. మరికొందరు గొప్పతనాన్నీ నాయకత్వాన్నీ ఆశించరు. అవే వారిని వరిస్తాయి. నెపోలియన్, హిట్లర్, ముసోలినీ, స్టాలిన్ వంటి వారు మొదటి తరగతి కిందికివస్తే, మహాత్మాగాంధీ, అబ్రహాం లింకన్, జయప్రకాశ్ నారాయణ్ వంటివారు రెండవ తరగతి నాయకులుగా వస్తారు. నాయకులలో మరికొన్ని రకాలు చూస్తాం. కొందరు తాము ఎక్కువగా ప్రకాశించేందుకు చుట్టూ దీపాలు అన్నీ ఆర్పివేస్తారు. మరి కొందరు అలాచేయరు కాని, మర్రిచెట్టు విస్తరించినట్లుగా విస్తరించి బ్రతికుండగా ఇతరులు పైకివచ్చే అవకాశం లేకుండా చేస్తారు. నిజమైన నాయకులు తమతోబాటు మరెందరినో-మొత్తం సమాజాన్నికూడా-పైకి తేవడానికి ప్రయత్నిస్తారు. అంతేకాదు, నాయకత్వం అంటే అందరినీ

తన అదుపులో పెట్టుకొని, తనమాటకు తిరుగులేకుండా చేసుకోవడం కాదు. అది అహంకార ప్రకోపం. అటువంటి అహంకారం పొగడ్తలకు పడిపోతుంది. అన్నీ తనకే తెలుసునని విర్రవీగుతుంది. అదే మనిషిని నిజం తెలుసుకోనీకుండా చేస్తుంది. తనని పూలతో ముంచెత్తినవారూ, భుజాలమీద కెక్కించుకొని జేజేలు పలికిన వారూ, వంగి సలాములు చేసినవారూ తన అభిమానులే అనీ, ఆరాధకులే అనీ భ్రమపడి, వారే తనని ఎత్తిపడేయవచ్చుననీ, కిందపడ్డ తరువాత వారే తమ కాళ్ళతో తొక్కవచ్చుననీ గ్రహించనీయదు. నిజమైన నాయకుడు తన గొప్ప తనం గురించి ఆలోచించడు. తనకే అన్నీ తెలుసుననుకోడు. చాలా మందికి తనకన్న ఎక్కువ తెలుసుననీ, అటువంటి ప్రతిభావంతుల్ని తనతోకలిసి పని చేయించగలగడమే తన భాగ్యమనీ ఎంచుతాడు. తన తోడివారి గౌరవ ప్రతిష్టలు పెంచడానికి ప్రయత్నించి ఆ విధంగానే సంతృప్తి చెందుతాడు. తను మాట చెప్పేముందు మాట వింటాడు. అర్థం చేసుకుంటాడు. అలా చేసినంతలో అతని గొప్పతనానికి నష్టమేమీలేదు. గాంధీగారి అనుయాయుల్ని తీసుకోండి. ఆయా రంగాలలో వారికున్న జ్ఞానంలో శతాంశం ఆయనకుండి ఉండదు. అయినా మహాత్ముడు మహాత్ముడే. ఒక ఆర్థిక శాస్త్రవేత్త "నేను ఆర్థికశాస్త్రంలో పరీక్ష పెట్టి మార్కులు వేయవలవస్తే మీకు సున్నా ఇస్తాను. కాని మీముందు నేను సాష్టాంగపడతా"నన్నాడట. అంటే మనుషుల్ని కలుపుకు వచ్చేవాడే నాయకుడు. అటువంటి నాయకుడు అధికారం నుంచి తొలగినా ప్రజలాయనని వదలరు. ఆయన వెళ్ళిపోయినా ఆయనని స్మరించుకుంటూనే ఉంటారు. అటువంటి నాయకులలో కనపడే ప్రధాన లక్షణాలు స్వార్థచింతన లేకపోవడం, మానవ కళ్యాణానికే తను జీవితాలను అంకితం చేసి వేయడమూను. అవేకాదు, వారు అసంఖ్యాకుల

మనస్సుల్ని ఆకట్టుకొని తమతోకూడా తీసుకు వెళ్ళగలిగారన్నది కూడా మనం మరచిపోకూడదు. నాయకత్వం మీద ఈ చర్చ ఎందుకు అంటే అత్యున్నతస్థాయిలో కూడా మనం పరిశీలించిన సూచన-కేవలం మన దృష్టితోనేగాక, అవతలివాడి దృష్టితోకూడా ఆలోచించడం, అతడి పట్ల సానుభూతితో వ్యవహరించడం - ఎంత ప్రాధాన్యం వహిస్తుందో గుర్తించడానికే.

ఇటీవల ఈ అహంభావం, స్వాతిశయం మరొక ముసుగులో విజృంభిస్తోంది. విచిత్రంగా ఇది విజ్ఞానం పేరు వాడు కుంటోంది. చీటికీ మాటికీ వైజ్ఞానిక దృక్కోణం అంటుంది, కాని అది చేసేది దానికి పూర్తిగా విరుద్ధంగా పోవడమే. విజ్ఞానం అంటే సత్యంకోసం తహతహ అని చెప్పవచ్చు. కాని సత్యం ఒక్కటిగా మన ముందుకు రాదు. అనంత వైవిధ్యంతో కూడిన అసంఖ్యాక తథ్యాల రూపంలో దర్శన మిస్తుంది. కాబట్టి విజ్ఞానం ఆ తథ్యాల అన్వేషణకే అంకితమై పోయింది. అందుకే ఇంత ప్రగతి సాధించింది. కేవలం పై పైన లభించే తథ్యాలతో సంతృప్తి పడక, అష్టకష్టాలూపడి, నానా రకాల ప్రయోగాలూ జరిపి, నిగూఢమైన తథ్యాలను కూడా వెలికి తీసి, వాటిని నిశితంగా పరిశీలించి ఆ పరిశీలన ఆధారంగానే తన అభిప్రాయాలు ఏర్పరచు కుంటుంది. తన పరిశీలన వల్ల తేలే సత్యాలకు విరుద్ధమైన ఏ అభిప్రాయాన్నైనా, సిద్ధాంతాన్నైనా -అది సొంతందే అయినా- దానిని తోసిపుచ్చి వేస్తుంది. ముందు అభిప్రాయం ఏర్పరచు కోవడం దాని తత్త్వమే కాదు. తథ్యాల కోసం అభిప్రాయాన్ని త్యాగం చేస్తుంది, కాని అభిప్రాయం కోసం తథ్యాలను అణచదు, తిరస్కరించదు. అంటే అభిప్రాయం మార్చుకోవడానికీ, కొత్త అభిప్రాయం ఏర్పరచుకోవడానికి సిద్ధంగా ఉండడమే వైజ్ఞానిక దృక్పథం అని చెప్పుకోవచ్చు. కాని మనం పైన

అనుకున్న వ్యక్తులు కొన్ని రకాల అభిప్రాయాలు చెడ్డవనీ, కొన్ని రకాలు మంచివనీ ముందే నిర్ణయించేసుకుంటారు. తమకి నచ్చని అభిప్రాయాలకి ఆధారమేమైనా ఉందా, ఒక అభిప్రాయం పొరబాటు అయినా, దాని వెనక ఏమైనా తథ్యాలున్నాయా అని చూడనేచూడరు: అసలు మీ అభిప్రాయం పూర్తిగా వినకుండానే దానిని తోసిపుచ్చుతారు. మీరేమైనా తథ్యాలు ప్రస్తావించినా, అవి కించిత్తుకూడా పరిశీలించకుండా, వాటి మొగమైనా చూడకుండా వాటిని కొట్టి పారవేస్తారు, లేకపోతే తమ దృక్పథాన్ని బట్టే వాటిపై వ్యాఖ్యానిస్తారు. వారు విజ్ఞానం పేరు చెప్పి అజ్ఞానాన్ని ప్రోత్సహిస్తారు. కోపతాపాలు కూడా ప్రదర్శిస్తారు. అసలు మానవుడి మనస్సే జీవితానికి అత్యంత ప్రధానమైనది. ఆ మనస్సు వ్యాపారమే ఆలోచన. ఆ ఆలోచనలోనే దోషాలూ, పొరబాటు ధోరణులూ ఉంటే జీవితం ఘర్షణా మయం, అశాంతి మయం కాక మరేమవుతుంది. లోకంలో అది చేయాలి, ఇది చేయాలి అని ఇంత గగ్గోలు చేసేవారు ఆలోచనా సరళిని సంస్కరించుకోవాలనీ, ఆ విధంగా చాలా సమస్యలు 'పరిష్కార మవుతాయన్నది గుర్తించక పోవడం ఆశ్చర్యకరం, విచారకరం. 'సరిగా ఆలోచించడం' అన్న దీనికి జత పుస్తకంలో ప్రస్తుత రచయిత ఈ అంశాన్ని వివరించాడు. ప్రస్తుతానికి మనం ఇతరుల అభిప్రాయాలు తెలుసుకోవడానికీ, వారి దృష్టిలో ఆలోచించడానికీ, వారిని సానుభూతితో అర్థం చేసుకోవడానికీ సంసిద్ధులమై ఉండడంవల్ల అటు వైజ్ఞానిక దృక్పథమన్న దానినీ సంతృప్తి పరుస్తాం, ఇటు మనకీ, మన సమాజానికీ సమన్వయం కుదుర్చుకొని సౌమనస్యం, సుహృద్భావం నెలకొల్పిన వాళ్ళమూ అవుతాం.

ఒక నాస్తికుడు ఉన్నాడనుకుందాం. అతను తనకే సృష్టి రహస్యం తెలుసు ననుకుంటాడు. దేవుడు గీవుడూ

లేదంటాడు. దానికి ఆక్షేపణం ఉండవలసిన పనిలేదు ఎవడు చూసి వచ్చాడు కనుక. కాని ఒక పొరుగు వాడు, మనిషి మంచివాడు, పరమ భక్తుడు కూడా, సద్భావంతో ప్రసాదమియ్యబోతే అది అతని మొగం మీద తిరస్కారంతో తోసిపుచ్చడమో, నేలమీద గిరవాటు వేయడమో చేయకూడదు. అది కుసంస్కారమే అవుతుంది. ఎదర వాడి అభిప్రాయాలనూ, నమ్మకాలనూ, ఆచారాలనూ - సభ్యతకీ మానవత్వానికీ విరుద్ధమైతే తప్ప- గౌరవించడంలో హుందాతనం ఉంది, మీ అభిప్రాయాలనూ, నమ్మకాలనూ వదులుకున్నట్లు కాదు. అలాగే ఒక ఆస్తికుడు తన పొరుగువాడికి తన నమ్మకం, భక్తి లేదని అతనిని దుష్టుడిగా, సంఘవ్యతిరేకిగా భావించకూడదు. మనకి ముఖ్యంగా కావలసింది నలుగురితో ఎలా వ్యవహరిస్తున్నారు అన్నదే. పైన అన్నట్లు సామరస్యం, సద్భావం పెంచడమే మన ప్రధాన ధ్యేయం కావాలి.

మరొక విషయం. మనం ఇంతవరకూ మన అభిప్రాయాల్ని గురించే మాట్లాడుకుంటున్నాం. మన చేతలూ, చేష్టల్నీ గురించికూడా ఒకటి రెండు చెప్పుకోవాలి. చాలాకాలం క్రిందట 'యూకివారిసూ' అన్న జపానీస్ చిత్రం వచ్చి గొప్ప సంచలనాన్ని కలిగించింది. దానికి వందనకళ్ళు(అనేక రూపాల్లోఅనుకొండి)మన భారతదేశ లో తయారయ్యాయి (ఇప్పటికీ అప్పుడప్పుడు తయారవుతూనే ఉన్నాయి.) అందులో ఒక నాలుగేళ్ళ కుర్రవాడు ప్రధాన పాత్ర. ఆ చిత్రంలో ఒకడు యుద్ధ సమయంలో ఒకామెతో పరిచయం ఏర్పరచుకుంటాడు. ఆ పరిచయం సాన్నిహిత్యంగా ఏర్పడుతుంది. యుద్ధం తరువాత వారు విడిపోతారు. అతడు తనకి నచ్చిన ఆమెని వివాహమాడి సుఖంగాజీవితం గడుపుతూ ఉంటాడు. అటు అతనితో ఆ మొదటి స్త్రీ పరిచయ ఫలితంగా ఒక పిల్లవాడు జన్మిస్తాడు. ఆమె పిల్లవాడిని ఎలాగో కష్టంమీద పెంచుతుంది.

ఆమెకు క్షయ పట్టుకుంటుంది. తనింక ఎంతోకాలం బ్రతకనని ఆమెకు నమ్మకమేర్పడుతుంది. తన 'సవతి'పేర "నేను మీ ఆయనకు పూర్వ పరిచితురాలిని, ఈ ఉత్తరం పట్టుకువచ్చిన కుర్రవాడు ఆయన బిడ్డే. కొన్ని ప్రత్యేక పరిస్థితులవల్ల అలా జరిగింది. నేను ఎక్కువకాలం బ్రతకను, కాబట్టి దయఉంచి మీ ఆయన కోసం, ఈ పిల్లవాడిని చేరదీసి సాకవలసింది, ఈ పిల్లవాడు మీకేమి ఇబ్బంది కలిగించడు", అని ఉత్తరం రాసి కుర్రవాడికిచ్చి, అతని బట్టలూ,సామానూ చిన్నమూటగా కట్టి ఇచ్చి తీసుకువెళ్ళి రోడ్డు మొగనే నిలబడి వాడికి తన 'సవతి' ఇల్లు చూపుతుంది. కుర్రవాడు ఆ యిల్లు చేరుకోగానే ఆమె జనంలో కలిసి పోతుంది. కుర్రవాడు గేటు తీసుకొని లోపలికి ప్రవేశిస్తాడు. తలుపువేసి ఉంటుంది. కాలింగ్‌బెల్ నొక్కుదామంటే అది ఎత్తుమీద ఉండి వాడి కందదు. వాడు తలుపు బాదడు, అరవడు. అది అసభ్యత అని తల్లి వాడికి శిక్షణ ఇచ్చి ఉంది. అందువల్లవాడు ఇంటిచుట్టు ప్రదక్షిణచేస్తాడు. ఎక్కడైనా మరో తలుపో, కిటికియో తెరచిఉందేమోచూస్తాడు. ఊహూ ఏదీ తెరచిలేదు. కాని లోపల మనిషి ఉన్నట్లుమాత్రం తెలుస్తోంది. చివరికి ఆ కుర్రవాడికి ఒక ఉపాయం తట్టుతుంది.ఆవరణలోని తోటలో ఒక నీళ్ళ బకెటు ఉంటుంది. అది తెచ్చి గుమ్మం దగ్గర బోర్లించి, దాని మీద నిలబడి కాలింగ్‌బెల్ బటను నొక్కుతాడు 'సవతితల్లి' వచ్చి తలుపుతీస్తుంది. "ఎవరు నువ్వు? ఎందుకోసం వచ్చావు?" అని అడుగుతుంది. కుర్రవాడు వెంటనే జవాబివ్వడు. ముందు తనుతెచ్చిన బకెటు ఎక్కడ ఎలా ఉందో అలా పెట్టి వచ్చి, అప్పుడు తల్లి యిచ్చిన ఉత్తరం ఆమె కిస్తాడు. (ఆ ఉత్తరం చదువుకొని ఆమె కుర్రవాడిని లోపలికి రమ్మంటుంది. ఇంట్లో ఉండనిస్తుంది. కాని ఆమె మనస్సు పూర్తిగా కుర్రవాడిని చేరదీసేందుకు రాజీపడదు. ఆ నాలుగేండ్ల

కుర్రవాడు తన అమాయకపు మాటలద్వారా, చేతలద్వారా ఆమె హృదయం ఎలా చూరగొన్నదీ తరువాత కథ అనుకొండి. అది మనకి క్కడ అంత ప్రధానం కాదు) పైనచెప్పిన దృశ్యం మనస్సుమీద గాఢమైన ముద్ర వేస్తుంది.

మనం ఎంతమంది మనం చేసేపనులూ చేష్టల పర్యవసానాల గురించి ఆలోచిస్తాం చెప్పండి. పాపం చాలామంది గృహలక్ష్ములు ఇల్లూ వాకిలీ అంతా అద్దంలా తుడిచి కసువు జాగ్రత్తగా పట్టుకువెళ్ళి పక్క వారి గుమ్మం దగ్గర పోసివస్తారు, మీరు చూడలేదా? లఘుశంక తీర్చుకోవలసిన వారు చాలామంది తమ గోడవైపుకు కాక ఎదర గోడ వైపుకు నడుస్తారు, మీరు గమనించే ఉంటారు. ప్రఖ్యాత సినీదర్శకుడు మృణాల్ సేన్ తన ఒక చిత్రంలో ('ఖారిజ్'లో అనుకుంటాను) ఈ దృశ్యం పెట్టాడుకూడా. రైళ్ళలో బస్సుల్లో చూడండి. కూర్చున్నచోట కొందరు ఎంత గలీజుచేస్తారో. అలాగే మన రోడ్లు ఎంత అసహ్యంగా ఉంటాయో! మునిసిపాలిటీ వారిది కొంత లోపమే అని ఒప్పుకుందాం కాని అంతా లోపమనడం మాత్రం సరికాదు. ఇంగ్లీషులోవాడే 'సివిక్ కాన్షస్‌నెస్' ('పౌరస్పృహ' అంటే బాగుంటుందా?) మనకి లేదేమో అనిపిస్తుంది. మన ఎన్టీ రామారావు అమెరికాలో వీధులు మన బెడ్‌రూంల కన్న శుభ్రంగా ఉంటాయన్నాడని కొందరికి ఉగ్రంవచ్చింది. 'తెలుగు వారి ఆత్మాభిమానం అని చెప్పేవాడు తెలుగువారిని ఇలా కించ పరుస్తాడా? ఆఁయ్', అన్నారు. ఉన్నది ఉన్నట్లు చెప్పుకోవడానికికూడా ఆత్మాభిమానం అడ్డురావాలా?

ఒకమారు మన భారతీయుడే స్విట్జర్లండులో షికారు వెళ్లాడట. అతను జేబులోనుంచి అరటిపండు పైకితీసి తిని ఆతొక్క ఎవరూ

చూడలేదు కదా అనుకొని కొండపక్కకి విసిరేశాడట. కాని ఒకస్విస్ అమ్మాయి చూడనే చూసిందట.ఆమె పల్లంలోకిదిగి ఆ తొక్కతీసి తన హాండ్‌బాగ్ నుంచి ఒక కాగితం తీసి అందులో చుట్టిపట్టుకుపోయిందట దూరంగా ఉన్న చెత్తబుట్టలో పడెయ్యడానికి మనవాడు సిగ్గుపడి పోయాడట. సింగపూర్‌లో ఎవరైనా పొరబాటునైనా సరే ఒక చిన్న కాగితం ముక్కైనా బహిరంగ స్థలంలో పడేస్తే ఐదువందల డాలర్లు జుల్మానా విధిస్తారట. అందువల్ల సింగపూర్ ప్రపంచంలో కెల్లా పరిశుభ్ర నగర మంటారు. జపానులో అటువంటి శిక్షలు అవసరం లేకుండానే ఇంటా, బయటా అంతా పరిశుభ్రంగా ఉంచుతారట. మనం ఒక్కసారిగా ఆ స్థితి చేరుకోలేక పోవచ్చు. కాని తెలిసిన వారైనా ఆ ప్రయత్నం చేయవద్దూ ?

అది అలా ఉంచండి. మన చేష్టలూ, అలవాట్లు ఇతరుల కెలా కనిపిస్తాయో, వారిపై ఎలాంటి ప్రభావం కలగజేస్తాయో కూడా మనం పరిశీలన చేసుకోవాలి. కొందరు పెద్ద మనుషులు చూడండి. వెనక్కిజేరబడి, కాళ్లు ఎత్తుగా ఏ కుర్చీ మీదకో జాపి, పంచ తొడల వరకూ పైకి లాగి మధ్య మధ్య చేతులతో - ఊఁహు, ఇక చెప్పను. మరి కొందరు ఎక్కడ పడితే అక్కడ ఉమ్మి వేస్తారు. ఏమిటయ్యా అంటే 'నా ఇష్టం, నువ్వెవడివి అడగడానికి?' అంటారు. మొగం మీద పెద్ద గడ్డ (కురుపు) అసహ్యంగా పెరిగి, పగిలి, రసి ఓడుతూంటే "ఏమిటయ్యా అలా ఉంచావు, పట్టీ ఏదైనా వేయక పోయావూ" అంటే "నా కురుపు, నా యిష్టం, నేను దానిని పెంచుకుంటాను, అలాగే ఉంచుకుంటాను, మధ్య నీ కెందుకు?" అన్నట్లే

అధికం ఎందుకు ? నేనూ, నా ఇష్టాలూ, రుచులూ, అభిప్రాయాలూ, అలవాట్లు, చిరాకులూ, పరాకులూ, కోపతాపాలూ అన్న

దృష్టిలో ఆలోచించడం సంస్కారం చాలా తక్కువ అన్నట్లు విదితమవుతుందని మరొక మారు గుర్తు చేసుకుందాం. (వీరిలో కొందరు తప్పు చేసేది తామూ, కాని ఎదర వాడు అదేమిటి అన్నాడని అతని మీద మండి పడతారు.)

ఇంత వరకూ ఇతరులతో మన వ్యవహారం ఎలా ఉండాలో అన్నది ఆలోచించాము. కాని దీనికే మరో పక్షం ఉంది. మనం ఇతరులను విమర్శించడం మంచిది కాదనుకున్నాం, దానివల్ల సాధించగలిగింది కూడా చాలా తక్కువ అనుకున్నాం - కొన్ని అపవాదాల విషయంలో తప్పితే. కాని ఇతరులు మనల్ని విమర్శిస్తే ? ఇక్కడే మన ఔన్నత్యం రుజువయ్యేది. మనం విమర్శనాహ్వానించాలి. చాలామంది అంటారు తాము విమర్శనాహ్వానిస్తామని. కాని వారు ఎదురు చూసేది అధిక భాగం ప్రశంసనే, విమర్శ వస్తే తట్టుకోలేరు. మనం అలా కాదు. మనం విమర్శనాహ్వానించాలి. విమర్శ వచ్చి రాగానే మనం కారాలూ మిరియాలూ నూరకూడదు. విమర్శని మనల్ని మనం పరీక్ష చేసుకొని, మనలో ఏమైనా లోపాలూ, పొరబాట్లూ ఉంటే వాటిని తొలిగించుకుందుకు అవకాశంగా భావించాలి. విమర్శ ద్వారా బయటపడ్డ మన లోపాలూ, పొరబాట్లు సరిదిద్దుకోవడంవల్ల మన వ్యక్తిత్వమే మరింత బలపడుతుంది కదా. అలా కాక విమర్శ అనగానే మనలో కోపం ఛర్రుమందంటే మనలో లోపాలున్నాయన్న మాటే. మన వ్యక్తిత్వాన్ని ఆ లోపాలకు ముడి పెట్టకూడదు. మన లోపాలను ఎత్తి చూపితే మన గౌరవానికి భంగం కలిగించినట్లు కాదు, అలా చేయడం పైన చెప్పినట్లు ఇవి నా కురుపులూ, నా మొటిమలూ, వాటిని విమర్శిస్తే నన్ను విమర్శించినట్లే అన్నట్లే అవుతుంది. కాబట్టి విమర్శ మన హితం కోరే జరుగుతోందో, మన మీద కోపంతో, అసూయతో జరుగు

తోందో విచక్షణ చేసి చూసు కోవడం మంచిది. ఏ విమర్శ అయినా మనలో దాని కాధారం లేకుండా చూసుకోవడం విమర్శనుంచి కూడా ప్రయోజనం పొందడం అవుతుంది. మరి ఉత్త అన్యాయపు విమర్శ అవుతేనో? దానికే వద్దాం.

మన మెంత సౌమ్యంగా, సరళంగా వ్యవహరించినా అవతలి వారు దుష్టంగానే వ్యవహరిస్తే అన్నది కూడా ఆలోచించవలసిందే. మంచివాడు ఇతరులను గురించి ఆలోచిస్తాడు, కాని దుష్టుడు అలా ఆలోచించడు గదా. పైగా దౌర్జన్యం చేస్తాడు. మంచికి తిరుగు లేకపోతే ప్రపంచం ఇలా ఉండదు గదా. మంచీ, చెడుల మధ్య పోరాటం నిరంతరం జరుగుతూనే వస్తోంది. ఈ పోరాటంలో మంచితనం వైపు కూడా సకల శక్త్యుక్తులూ ప్రయోగించవలసే ఉంటుంది. హిట్లరును అణచడానికి ఒక భయంకర ప్రపంచ యుద్ధం జరగవలసి వచ్చింది. మన గాంధీ మహాత్ముని అహింసా ఉద్యమం గురించి మనం సగర్వంగా చెప్పుకుంటాం, కాని హిట్లరు నాజీ మూకల ముందు గాంధీగారి పద్ధతులు ఏమై ఉండేవో అని ఆలోచించుకుంటే మనకి సందేహం కలగక మానదు.

మనం మొత్తం సమాజం గురించి వ్యక్తిగత స్థాయిలో ఆలోచిద్దాం. మీకు పామూ, సాధువూ కథ జ్ఞాపకం ఉండి ఉండాలి. ఒక పాము ఒక సాధువు ముందు గోల పెట్టిందట : "నన్ను చూసి అందరూ అసహ్యించు కుంటారు, తల చితక గొట్టడానికి ప్రయత్నిస్తారు. నేనిలా నీచపు బ్రతుకు గడపవలసిందేనా? నాకు మాత్రం ముక్తి మార్గం లేదా?" అని. "లేకేం, నువ్వెవరికీ హానీ చేయకుండా ఉండు, నీ జీవితం ధన్య మవుతుందని" చెప్పాడట సాధువు. ఆ విధంగానే ఆచరిం

చడం మొదలు పెట్టిందట పాము. కాని అది ఇక కరవదని తెలిసే సరికి అల్లరి కుర్రవాళ్లు రాళ్ళతో, కర్రలతో దానిని కొట్టసాగారు. ఒళ్ళంతా గాయాలతో రక్త సిక్తమైపోయి దాని తల ప్రాణం తోకకు వచ్చింది. (నిజానికి అది పాముకి సంబంధించిన సామెతే గదా) మరో సారి సాధువు అటు పోతూ చావడానికి సిద్ధంగా ఉన్న పామును చూసి "ఏమిటి ఇలా ఉన్నావేం?" అని అడిగాడట. "మీరు చెప్పిన ఉపదేశం పాటించిన ఫలితమే స్వామీ ఇది" అందట పాము. దాని మీదట సాధువు "నేను నిన్ను కాటు వెయ్య వద్దన్నాను కాని, బుస్సు మన వద్దని లేదే" అన్నాడట. దానితో పాము ఎవరైనా సమీపించబోతే, బుస్సు మని లేచే సరికి వారు పారిపోసాగారట. (ఈ కాలపు పిల్లలైతే "ఇది ఉత్త బుస్సు రా" అని మళ్ళీ విజృంభిస్తారు కదూ. అందుకే మన పాత కథలు కొన్ని తిరగ రాసు కోవలసి ఉంటుందేమో) ఏ మైతేనేం మన మంచి తనం మెతక తనం కింద తీసుకోకుండా జాగ్రత్త పడాలి. అప్పుడప్పుడు మనం కఠినంగా కూడా వ్యవహరించక తప్పదు. గాంధీ గారి జీవితంలో నుంచే మరొక కథ - అది నేను స్వయంగా చదవలేదు, ఒక మిత్రుడు చెప్పాడు. గాంధీగారు దక్షిణాఫ్రికాలో ఉండగా ఒక ఆశ్ర మం నడిపారు. ఆ ఆశ్రమంలో అందరూ గాంధీగారు బోధించిన ఆశ యాల కనుగుణంగానే నడుచుకునే వారట. కాని ఒక కుర్రవాడు మాత్రం అందుకు విరుద్ధంగా వ్యవహరించ సాగాడట. వాడు ఇతర కుర్రవాళ్ళని కొట్టేవాడు. వాడు చేయని ఆగడం లేదు. గాంధీగారు ఎంతో ఓపికగా బోధించి చూశారట. అయినా ప్రయోజనం లేక పోయింది. చివరికి ఆ ఆశ్రమంలోనే ఒకరిద్దరు పెద్దవాళ్ళు "అయ్యా, ఆ కుర్రవాడిని మాకు వదిలి వేయండి, మీరు జోక్యం చేసుకోకండి" అని చెప్పి, ఆ కుర్రవాడిని చాటుకు తీసుకువెళ్ళి గట్టిగా నాలుగు ఉతి

కారట. అప్పుడు వాడికి తెలిసి వచ్చిందట తను కొట్టిన దెబ్బలు ఇత రులకు ఎలా అనిపిస్తాయో. అప్పటి నుంచీ వాడు ఆగడాలు మాని, బుద్ధిగా ఉండ సాగాడట. అందుకే మన పిల్లల్ని ఒక్కొక్కప్పుడు గట్టిగా కేకలు వేయవలసి వస్తుందికూడా. అలాగే మనతో అపసవ్యంగా వ్యవహరించే వారిని ఒక్కొక్కప్పుడు గట్టిగా ఎదిరించి నాలుగు కడిగి వేయడం అవసరం కావచ్చు. ఇంతకు ముందు అధ్యాయంలో, సభలో శ్రోతల్ని ధిక్కరిస్తూ, రెచ్చ గొడుతూ మాట్లాడడం ద్వారా కూడా వారిని ఆశ్చర్యచకితుల్ని చేసి లొంగదీసు కోవచ్చనుకున్నాం. అలాగే అప్పుడప్పుడు ఒక్కసారి మన ఆగ్రహం తీవ్రంగా ప్రదర్శించడంవలనా, ఘాటైన విమర్శవల్లా,ఒకప్పుడు పదునైన ఒక తిట్టువల్లా కూడా అవతలి వాళ్ళకళ్ళు తెరుచుకుంటాయి. కాని ఇవి అన్నీ అవతలివారి హితంకోసే చేయాలి. శస్త్రచికిత్స చేసే వైద్యుడి సాధనాలా వాడాలి. ముందు ఇతర ఉపాయాలు వాడిచూసి నిష్ప్రయోజనమైనట్లు రుజువయ్యాకే మనం అస్త్రధారణచేయాలి. ఏమిచేసినా మనం మన ఆగ్రహానికీ, ఆవేశానికీ లొంగిపోయామనీ, మనం స్వార్థంతోనే ఆలోచించామనీ ఇతరులు మనకేసి వేలుచూపకుండా జాగ్రత్తపడాలి.

ఇది ఇలా ఉంచి మరికొందరు వ్యక్తులుంటారు. వారికెందుకో మన మీద కోపంవస్తుంది. వారు తామనుకున్నదే కాని ఎవరిమాటా వినరు. నిజంతెలుసుకోరు.తరుచు ఆకోపానికి కారణం ఉండకపోవచ్చు మనమూ మన వాళ్ళం ఎంతో అన్యోన్యంగా ఉండడమే వాళ్ళకి మంట. ఆఖరికి మనం చక్కగా వస్తువులు వేసుకుంటే కూడా వాళ్ళకి బాధకలుగుతుంది. బాధపడి ఊరుకోరు ఆ బాధకు - వారి దృష్టిలో-మనమే కారణం అని ఎంచి మనమీద దాడి వెడలుతారు. సందర్భంఉన్నా లేకపోయినా ఏవో

ఎత్తి పొడుపు మాటలు మనకి వినిపించేలా అని మనకి బాధకలగజేయా లని చూస్తారు. ఇంకా ఇలాంటి జాతుల వారెందరో ఉంటారు. వారంద రినీ వర్ణించడం అనవసరం. తేళ్లూ, జెర్రులూ ఉంటాయి కదా, వాటి లక్షణం దగ్గరకు వచ్చిన వారినందరినీ కుట్టడం, కాటువేయడమే. అలాంటివారే వీరూ అనుకోవాలి. వారికి దూరంగా తొలగడమే శ్రేయ స్కరం. వారిలోని విషాన్ని తొలగించ జూడడం అవివేకమవుతుంది.

ఇన్ని విధాలా జాగ్రత్తలు తీసుకున్నా, మన మే తప్పు చేయ కున్నా, ఎంతో మంచిగా వ్యవహరించినా ఒక్కొక్కప్పుడు మనం దారుణాలకు గురి అవుతాం. ఇటీవల శ్రీమతి ఇందిరా గాంధీ హత్య తరువాత అమాయకులైన సిక్కు పిల్లలూ, పెద్దలూ, వృద్ధులూ, దారు ణంగా హత్య చేయబడ్డారు. మరి దీనికి పరిష్కారం లేదా? ఈ అంశం వచ్చే అధ్యాయంలో పరిశీలిద్దాం.

---

* ఈటె పోటులు కన్న మాటుపోటు లోతుగా గాయం చేస్తుంది.
* జయించవలసింది ఎదుటివారి బుద్ధినికాదు, హృదయాన్ని.
* మనం ముఖ్యంగా కోరేది సమయం, దుర్వినియోగం చేసేదీదాన్నే.
* మానవుని ఎంపికలోనే అభివృద్ధి ముఖ్యసూత్రం ఇమిడి ఉంది.
* పనిలేక పోవడం విశ్రాంతికాదు, ఖాళీ మనస్సు అశాంతికి నిలయం.
* మన ప్రగతికి ప్రబలశత్రువు అసహనం.

8

# నలుగురితోనే వచనం

అమెరికాలో ఈ సంఘటన జరిగింది. ఒకామె చంకన పది నెలల బిడ్డను తీసుకొని మెట్లు దిగుతోంది. హఠాత్తుగా ఒక మెట్టుమీద ఆమె కాలు మెట్టిగిలింది. ఆపుకోబోవడంలో ఆమె చేతిలో బిడ్డ ఎగిరి మూడు వరుసల మెట్ల క్రిందికి పడిపోయాడు. అంతే, ఆ పిల్లవాడి రూపం లేదు. ఆ తల్లి తేరుకోడానికి ఎన్నో ఏళ్ల పట్టిందట. అప్పటికీ పూర్తి మనిషి కాలేదట. దగ్గరలో కృష్ణాజిల్లాలో సంఘటన. ఇరవై, ఇరవై రెండేళ్ళ యువకుడు "అమ్మా చద్దన్నాం పెడతావా?" అని అడిగాడు. "అలాగే నాయనా" అని ఆమె పీటా, కంచం వేసి అన్నం పెట్టింది. తీరా జాడీలో ఆవకాయ లేదని చూసి "అటక మీద నుంచి తీస్తాను ఒక్క నిమిషం ఉండరా, నాయనా" అని ఆవిడ నిచ్చెన వేసుకొని అటక మీద పెద్ద జాడిలోనుంచి చిన్న జాడీలోకి ఆవకాయ తీస్తోంది. ఇంతలో దూరాన తమ పొలంలో ఏదో అలజడి అవుతోందని గమనించి 'ఆబోతు చేలో పడింది కాబోలు' అనుకొని "ఇప్పుడే వస్తానమ్మా" అని అటు పరుగుత్తాడు ఆ యువకుడు. అంతే, అక్కడ కాచుకున్న పగవారు కర్రలు పెట్టి కొట్టి చంపివేశారు. అన్నానికి కూర్చున్న కొడుకు అలా అయిపోయేసరికి, ఆ తల్లి తట్టుకోలేక పోయింది. చిన్న బుట్టలో పెట్ట దగినంతగా చిక్కి పోయి, తరువాత కొంత కాలానికి చనిపోయిందట.

ఈ వార్తలిలా ఉండగా మరో వార్త చూడండి. ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో ఒకామె ఉన్న నలుగురు కొడుకుల్నీ యుద్ధంలో పోగొట్టుకుంది. అయినా ఆమె బ్రతికి బట్టకట్టింది. ఆదే శాంతి సమయంలో అయితే ఒక్క కొడుకు దారుణపు చావుకే ఆమె తల్లడిలి పోయి ఉండేదని ఆ వార్త తెలియజేసిన ఆయన రాశాడు. ఆమె కా బలం ఎలా వచ్చింది? అది తానున్న సమాజపు తక్షణ లక్ష్యంతో ఆమె సంపూర్ణంగా ఐక్యం కావడం వల్లే వచ్చింది. యుద్ధాలప్పుడూ, విప్లవాలప్పుడూ సామాన్య వ్యక్తులు కూడా అపూర్వ సాహస పరాక్రమాలు చూపిస్తారు. ఎంతటి కష్టాలనైనా ఓర్చుకుంటారు, ఎంతటి త్యాగాలైనా చేస్తారు. అ బలం సమాజం నుంచె వస్తుంది. ఇంతకు ముందే మన మనుకున్నట్లు సమాజం లేనిదే వ్యక్తి లేడు. నాకెవరితో సంబంధం లేదు, ఎవరికీ నాతో సంబంధం అక్కర్లేదు, నా బ్రతుకేదో నేను బ్రతుకుతాను అన్నవాడు తానున్నది ఒక కొమ్మమీద అని గుర్తించడు. ఏ కారణాన్నో ఆ కొమ్మ విరిగితే అప్పుడు తెలిసి వచ్చినా లాభముండదు. ఏదైనా ఆపద ముంచుకు వస్తే, ఏ కష్టమో క్రుంగ దీస్తే, అప్పుడు నలుగురు కాకపోయినా కనీసం ఒక్కడు సానుభూతి చూపినా చాలునని హృదయమెదురు చూస్తుంది. గతంలో కొందరు ఖైదీలకి వేసే అతి కఠిన శిక్ష ఏమిటో తెలుసా? ఒంటరి ఖైదు. మనమే ఒక గదిలో ఏ శబ్దమూ వినబడకుండా, ఏ మనిషి మొగమైనా చూడకుండా ఒక్క రోజు నిర్బంధంలో గడిపామంటే ఒంటరి తనం ఎంత భయంకరమో తెలిసి వస్తుంది. ఒక రోజు లేదా కొన్ని రోజులు పట్టుదల కోసం నిలబడవచ్చు. కాని చాలా రోజులు జరిగే టట్లయితే నిజంగా పిచ్చెత్తి పోతుంది. (పిచ్చి అంటేనే సమాజంతో సంబంధం తెగి పోవడం.) గాల్స్‌వర్దీ అన్న ప్రసిద్ధ నవలా

రచయితా, నాటక కర్తా (నోబెల్ బహుమాన గ్రహీత కూడా) ఈ విషయం తీసుకునే 'జస్టిస్' (న్యాయం) అన్న నాటకం రాశాడు. ఆ నాటకం చూసి ప్రముఖ రాజనీతిజ్ఞుడు విన్‌స్టన్ చర్చిల్ (తరువాత రెండుసార్లు - యుద్ధకాలంలోనూ మరొక సారీ ప్రధానమంత్రి చేసిన వాడు) ఒంటరి ఖైదుకి వ్యతిరేకంగా శాసన బద్ధమైన చర్యలు తీసుకోవ దానికి కృషిచేశాడు. మనం భాష లేకుండా బ్రతుకు సాగించగలమా? ఆ భాష సమాజం నుంచి వచ్చినదే, సమాజంతో విడదీయరాని విధంగా కలిపేదే. అసలు మనం కష్టం వచ్చినా, అపాయమెదురైనా, దుఃఖం ముంచుకు వచ్చినా ఏందుకు పైకి అరుస్తాం, ఎడుస్తాం ? సమాజం కోసం కాకపోతే మరి దేనికి ?

ఆ మధ్య ఒక పత్రికలో ఒక కథ పడింది. ఒకడు ఒక ప్రయోగంగా తన భాషని పూర్తిగా తలక్రిందులు చేసి, వికృతం చేసి ఆ కొత్త భాష అభ్యాసం చేయసాగుతాడు. నవ్వుతున్నాను అంటే అతని కొత్త భాషలో ఏడుస్తున్నాను అని ఏడుస్తున్నాను అంటే నవ్వుతున్నాను అన్నట్లుంటుందన్న మాట. కొన్నాళ్ళకి అతను తన సహజమైన భాష పూర్తిగా మరచిపోయి తయారు చేసుకున్న భాషలోనే ఆలోచించడం మొదట పెడతాడు. కొన్నాళ్ళకి అతనికి కొన్ని ఇబ్బంది లెదురవుతాయి. కాని చెప్పుకుందామనుకున్నా అతనిని చుట్టు పక్కలవారు అర్థం చేసుకోలేరు గదా. చివరికి అతను దారుణమైన చావు చస్తాడు(ఇదికల్పనే అనుకోండి) ఇంతకీ చెప్పవచ్చే దేమంటే సమాజంలేకుండా మనం లేము. ఆ సమాజంలో మన పాత్ర నిర్దేశించుకొని దానిని సమర్థవంతంగా నిర్వహించి సమాజంతో మన సంబంధం దృఢతరం చేసుకోవడంలోనే మన భద్రతా, బలం, ఆశ్రయం, సాంత్వనాకూడా ఉన్నాయి.

అంతేకాదు నలుగురూ కలిసినప్పుడు అపూర్వసాహసాలు ప్రదర్శిస్తారనీ, త్యాగాలు చేస్తారనీ పైన అనుకున్నాం కదా. కాని నలుగురూ కలిసి దుష్టావేశానికి లోనైతే వారే పరమ పైశాచిక కాండ చేస్తారు. ఉదాహరణలు కోకొల్లలు. హిట్లర్ నాజీమూకలూ, ఆనాటి తూర్పు పాకిస్తానులో పాకిస్తానీ సైనికులూ, పోలీసులూ, గూండాలూ, ఉగాండాలో ఇడీ అమీన్ అనుచరులూ, కంపూచియాలో పోల్‌పాట్ పార్టీవారూ, ఇటీవల ఢిల్లీలో అల్లరిమూకలూ చేసినదేమిటో తెలుసును కదా. ఢిల్లీ ఉదంతమే తీసుకుందాం. అక్కడ రెండువేలకు పైగా సిక్కులు - పిల్లలూ, వృద్ధులతో సహా - దారుణమైన చావులకు గురిఅయ్యారు. వారిలో చాలామందికి భింద్రన్‌వాలే హత్యా రాజకీయాలతో ఏమాత్రం సంబంధం లేదు. అసలు ఏ రాజకీయాలతో కూడా వారికి సంబంధం లేదు, ఆసక్తి లేదని చెప్పాలి. తమ బ్రతుకులేవో తాము గడుపుతున్న వారు. అయినా ప్రాణాలు-అతి బాధాకరంగా-పోగొట్టుకోవలసి వచ్చింది. వారేమి నేరం చేశారు ? ఎందుకీ అన్యాయం ? అని పౌరహక్కుల సంఘాలవారూ, ఎందరో సహృదయులూ ఆక్రోశిస్తున్నారు. నిజమే, కాని ఒక విధంగా ఆలోచిస్తే అలా చనిపోయినవారు ఒక నేరంచేశారనే చెప్పాలి. అదేమంటే చుట్టు సమాజంలో ఏమి జరుగుతోందో పట్టించుకోకుండా వారు తమ బ్రతుకులేవో తాము చూసుకున్నారు. తమ పేరుతోనే కొందరు మత దురహంకారులూ, తీవ్రవాదులూ రెచ్చిపోయి అకృత్యాలూ చేస్తూఉంటే చూస్తూ ఊరుకున్నారు. చివరికి ఆ మత దురహంకారుల చర్యల ఫలితంగా అమాయకులైన వారుతమ జీవితాలతో మూల్యం చెల్లించవలసి వచ్చింది. ద్వితీయ ప్రపంచయుద్ధ సమయంలో యూరపులో చూడండి. వందలూ, వేలూకాదు అరవై లక్షలయూదులు అమానుషమైన మూకఉమ్మడి హత్యకు గురి అయ్యారు. వారందరూ ఏ నేరమూ చేయనివారే-యూదులుగా పుట్టడమే తప్పిస్తే. వారుకూడా

తమ వ్యక్తిగత జీవిత వలయాల్లోనే ఉండిపోయి బయటతమ మీదికి ముంచుకువస్తున్న పెనుప్రమాదాన్ని గుర్తించి దానిని నివారించడానికి పూనుకోలేక పోయారనాలి.

మన జీవితాలు నలుగురి జీవితాలతో ముడివడి ఉన్నాయని గుర్తించి నడుచుకోవాలి. నలుగురూ అంటే మన చుట్టుప్రక్కలవారే కాదు. మన చుట్టు సమాజం అన్నమాట. అందుకే వివేకం ఉన్న ప్రతివాడూ రాజకీయాలపట్ల తగినంత శ్రద్ధచూపడం ప్రాథమిక విధి అవుతోంది. రాజకీయాలంటే పార్టీ రాజకీయాల్లో చేరిపొమ్మని సలహా కాదు. సాధారణంగా రాజకీయరంగంపై ఒక కన్నువేసి ఉంచి, సమాజ హితమే లక్ష్యంగా కల శక్తులకి ప్రోత్సాహమిచ్చి, ప్రమాదకర శక్తులు విజృంభించకుండా జాగ్రత్తపడాలి. కాని రాజకీయాలే సర్వమూ కాదు అన్నది కూడా మరో మహత్తర సత్యం. రాజకీయాల కతీతంగా మనం పాల్గొదగిన కార్యకలాపాలెన్నో ఉన్నాయి.

ఉదాహరణకి ఒకటి రెండు చెపుతాను. ఈనాడు వినియోగదార్ల ఉద్యమాలు ప్రపంచ మంతటా విస్తరిస్తున్నాయి. వాటివల్ల ఎంతో ప్రయోజనం చేకూరుతోంది. వినియోగదార్ల రక్షణ సంఘాలు కేవలం మార్కెట్‌లో వస్తువులకే పరిమితం కావడం లేదు. పౌర సరఫరాలూ, పాల సరఫరా, విద్యుచ్ఛక్తి, రవాణా సదుపాయాలు, మునిసిపాలిటీకి సంబంధించిన రోడ్లూ, పార్కులూ, మంచినీటి సరఫరా, పారిశుధ్య వ్యవస్థా, కాలుష్య నివారణా, బాకింగ్, టెలిఫోన్లూ, పోస్టల్ సర్వీసులూ- ఒకటేమిటి ప్రజలకు సంబంధించిన అన్ని ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో ఇవి పని చేస్తున్నాయి. అట్లాంటి ఉద్యమాల్లో పాల్గొవడం, వాటికి బలం సమకూర్చడం వల్ల మనకే లాభం కదా. కాని చిత్ర మేమంటే

ఇలాంటి సంఘంలో చేరమంటే పది రూపాయిలు చందా కడితే నాకు వెంటనే ఏమి లాభం కలుగుతుంది అని ప్రశ్నించే వారున్నారు. ఆ వైఖరి శుద్ధ అవివేకమైనది. ఇంగ్లీషులో అంటారని మన మనుకున్నామే. "పెనీ వైజ్ ఫౌండ్ ఫూలిష్" (పెన్నీ తెలివి తేటలూ, పౌను తెలివి తక్కువ) అన్న వైఖరికి నిదర్శనం. మనం పది రూపాయి లిచ్చి పాతిక రూపాయిలు పొందాలనా? ఆ లాభం ఎవరి దగ్గరనుంచి పొందు దామనుకుంటున్నాము? అందరూ అలా అనుకుంటే ఏమవుతుంది? మనకి సరియైన అవగాహన ఉంటే సమాజానికి మేలు జరిగితే మనకీ మేలు జరుగుతుందని తెలుసుకుంటాము. అందువల్ల మనం మన మేలు జరుగుతుందని గాక, సమాజానికి లాభించే ఏ కార్యక్రమానికైనా మన చేయూత నివ్వడమే మన విధిగా ఎంచాలి. ఇలా ఒక్క వినియోగదార్ల ఉద్యమంలోనే కాదు, మన సామాజిక జీవితాన్ని స్పృశించే ఏ కార్యక్రమంలోనైనా, మన జీవితాన్ని సుసంపన్నం చేసే కళా సాహిత్య, సాంస్కృతికాది కార్యక్రమాల్లోనైనా మన శక్తి కొద్దీ పాల్గొనవచ్చు, కనీసం తోడుపడవచ్చు.

అంతేకాదు, నాగరికత పెరగడంతో బాటు సంఘ వ్యతిరేక శక్తులకీ, దురభిమానం, దౌర్జన్యం చలాయించే శక్తులకీ కూడా విశేషమైన బలం లభిస్తోంది. వాటిని వ్యక్తిగత స్థాయిని ఎదుర్కోవడం అసాధ్యమయిన పనీ, అపాయకరమైనదీ కూడా. సామాజిక సంఘటన ద్వారానే అటువంటి వాటి నెదుర్కోగలం, మనకి మనం భద్రత చేకూర్చుకోగలం.

ఈ సందర్భంలో కొందరు తమ కళ్ళ ముందు అన్యాయం జరుగుతున్నా తమ మీదకి ప్రత్యక్షంగా రాలేదు కాబట్టి తమకేమీ సంబంధం లేనట్లు తప్పించుకు తిరుగుతారు. అది స్పష్టంగా పిరికితనమే. అనుకోకుండా వారికే అపాయమైనా ఎదురైతే అప్పుడు

సమాజం గుర్తుకు వస్తుంది, నలుగురి సహాయం కావలసి వస్తుంది. ఒకాయన - ఒక ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడే - కాలేజీకి వెళ్ళే తన కూతుళ్ళను ఎవరో అల్లరి కుర్రవాళ్లు ఏడిపిస్తున్నారనీ, వాళ్ళ ఆగడం మితిమీరి పోతోందనీ, ఎవరూ వాళ్ళ నరికట్టడానికి పూను కోవడం లేదేమనీ, ఏమిటి ఈ సమాజం ఇలా తయారవుతోందనీ ఒక పత్రికా సంపాదకుని ముందు ఆక్రోశించాడట. "మీరింతకు ముందు మీ చుట్టు ప్రక్కల వారేమైనా ఇబ్బందులు పడ్డారేమో ఎన్నడైనా విచారించారా?" అని అడిగితే ఆయన మాట్లాడలేక పోయాడట. "కనీసం మీ చుట్టు ప్రక్కల వాళ్ళ గురించి కొన్ని వివరాలు చెప్పగలరా?" అంటే కూడా నోరు విప్పలేదట. తను ఎవరినీ గురించీ పట్టించుకోలేదు సరి కదా, పక్క వారి అమ్మాయిని ఏడిపిస్తున్నారంటే 'ఆ అమ్మాయిలోనే ఏదో లోపం ఉండి తీరుతుంది, లేకపోతే వాళ్లు అలా చేయరు' అంటూ నిజం తెలుసుకోకుండా అభియోగం మోపడానికి సిద్ధ పడునేమో కూడా. కాని సమాజం మాత్రం తన అక్కరకు కావాలి! నలుగురి కోసం ఏ మాత్రం చేయడానికి సిద్ధపడని వాడికి నలుగురి నుంచి సహాయ సాను భూతు లాశించే హక్కు ఉండదు. పైన చూశాం, రోడ్లూ, వీధి దీపాలూ, పారిశుధ్యం, పౌర సరఫరాలూ, రవాణా సదుపాయాలూ వంటి వాటి విషయంలో కొందరు పూనుకొని నానా హైరానాపడి ప్రజల అవసరాలు తీరుస్తుంటే, ఏడ్చే దాని మొగుడు వస్తే నా మొగుడూ వస్తాడు అన్నట్లు మన కెందుకు, మన కడుపులో చల్ల కదలకుండా మన పనులేవో మనం చూసుకుందాం, వాళ్లు తంటాలు పడుతున్నారు గదా, దాని లాభం నాకూ ఉంటుంది, నన్ను రోడ్డు మీద నడవద్దన లేరు కదా, వీధి దీపం వెలుతురు మా యింటివైపు పడకుండా ఆపలేరు కదా అవి చూసే వాళ్లు ఉన్నారు. సమాజానికి ఏమీ ఇవ్వకుండానే గొప్ప లాభం పొందుదామని

చూస్తారన్న మాట. అది పరమసత్యం. ఇంతకు ముందే ఒకమారు చెప్పు కున్నట్లు మనం ఎంత ఖరీదైన దుస్తులు ధరిస్తున్నాం, ఎంత షోగ్గా తయారవుతున్నాం, ఇల్లంతా ఎన్ని ఖరీదైన వస్తువులు నింపుతున్నాం, ఎంత అందంగా అలంకరించు కుంటున్నాం అన్న దాని బట్టి కాదు మన విలువా, సంస్కారం రుజువయ్యేది, సమాజ రుణం ఏ విధంగా తీర్చుకుంటున్నాం, సమాజ శ్రేయస్సు కోసం ఏ విధంగా ఎంత వరకు పాటు పడుతున్నాం, అన్న వాటిమీద అవి ఆధారపడి ఉంటాయి.

ఇటీవల దోపిళ్లూ, హత్యలూ పెరిగిపోతున్నాయని ఆందోళన చెందుతున్నాం కాని ఎంత ప్రభుత్వమైనా ప్రతి యింటికీ ఒక పోలీసుని కాపలా పెట్టలేదు, ప్రతి వీధిలో ఒక పోలీసుస్టేషను ఏర్పరచలేదు. పౌరులు తమంత తాము సంఘటితం కావటంవల్ల కూడా ఎంతో చేయ వచ్చు. అలాగే పౌరజీవితపు అవసరాలూ, సౌకర్యాల విషయంలో కూడా, పౌరులు కూడా కలసివస్తే, ప్రభుత్వమూ, పురపాలక సంఘాలూ, ఇతర సంస్థలూచేసే కృషికి వారి కృషికూడా తోడై పౌరుల జీవితమే బాగుపడుతుంది, సంపన్న మవుతుంది.

కాని ఇక్కడ ఒక హెచ్చరిక చేయవలసి ఉంది. పైన నాయ కత్వం గురించి మనం చర్చించుకున్నాం కదా, దానికి సంబంధించిన సమస్యలు నలుగురికోసం కృషిచేసే సంస్థలలో కూడా ఉత్పన్నమవు తున్నాయి. కొందరు వాటిలో చొరబడి ముందు పదవులకోసం సిగపట్లు మొదలు పెడతారు. తమ లక్ష్యసాధన కోసం,పలుకుబడి ఉపయోగిస్తారు, డబ్బు ఖర్చు పెడతారు. వారు కులం, మతంలాంటి తత్వాలుకూడా రెచ్చగొట్టి కుతంత్రాలు కూడా చేయవచ్చు. వీరి దురాక్రమణవల్ల చీమలు పెట్టినపుట్టలు పాముల కిరవైనట్లవుతుందన్న మాట. చేతనైతే ఇలాంటి

వారిని రానీయకుండా చేయాలి. లేకపోతే కుళ్ళిపోయిన పండుని అవతల విసిరేసినట్లు అటువంటి సంస్థల్ని వదలివేయాలి. మరికొన్ని సంస్థలు ఉన్నాయి. సమాజసేవ అంటూ ముందుకువస్తాయి. కాని అవి చేసే ఆర్భాటమూ, ప్రదర్శించే పటాటోపమూ ఎక్కువ. అవి డాబూ, దర్పమూ, పెంచేవిగా, హోదా, డబ్బూ, పలుకుబడికీ ప్రాధాన్యమిచ్చేవిగా, ప్రజా సేవచాటున తమసొంత ప్రయోజనాలు సాధించుకునే వారికి సాధనాలుగా తయారవుతున్నాయి. ఆ సంస్థలుచేసే ప్రజాసేవ పదివంతులైతే, చేసే ఆర్భాటమూ, ప్రదర్శించే పటాటోపమూ తొంభైవంతులు ఉంటుంది. (ఆంధ్రభూమి వారపత్రికలో శ్రీ మల్లాది వెంకట కృష్ణమూర్తి ఈ విషయమై ఒక చాలామంచి చిట్టికథ రాశారు). ఆ పదివంతులు ప్రజాసేవ కూడా ఆ సంస్థ సభ్యులు చేసేది అయిఉండదు. వారినీ వీరినీ పొగడో, అర్థించో, లేకపోతే కొనో తెచ్చిన సేవల్ని ప్రజలకందించి వేదికలమీద ఒకరి కొకరు అభినందించుకుంటారు. ఫొటోలు తీయించుకుంటారు. పత్రికలలో వేయించుకుంటారు. తాత్కాలికంగా మెరిసిపోతారు. ఏవిధంగానైతేనేమి పదివంతుల ప్రజాసేవైనా అందుతోంది కాబట్టి ఆ సంస్థల కార్యకలాపాల్ని మనం అడ్డగించవలసిన పనిలేదు. కాని వాటి వెంట పడకపోవడం మంచిది. దూరంగా ఉండడమే శ్రేయస్కరం.

ఇది ఇలాఉంచి మరికొన్ని ఉద్యమాలూ సంస్థలూఉంటున్నాయి. ఇవి తమ సభ్యుల్ని, తమ ప్రభావం కిందవచ్చే ఇతరుల్ని ఎప్పుడూ ఏవేవో కార్యక్రమాల్లో ఇరికించి వారు స్వతంత్రంగా ఆలోచించుకోవడానికీ, నలువైపులా ప్రపంచాన్ని పరిశీలించడానికి కానీ అవకాశం లేకుండా చేసి కుండీల్లోని క్రోటను మొక్కల్ని మన అలంకారానికి వాడుకున్నట్టు, తమ సంకుచిత ప్రయోజనాలకే వాడుకుంటున్నాయి.

మనం సమాజంతో సంబంధం గుర్తించమన్నాం, సమాజంపట్ల మన బాధ్యతని చక్కగా నిర్వర్తించాలనుకున్నామేకాని సొంత వ్యక్తిత్వాన్ని నాశనం చేసుకొమ్మనలేదు. సమాజమనేది వేరుగా ఉండే వస్తువుకాదనీ, వ్యక్తులద్వారానే దర్శన మిస్తుందని మనం ముందే గుర్తించాము. వ్యక్తులు బలహీనులూ, అజ్ఞానులూ అయితే ఆ సమాజం అంతకన్నా అధ్వాన్నంగా తయారవుతుంది. ఒక వ్యక్తి విశేషంగా జ్ఞానం కానీ, కౌశలం కానీ సాధించాడంటే అది సమాజానికీ వరమే. సమాజంలోని వ్యక్తులందరూ చైతన్యవంతులూ, విజ్ఞానవంతులూఅయితే ఆ సమాజమూ అద్భుతమైన ప్రగతిని సాధిస్తుంది. కాబట్టి సమాజ సేవ చేస్తామని ముందుకువచ్చిన సంస్థలైనప్పటికీ వ్యక్తులవికాసాన్ని అణచివేసేవీ,దెబ్బతీసేవీ అయితే అవి సమాజవ్యతిరేక సంస్థలనే భావించవలసి ఉంటుంది. కేవలం తనస్వార్థం చూసుకొని సమాజాన్ని మరచిపోవడం ఎంత తప్పో, సమాజం కోసమని వ్యక్తిత్వాన్ని నాశనం చేసుకోవడం కూడా అంతే తప్పు. (సమాజంకోసం ఆత్మబలిదానం చేసేవాడు తన వ్యక్తిత్వాన్ని బలిదానం చేసినట్టుకాదు. భౌతికంగా అతడు లేకపోయినా అతని వ్యక్తిత్వం శక్తిమంతంగా సమాజం ముందుకువస్తుంది. దానిని ప్రభావితం చేస్తుందికూడా) కాబట్టి మనం నలుగురితోనే ముందుకు సాగాలి. ఆవిధంగా మనకి సామాజిక వ్యక్తిగత జీవనంలో కూడా కొండంతబలం, ధైర్యం లభిస్తాయి. ఓదార్పుకూడా లభిస్తుంది.వ్యక్తికి సమష్టికీ సమన్వయం సాధించుకోవాలన్నదే ఈ అధ్యాయంలో మనం తెలుసుకున్న పరమసత్యం.

---

* స్నేహితుణ్ణి నిలుపుకుందుకు మంచి చెయ్యి, శత్రువుని వశపరచుకోవడానికి మంచి చెయ్యి.

9

# ఉన్నత శిఖరాలకు

గతంలో లండన్ నుంచి 'స్ట్రాండ్' అనే సచిత్ర మాసపత్రిక వెలువడేది. ఆనాటి పత్రికా ప్రపంచంలో ప్రముఖస్థానం పొందింది కూడా. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధం తరువాత కొంత కాలానికి మూత బడిపోయింది. ఆ పత్రికలో ఒక కథ చదవ దగింది. దాని సారాంశం చెపుతాను.

ఒక ఉద్యోగి ఉన్నాడు. పొద్దున్నే లేచి కాలకృత్యాలు గావించు కొని, వార్తాపత్రిక చదువుకొని, త్వరగా భోంచేసి, భూగర్భ రైల్వే స్టేషనుకిపోయి టికేట్లిచ్చే యంత్రంలో పెన్నీలువేసి టికెట్టు తీసుకొని రైలెక్కి తను పనిచేసే చోటుకి చేరుకునేవాడు. సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేవాడు. అతనిదంతా నిమిషాలతోసహా టైంటేబుల్ ప్రకారంలా జరిగేది. ఎన్నేళ్ళయినా ఆ కార్యక్రమంలో పీసమెత్తు తేడా రాలేదు. ఒకనాడు అతను టికెట్లమ్మే యంత్రంలో పెన్నీలు వేసి టికెట్ తీసు కుంటుండగా "ఏమిటి సార్, కులాసాగా ఉన్నారా?" అన్న మాట విని పించింది. గుమాస్తా వెనక్కి తిరిగి చూశాడు. నలువైపులా చూశాడు. ఎవరూ తనని పలకరిస్తున్న వారిగా కనిపించలేదు. అతను ఆశ్చ ర్యంలో మునిగిపోయి తన టైంటేబుల్‌కి కొన్ని సెకన్లు ఆలస్యమయి

పోయిందనే కంగారుతో పరుగెత్తి వెళ్ళి ట్రెయిన్ ఎక్కేశాడు. మర్నాడు కూడా అదే అనుభవం పునరావృతమైంది. అతని ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. ఇదేదో అంతుపట్టని 'మిస్టరీ'లా ఉందే అనుకున్నాడు. మూడో రోజు కూడా అదే పిలుపువస్తే మళ్ళీ అలాగే - అతి వేగంగా- అటూ ఇటూ తిరిగి చూశాడు. ఇంతలో "అలా చూస్తారేమిటి, నేనండీ పలకరించేది? మర్యాదగా పలకరిస్తే జవాబివ్వరేమిటి?" అని వినబడింది. ఎక్కడా ఎవరూ కనబడడం లేదు. మరి ఎక్కడనుంచి వస్తున్నాయి ఈ మాటలు చెప్మా అనుకున్నాడు. "ఎవరు మాట్లాతున్నది! ఎదురుగా కనబడరేం!" అని పైకి అనేశాడు. "ఎదురుగానే ఉన్నాను కదండీ, నేనేనండి టికెట్లమ్మే యంత్రాన్ని మాట్లాడుతున్నాను" అని వినిపించింది. "ఏమిటి, యంత్రమా మాట్లాడు తున్నది! యంత్రం మాట్లాడ మేమిటి!" అన్నాడతను. "టికెట్లమ్మ గలిగే దానిని మాట్లాడలేనేమిటండీ? ఎన్నో ఏళ్ళుగా మిమ్మల్ని చూస్తున్నాను. నిమిషం తేడా లేకుండా రోజూ నా దగ్గరికి వచ్చి వెళ్తున్నారు, అందువల్ల మిమ్మల్ని ఒకసారి పలకరించి మీతో కష్టం, సుఖం చెప్పు కుందామనుకున్నాను" అంది యంత్రం. అతని ఆశ్చర్యం మరికొన్ని డిగ్రీలు పెరిగింది. అంతలో తెరుకొని టికెట్ కలెక్టరు దగ్గరికి పరుగెత్తి "ఏమండోయి' టికెటు యంత్రం మాట్లాడుతోంది, చూశారా, ప్రపంచంలో ఎనిమిదో వింత!" అని చెప్పాడు. "నిజం, కావలిస్తే వచ్చి వినండి" అని ఆయనని ఆ యంత్రం దగ్గరికి తీసుకు వచ్చాడు. మరి కొందరు కూడా అటు వచ్చారు. "అదేమిటండీ, మీతో మాట్లాడుదామనుకుంటే వారి నందరినీ తీసుకు వచ్చారేమిటి?" అంది యంత్రం. "అదుగో మాట్లాడుతోంది, వినిపించడం లేదూ" అన్నాడట గుమాస్తా. కాని వారెవరికీ వినిపించ లేదు. "ఎవడో పిచ్చి వాడులా ఉన్నాడు" అనుకొని నవ్వుకుంటూ వెళ్ళి

పోయారట పై వాళ్లు. గుమాసా చిన్న బుచ్చుకున్నాడట, "నేనేమీ పిచ్చి వాడిని కాను. కాని నాకు వినిపించి వాళ్ళకి వినబడక పోవడ మేమిటి?" అన్నాడట పైకే. "అవునండీ, వాళ్ళకెలా వినిపిస్తాయి? మీ రంటే అచ్చు నాలాగే పని చేస్తున్నారు, జీవితం గడుపుతున్నారు. అందువల్ల మీరంటే నాకు ఆత్మీయత, సరిగా నావంటి వారే కాబట్టి నా మాటలు మీకే వినిపిస్తాయి" అందట యంత్రం.

నేటి మనుష్యుల్లో అధిక సంఖ్యాకుల యాంత్రిక జీవితాన్ని దృష్టికి తెచ్చే తమాషా కథ. మీరే పరిశీలించండి, మీ చుట్టు ఎంత మంది అటువంటి జీవితాలు గడుపుతున్నారో!

ప్రసిద్ధ ఉర్దూ కవి అక్బర్ 'ఇలాహాబాదీ' అన్నాడు;

'హమ్ క్యాకహేఁ, అహబాబ్ క్యా కారే నుమాయేఁ కర్ గయే;
బి.ఏ. హుయే, నౌకర్ హుయే, పెంషన్ మిలీ, ఫిర్ మర్ గయే.'

(మిత్రులేమి ఘన కార్యాలు చేశారంటే ఏమి చెప్పను? బి.ఏ చదివారు, ఉద్యోగం చేశారు, పింఛను తీసుకున్నారు, ఆ పైన చని పోయారు.)

చనిపోయిన తరువాత మొదటి రోజుల్లో ఏడుపులు తప్ప, తరు వాత ఆత్మీయులు కూడా ఎప్పుడూ తలుచుకోనట్లా జీవితం గడపడం? మనిషన్న తరువాత మన జీవితానికి కొంచెమైనా విలువ ఉండొద్దూ? మేడలూ, మిద్దెలూ, బాంకు బాలన్సులూ, నల్ల బంగారం, తెల్ల బంగారం విడిచిపెట్టి వెళ్తేనే విలువా? వాటిని పూర్తిగా కొట్టివేయం కాని, మని షిగా ఫలానా ఆయన **జీవితం ఎంత** వరకు రుజువైంది, **అది** చుట్టు ఇతర జీవితాలమీద **ఎంత వరకు** ఏవిధమైన ప్రభావం చూపింది అన్నది

ముఖ్యం కాదా? ఎందుకంటే ఆ ప్రభావమే సమాజానికి అతని నిజమైన కానుక. ఆ ప్రభావంలోనే అతను జీవిస్తాడు. 'ఆహార, నిద్రాభయమైధునంచ, సామాన్యమేతత్ పశుభిర్నరాణాం" అన్న సంస్కృత శ్లోకంలో చెప్పినట్లు మనం చేసే వ్యాపారాలన్నీ-తినడం, తిరగడం, శ్రమించడం నిద్రించడం, శారీరిక సుఖం అనుభవించడం-పశువులూ చేస్తున్నాయి. మరి మన ప్రత్యేకత ఏమిటి? ఉంది, అది మనిషి మనస్సు. అది అతని వ్యాపారాల్లో ఏదో కొంత మార్పు తీసుకు వచ్చితీరుతుంది. ఆవు ఉందను కోండి. అది తనకి లభించిన ఆహారాన్ని తింటుంది. కాని మనిషి అలాకాదే, ఏదో ఆహారం అని ఊరుకోడు, రకరకాల పదార్థాలు తెచ్చి రకరకాలుగా వండి, షడ్రుచులూ ఆనందించాలని చూస్తాడు. పశువు ఎక్కడో అక్కడ ఉంటుంది, విశ్రమిస్తుంది. కాని మనిషి అలా కాదు, తల దాచుకుందుకు ఏచోటైతేనేం అని ఊరుకోడు, రకరకాల డిజైన్లతో ఇళ్లు కడతాడు, వాటిని ఎంతో అందంగా తీర్చిదిద్దుకుంటాడు. కాని కొందరు ఏమాత్రం ప్రయత్నం చేయకుండా, బ్రతకక తప్పదు కాబట్టి ఎలాగో అలాగ బ్రతుకు గడిపి వేస్తూ ఉంటారు. జీవితానికి వారి చ్చేది ఏమీ ఉండదు సరి కదా, జీవితం నుంచి పొందగలిగింది కూడా వారు పొందలేరు. జీవితంలో ఎంత పోగొట్టుకుంటున్నామో వారెప్పుడైనా వెనక్కి తిరిగి చూసుకున్నారా? జీవితంలో అందముంటుందనీ, చంద ముంటుందనీ వారికి స్పృహే కలుగదు. వారెలా బ్రతికితే మనకి పోయేదేమిటి అనవచ్చు కాని ఒక సమాజంలో వ్యక్తులు అతితక్కువ స్థాయిలో బ్రతుకుతూంటే అ సమాజమూ అతితక్కువ స్థాయిలోనే ఉంటుంది. అస్తిత్వం కూడా నిలుపుకోలేక పోతుంది.

న్యూయార్కు నగరంలో ఒకడు సాయంత్రం ఏమీతోచక హడ్సన్ నది ఒడ్డుకు పోయాడట. అప్పుడే సూర్యాస్తమయం కాబో

తోంది. ఆకాశమంతా పసుపు, కుంకుమా విరజిమ్మినట్లుంది. మబ్బులు బంగారు శకలాల్లా మెరిసిపోతున్నాయి. మబ్బుల్లోనుంచి సూర్యకిరణాలు చీల్చుకుపోయి అనంతంలోకి విస్తరిస్తున్నాయి. నదిలో ఓడల నీడ బొమ్మలు పైన కాంతిమయ దృశ్యాన్ని మరింత ప్రభావవంతం చేస్తున్నాయి. క్రింద నదీజలాలు వెండి కరిగించిపోశారా అన్నట్లున్నాయి. ఆ దృశ్యంచూసి అతడు ఆశ్చర్య చకితుడయ్యాడు. అమితానందంలో మునిగిపోయాడు. తరువాత చుట్టుచూశాడు.ఎవరూ ఆదృశ్యాన్ని పట్టించుకోవడం లేదు. ఎవరి పనుల్లోవారు లీనమై ఉన్నట్లున్నారు. అతనికో ఉపాయం తోచింది. దినపత్రికలలో ఒక ప్రకటన వేయించాడు. "ప్రపంచంలోకెల్లా అత్యద్భుతమైనప్రదర్శన. ప్రవేశం ఉచితం.హడ్సన్ నది ఒడ్డున,-వద్ద, సాయంత్రం గం 5-30 లకు" అని. అత్యద్భుత ప్రదర్శన అంటున్నారు, ప్రవేశరుసుం లేదంటున్నారు అని జనంవందల సంఖ్యలో ఆవ్యక్తి చెప్పినచోటికి వచ్చారు. కాని వారికక్కడ ఏ ప్రదర్శన ఏర్పాట్లు కనబడలేదు. 'ఎవడో మనమీద ప్రాక్టికల్ జోక్‌వేశాడు, మనల్ని మూర్ఖుల్ని చేశాడు' అనుకొని ఎవరిదారినవారు పోబోతుండగా, ఎవడో అరిచాడట "అదుగో అటు ఆకాశంవేపు చూడండి ఎంత అద్భుతంగా ఉందో!"అందరూ అటుచూశారు. ఆదృశ్యం చూస్తూ తన్మయులై ఉండిపోయారు కొంత సేపు. అప్పటినుంచీ రోజూ సాయంత్రం జనం అక్కడికి రావడం,ఆదృశ్యాన్ని చూసిఆన ందించడం ప్రారంభమైందట.

మనలో కొందరు కుడితిలోబడ్డ ఎలుకల్లా జీవితంలో పడి కొట్టుకుంటూ, సులభంగా లభ్యమయ్యే అందం ఆనందంకూడా ఎరగకుండా పొద్దుగడిపేస్తుంటాము. 'రేపు పిడచ అన్నం ఎక్కడ దొరుకుతుంది, ఈరాత్రి ఏ రోడ్డుపక్క పడుకోవాలి' అని బ్రతుకే ఎడారి పయనంలా సాగే నిర్భాగ్యుల మాట వదిలేయండి. కొంచెం ప్రయత్నిస్తే జీవితాన్ని

మరికొంచెం తరచిచూడడానికీ, జీవితానికి ఏదో ఇవ్వడానికీ వీలుండి కూడా ఆ ప్రయత్నం చేయని వారిని గురించే మాటాడుకుంటున్నాం. పశువుకీ మనిషికీ తేడా ఉండాలంటే కళా, సంగీతం, సాహిత్యం వంటి వాటిల్లో కొంచెమైనా ఆసక్తి ఉండాలి. వాటిలో ఆసక్తి కనబరచడంవల్ల ప్రయోజనం ఏమిటంటే, తామేమీ చేయలేకపోయినా అటువంటివి ఆనందించడం ద్వారానే వాటికి ప్రోత్సాహం కలగజేసినట్లవుతుంది. ఆ విధంగా సమాజజీవితం సుసంపన్నం కావడానికీ, సంస్కృతీ వారసత్వం పెరగడానికీ తోడ్పడినవారమవుతాం. అదికూడా సమాజం పట్ల మన బాధ్యత కొంత నెరవేర్చినట్లే, ఋణం కొంత తీర్చినట్లే. అంతేకాదు సున్నితమైన హృదయం కలవారు-కళా, సంగీతం, సాహిత్యాదివాటిల్లో అభిరుచి కలగాలంటే హృదయం కొంత సున్నితమై ఉండవలసిందే-తమ చుట్టుఉన్న దుర్భరదారిద్ర్యం, దారుణబాధలూ, ఘోరాలూ చూసి కలత చెందకుండా ఉండలేరు. ఒక సమాజంలో అధికాంశం వ్యక్తులు తమ వ్యక్తిగత జీవితాల్లో మునిగిపోయి తమచుట్టు జరుగుతున్న జీవితాల్ని పట్టించుకోక పోవడం వల్లే సమాజం అసంఖ్యాక నిర్భాగ్యుల పట్ల తనబాధ్యత నెరవేర్చలేక పోతోందేమో అనికూడా తోస్తుంది.

కళా, సంగీతం, సాహిత్యం వాటి ఆస్వాదన రూపాయి, పైపైన్లో మనకి లాభకరంగా తోచకపోవచ్చు. వాటి ప్రయోజనం అదృశ్యమైనది. కాని మన జీవితాల్ని ప్రభావితం చేసేదీ, ఉన్నతం చేసేదీని. కనీసం దానివల్ల మనకేమీ నష్టం లేదు కదా. మేం సినిమాలు చూస్తున్నాం, ఈ నాటి సినిమాల్లో కళేమిటి, సంగీతమేమిటి, సాహిత్యమేమిటి సమస్తం ఉంటున్నాయి కదా అనవచ్చు. సినిమా అన్నిటిని కలుపుకునే విచిత్ర మైన మిశ్రమమే. కాని సినిమాల్లో అధికాంశం పగలల్లా కష్టపడి సాయంత్రం కొంతసేపు మైమరచి పడిపోవడానికి గ్లాసెడు సారాయి

ఎలాగో అలా తయారవుతున్నాయి. అలాంటి వాటివల్ల డబ్బులు వచ్చే వారికి డబ్బులు వస్తున్నాయి - అందులో కూడా కొంత లాటరీ లాంటిది ఉందను కోండి - కాని వాటివల్ల సమాజానికి మేలుకన్నా హానే ఎక్కువ. ఎందుకు తీస్తున్నారయ్యా అంటే చూసేవారు చూస్తున్నారు కాబట్టి అంటారు. మీరెందుకు చూస్తున్నారయ్యా అంటే తీసేవారు తీస్తున్నారు కాబట్టి అని జవాబు వస్తుంది. అదంతా ఒక విషవలయం లాంటిది. ఈ విషవలయాన్ని ఛేదించుకొని ప్రజలకేమైనా కొంచెం మంచి ఇద్దామని ఇటీవల కొందరు ప్రయత్నిస్తున్నారు. కాని వారి ప్రయత్నం వరద కెదురీదడంలా అవుతోంది.

ఇక్కడే మనం కళాసంగీతం సాహిత్యం వంటి వాటివిషయంలో కొన్ని భేదాలు గుర్తించుకోవడం మంచిది. ఇంగ్లండులో ఆమధ్య ఒక విమర్శకుల బృదం ఉండేది. ఏదైనా నవల అధిక ప్రజాదరణ పొందిందంటే దానిలో చౌకబారుతనం ఉందన్న మాటేనసి,సాహిత్య లక్షణాలు కొరవడినట్లేనని తీర్మానించుకునేవారట. ఇది మరీ తీవ్రదృక్పథం. ఒక్కొక్క రచన పండితుల్నీ, పామరుల్నీ అలరించవచ్చుగదా. కాని అటువంటి తీవ్రమైన ప్రమాణాల్ని వాడితే తప్ప సాహిత్యం భ్రష్టం కాకుండా కాపాడలేమని వారి అభిప్రాయమంట. వారి మాట అలా ఉంచి, మనల్ని కిచకిచలు పెట్టి, ఓ్రథ మంగలి ఒళ్ళు పట్టినట్లు హాయికలగ జేసి మన కలల్ని కవ్వించి. మనల్ని సంతోష పెట్టడానికి తాపత్రపడ్డారంటే ఎందుకోసం ? ఆ విధంగా నాలుగు డబ్బులు సంపాదించడానికే కదా. ఇలాంటి సాహిత్యం వగైరా కోకొల్లలుగా వస్తున్నాయి.

మరొక రకం ఉంది, మీ డబ్బులు గుంజడం దాని లక్ష్యం కాదు. కాని మీ మనస్సును వశం చేసుకోవాలని చూస్తుంది. కప్పు కాఫీలా, పెగ్గు సారాయిలా, సిగరెట్టులా మీకు క్షణికోత్తేజం, ఉత్సా

హం కలగజేస్తుంది, కాని మీకొక అలవాటు కలగజేసి అది లేకపోతే గిలగిల లాడేటట్లు చేస్తుంది. అంతేకాక సారాయిలా అంతకంతకు మిమ్మల్ని వ్యసనానికి బానిసగా చేస్తుంది. ఇంకా మరొక రకం ఉంది. భంగ్‌లా, ఎల్. ఎస్. డి లా మిమ్మల్ని పిడికిలిలో చిక్కించుకొని నలిపి నాశనం చేస్తుంది.

ఉత్తమమైన కళా, సంగీత, సాహిత్యాలు మన నుంచి ఏమీ ఆశించవు. జయదేవుడూ, మీరాబాయీ, అన్నమాచార్యులూ, త్యాగరాజూ, రామదాసూ వీరు ఏమి ఆశించి ఆ అమరమైన సంగీతాన్ని సృష్టించారు? కాళిదాసూ, షేక్స్పియరూ, మిల్టన్, వర్డ్స్‌వర్త్, బైరన్, కీట్స్, షెలీ, రవీంద్రనాథ్ టాగూరు వీరు పేరు ప్రతిష్టలకోసం, ఆస్తులు సంపాదించడంకోసం రచనకి పూనుకున్నారా? మన దేశం నిండా అపార, అపురూప శిల్ప సంపదని సృష్టించిన శిల్పు లెవరో మనకి తెలియదే. ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తే అజంతా కుడ్య చిత్రాల చిత్రకారులెవరో మనకి తెలియదే. ఈ కళా సంగీత సాహిత్యాలు మనల్ని వశం చేసుకుందుకూ, బానిసలుగా చేసుకుందుకూ ప్రయత్నం చేయవు. అవి మనల్ని విముక్తులుగా చేయడానికే, ఉన్నతులుగా చేయడానికే ప్రయత్నిస్తాయి. కాని వాటితో ఒక చిక్కు ఉంది. అవి మన కోసం దిగిరావు. మనమే పైకి ఎక్కాలి, కొంత కష్టం పడాలి. ఈ కష్టాన్నీ, శ్రమనీ తలచుకొని వీటినుంచి విముఖులం కాకూడదు. అందని ద్రాక్షలు పులుపన్నట్లు అవుతుంది. ఈ శ్రమా కష్టం మరీ ఎక్కువ కాదు. కొంచెం ఓపికా, అవగాహనా ఉంచేచాలు. సినిమా పాటల్లా త్యాగరాజు కీర్తనలు మనల్ని ఆకర్షించక పోవచ్చు. కాని కర్నాటక సంగీతం గురించి కొంచెమైనా తెలుసుకొని, కొన్నిసార్లు ఓపికతో ఆ కీర్తనలు వింటే మన హృదయం ఆ సంగీతానికి మెల్లగా విచ్చు

కుంటుంది. కొద్దిపాటి అవగాహనా, ఓర్పూ, పట్టుదలా, శ్రమా, ఆ పైన మన ముందు తెరచుకునేది, మానవ జన్మని సార్థకం చేసే ఒక అలౌకిక సుందర ప్రపంచం.

ఇదే చాలదు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ఒక అమెరికన్ రచయిత్రి కృషిని సమీక్షించిన వ్యాసంలో ఆమె రాసిన కథని గురించి రెండు వాక్యాలు చదివాను- ఆ కథ చదవలేదు. కథపేరు 'జూపిటర్స్ మూన్స్' (జూపిటరు చంద్రులు - భూమిలా కాక జూపిటర్‌కి 12 చంద్రులున్నారు) ఒకాయన కాన్సర్‌తో బాధపడుతూ ఉంటాడు. చివరి దశ. డాక్టర్లు ఆయనకు కొద్ది రోజులే సమయమిచ్చారు. ఆ విషయం ఆయనకీ తెలుసు. ఆయన కూతురుకీ తెలుసు. అమె తండ్రి నేవిధంగా ఓదార్చగలదు? తన హృదయాన్ని వికలం చేస్తున్న బాధనెలా అదుపులో పెట్టుకోగలదు? ఆమె కొక ఆలోచన తోస్తుంది. తండ్రిని జూపిటర్ (గురు) గ్రహానికి ఎన్ని చంద్రులో తెలుసా అని అడుగుతుంది. తెలుసునని ఆయన జూపిటర్ విశేషాలు చెపుతాడు. మెల్లగా వారి సంభాషణ సూర్యకుటుంబం గురించీ, నక్షత్రమండలం గురించీ, విశ్వం గురించీ సాగుతుంది. ఆ విధంగా తమ కష్టాన్ని ఒక 'పెర్‌స్పెక్టివ్' (పరిదృశ్యం)లో పెట్టుకొని ఆ కష్టాన్ని సహించే శక్తి కొంచెం కూడగట్టు కుంటారన్నమాట.

ఒక్కసారి ఆలోచించండి. మన భూమి సూర్యుడికి ఉపగ్రహం. సూర్యుడు పది లక్షల భూములంత పెద్దవాడు. స్వయం ప్రకాశవంతమైన నక్షత్రం. కాని మన నక్షత్ర వీథి (గెలాక్సీ) 'పాలపుంత'లో ఉన్న కోట్ల కొద్దీ నక్షత్రాలలో ఒక చిన్న నక్షత్రం మాత్రమే. ఇటువంటి నక్షత్ర వీధులు వేల కోట్లు ఉన్నాయంటారు. ఇంకా కొత్తవి కనుక్కుం

టున్నారు. మనకి మిక్కిలి దగ్గర నక్షత్రం నుంచి వెలుతురు రావడానికే - సెకనుకి లక్షా ఎనభై ఆరు వేల మైళ్ళ వేగాన - నాలుగు సంవత్సరాలు పడుతుంది. దానిని నాలుగు కాంతి సంవత్సరాల దూరం అంటారు. ఇంతకు ముందు చెప్పిన లెక్కని బట్టి ఈ విశ్వం ఎంత విశాలమో ఆలోచించండి. సౌర కుటుంబం పరిమాణామాన్ని బట్టే మన జీవితాలు అతి శక్తిమంతమైన మైక్రోస్కోపు క్రింద కదలుతూ కొట్టుకుంటూ దర్శనమిచ్చే సూక్ష్మజీవుల జీవితాల లాంటివన్నమాట. ఈ ఆలోచన రాగానే ఏమిటి మన అసూయాద్వేషాలూ, తాపత్రయాలూ, హత్యలూ, యుద్ధాలూ అనిపిస్తుంది. ప్రసిద్ధ ఇంగ్లీషు రచయిత జొనాతన్ స్విఫ్ట్ 'గలివర్ ట్రావెల్స్'లో ఒకసారి మానవుల్ని పదింతలు పెంచి (60 అడుగుల బ్రాబ్డింగ్‌నాగియన్స్‌గా) చూపిస్తాడు. ఆ భాగం చదివితే మానవుడి చేష్టలు మనకి వికృతంగా, అసహ్యంగా కనిపిస్తాయి. తరువాత స్విఫ్ట్ మానవుడిని చిన్న చేసి (ఆరంగుళాల లిలీపుటాన్స్‌గా) చూపిస్తాడు.ఆ స్థాయిని మన చేష్టలు-చీమలూ, ఇంకా చిన్నకీటకాల చేష్టలులా - మనకే నవ్వు పుట్టిస్తాయి. తేలిక భావం కలిగిస్తాయి. (స్విఫ్ట్ నిజానికి మానవ ద్వేషి. ఆయన ఉద్దేశ్యం మనకి వినోదం కలిగించడం కాదు. మానవుడి జీవితంపై రోత కలిగించడం. కాని చిత్రంగా ఆయన ఈ పుస్తకం అత్యంత వినోద దాయకమైన పుస్తకం గా-ముఖ్యంగా బాలల పుస్తకంగా - ప్రజాదరణ పొందింది. అది వేరే విషయం. మూలం ఉన్నదున్నట్లు చదివితే కలిగే భావం వేరు) అప్రస్తుత ప్రసంగాలా ఈ నక్షత్రాలూ, విశాల విశ్వమూ వంటివాటిని ఎందుకు ఎత్తుకున్నానంటే మన జీవితాల్ని, మొత్తం మానవ జీవితాన్ని ఒక 'పెర్స్పెక్టివ్' (పరిదృశ్యం)లో పెట్టుకొని చూడడానికే. రాత్రిళ్ళు, రోజూ అక్కర్లేదు, అప్పుడప్పుడైనా ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు నక్షత్రాల

కేసి తల ఎత్తి చూడండి. నక్షత్రాలూ, రాసులూ గురించి కొంచెం సమాచారం సంపాదించి ఆ నక్షత్రాలూ వాటి గమనం - నిజంగా వాటి గమనం కాదు, మన భూమి గమనమే - గురించి ఒక్క పదిహేను నిమిషాలు ఆలోచిస్తూ చూడండి. ఇందులో ఏమీ ఖర్చు లేదు కదా. ఆ పదిహేను నిమిషాలలో మనల్ని మనం మరచిపోతాం - అసలు మానవుడి విజ్ఞాన ప్రారంభం ఈ నక్షత్ర పరిశీలన నుంచే బయలుదేరిందని గుర్తుంచుకోండి. (లాంసిలాట్ హాగ్బెన్ 'మాతమేటిక్స్ ఫర్ ద మిలియన్', 'సైయన్స్ ఫర్ ద సిటిజన్' అన్న పుస్తకాలు చదవడం బాగుంటుంది. కాని దురదృష్టవశాత్తూ అవి ఇంగ్లీషులోనే ఉన్నాయి - వాటికి తెలుగు అనువాదాలు రాలేదు.) - ఇలా అప్పుడప్పుడు నక్షత్ర వీధిలో విహరించడంవల్ల ఏమిటి ఈ సృష్టి? ఎక్కడ నుంచి ఎక్కడికి పోతుంది? మానవుడి జీవితం అర్థం ఏమిటి? అన్న ప్రాథమిక ప్రశ్నలు బయలుదేరుతాయి. మానవుడికి తన మనస్సే అద్భుతమైన వరం. అప్పుడప్పుడైనా పైన చెప్పినటువంటి జిజ్ఞాస కలగడం మన మనస్సునే మరి కొంత పరిశోధించుకున్నట్లు, వాడుకున్నట్లు అవుతుంది. ఈ అనుభవం తరువాత మనం మాములు జీవితానికి తిరిగి వచ్చిన పిమ్మట మన ఆత్మశక్తి లాంటిదేదో మళ్ళీ పుంజుకున్నట్లు అవుతుంది. కొందరు ధ్యానం, భావాతీత ధ్యానం వగైరాలు చేయమంటారు. వాటిని నిరసించడం కాదు, కాని మీరు అప్పుడప్పుడు - ఆర్నెల్లకో ఏడాదికో గాక - రెండు రోజుల కొకసారైనా క్రమబద్ధంగా పైన చెప్పినట్లు చేస్తూ ఉండండి చాలు, మీకే ఒక అపూర్వమైన అనుభూతి కలుగుతుంది. (మీ దినచర్యలో దీనిని గురించి ప్రముఖంగా గుర్తు పెట్టుకొని ఆచరించండి.)

కాని చాలామంది ఏ ఖర్చులేని ఈ చిన్నపనైనా చేయడానికి ఇచ్ఛగించక జీవిత ప్రవాహంలో పడి కొట్టుకుపోతూనే ఉంటారు.తమకి

కనిపించేదెల్లా నిజంకాదని అప్పుడప్పుడు దాఖలాలు తోస్తున్నా, అదే నిజమన్నట్లుగా వ్యవహరిస్తూ ఉంటారు. లేనిపోని కలతలూ, కార్పణ్యాలూ పెంచుకుంటూ పోతారు. ఒక ఉదాహరణ చూడండి. ఒకడు ఒక తాడు చివర రంగుబంతి కట్టి వేగంగా గిరగిరా తిప్పాడనుకోండి. అప్పుడు మనకి ఆ రంగులో పెద్ద గుండ్రని వస్తువు(తాడు పొడవే అర్ధవ్యాసంగా గలది) ఉన్నట్లు కనిపిస్తుంది. కాని నిజంగా ఆ గుండ్రని వస్తువు ఉందంటారా ? ఆ వ్యక్తి తిరగడం మానేస్తే అది మాయమైపోతుందే. మిగిలేది ఆ తాడూ, బంతేనే. అలాగే పదార్థానికీ మూలమైన అణువు కూడా. అందులో కొంత అవకాశంలో తిరిగే శక్తి కణాలు (ఎలెక్ట్రాన్లూ, ప్రోటాన్లూ, న్యూట్రాన్లూ, తప్ప మరేమీ కాదు. పరమాణువును బద్దలుచేస్తే ఎంతశక్తి వస్తుందో ఎంత వినాశం చేయగలదో (ఆటంబాంబు) ఆలోచించండి. విశ్వవిఖ్యాతి గాంచిన భారతీయ శాస్త్రజ్ఞుడు జయంత్ విష్ణు నార్లికర్ మన భూమిలోని పదార్థం కూలిపోతే అది .8 సెంటీమీటర్ల వ్యాసంకల పిండంలా అయిపోతుందన్నాడు. అప్పుడు పదార్థపు సాంద్రత ఎంత ఎక్కువగా ఉంటుందంటే కాంతిని పట్టివేసి లోపలకు లాగుకొని 'బ్లాక్ హోల్' (నల్లరంధ్రం)గా మారిపోతుందన్న మాట. ఇప్పుడు చెప్పండి మనం కళ్ళకి కనిపించే దానిని ఎలా తీసుకోవాలో. మానవ జీవితానికి పొంచిఉన్న అపాయాలు అప్పుడప్పుడు మన కళ్ళు తెరిపిస్తూ ఉంటాయి, కాని మనం అంతలోనే మరచిపోతాం. మానవుడు స్వయంగా సృష్టించుకునే హత్యలూ, ముకఉమ్మడి హత్యలూ, యుద్ధాలూ భోపాల్ విషవాయువు సంఘటనలూ వంటివి అలా ఉంచండి. 1977 నవంబరులో దివిసీమలో వచ్చిన ఉప్పెన తలచుకోండి. క్షణాలమీద వేలాది చచ్చిపోయారు. ఆ దారుణదృశ్యాల వర్ణనలు ఇప్పటికీ పాఠకులకు జ్ఞాపకం ఉండే ఉంటాయి. 1970లో తూర్పు పాకిస్తాను (ప్రస్తుతపు బంగ్లాదేశ్)

తీర దీవులమీదికి విరుచుపడిన ఉప్పెనలో సుమారు పదిలక్షల మంది చచ్చిపోయారు. 1923లో టోకియోలో వచ్చిన భూకంపమూ, సుమారు పదేళ్ళ క్రిందట చైనాలో టియెన్‌స్టెన్‌లో వచ్చిన భూకంపాల్లో లక్షకు పైగా జనం చొప్పున చచ్చిపోయారు. ఇటీవల పెరిగిపోతున్న ప్రమాదాల దృష్ట్యాకూడా మన జీవితాల్ని గురించి మనమే ధీమాగా చెప్పలేం. మన అంచనాలూ, ఆశలూ అన్నీ తలక్రిందులు కావచ్చు.'చంద్రాలోకం' అన్న సంస్కృతపు అలంకారగ్రంథంలో కవి ఇది చాలా చక్కగా చెప్పాడు. తేనే తాగుతున్న తుమ్మెద సూర్యుడు అస్తమించగానే రేకులు ముడుచుకు పోవడం వల్ల పద్మంలో బందీ అయిపోతుంది. అది అనుకుంటుందట 'రాత్రి గడచిపోతుంది. ఉదయమవుతుంది సూర్యుడు ప్రకాశిస్తాడు. తామర రేకులు విచ్చుకుంటాయి. అప్పుడు నేను నా చెలి చెంతకి చేరుకోగలను'. మూడుపాదాల్లో పైకథచెప్పి కవి నాలుగోపాదంలో 'హాహంత, హంత నళినీం గజ ముజ్జహార' (అయ్యో, అయ్యో ఏనుగు తామరపువ్వును పీకేసింది) అంటాడు. నిజానికి మన జీవితం ఇంగ్లీషులో అన్నట్లు పలచటి మంచుపొర మీద జారుతూ పోవడం లాంటిది. కాని మనకి ఎదురుదెబ్బ తగలనంత వరకు ఆపదలూ కష్టాలను తలచుకొని మనం నవ్వుకుంటాం. ఇరవైఏళ్ళ లోపు కుర్రవాళ్ల 'ఒరేయి నీకేం భయం లేదురా. నువ్వు చస్తే మేం నలుగురమున్నాం, శ్మశానానికి ఈడ్చేస్తాంలే' అని పరాచికాలాడడం పాఠకులకు తెలిసే ఉంటుంది. కాని ఆపద కాటేస్తే, కష్టం తలక్రిందులుచేస్తే ఈ తేలికతనం, నిర్లక్ష్యమూ నిలబడవు. ఒకమారు ఈ రచయిత మిత్రులు కొందరు గుంటూరు దగ్గర సంగం జాగర్లముడి విహారయాత్రకు వెళ్ళారు. అక్కడ సంగమేశ్వరాలయం ఉంది. దగ్గర్లోనే-బకింగ్‌హాం కాలువే అనుకుంటాను-ఉంది. వారు స్నానానికి దిగారు. వారిలో ఒకడు కొద్దిదూరం ఈదుకు

వెళ్ళాడు. ఏదో కష్టంలో పడినట్టున్నాడు గిలగిలా కొట్టుకొంటూ అరవ సాగాడు. అప్పుడు కాలువలో వడి ఎక్కువగా ఉంది. గాలికూడా జోరుగా వీస్తోంది. తక్కిన వారెవరికీ ఈత బాగారాదు. దగ్గర పల్లె వారెవరో ఉంటే వారిని రక్షించమని కోరితే ఆవడిలో దిగడానికి వార్తూ సిద్ధపడలేదుట. మునిగేవాడికి సాయానికి వెళ్ళేవాడు చాలా బలాఢ్యుడై ఉండాలి. లేకపోతే మునిగేవాడు తన పెనుగులాటలో సాయం చేయ బోయినవాడిని గట్టిగా పట్టేసుకొని ఈదలేకుండాచేసి తనతోబాటు అడు గుకు లాగుకుపోతాడు. చివరికి 'రామం, రామం'అంటూనే ఆ కుర్రవాడు తన స్నేహితుల అందరి కళ్ళముందే మునిగి చనిపోయాడు. ఆ'రామం' అన్నవాడి చెవిలో కొన్ని రోజులపాటు స్నేహితుడి ఆర్తనాదమే గింగురు మంటూ ఉండేది. నాలుగైదు రోజులు క్రిందట ఇండియన్ ఎక్స్ప్రెస్‌లో (ఈవేళ 18-3-85) ఒకామే, ఆమె భర్తా,ఆమె ఏడాది పిల్లవాడూ, తమ 'ఫ్లాటు' మంటల్లో చిక్కుకుపోతే ఆమంటల్లోనే తమ నాలుగేళ్ళ కుర్రవాడుకూడా చిక్కుకొని పోగా నిస్సహాయంగా చూస్తూ ఉండి పోయిన దృశ్యం ఫోటోవేశారు. అది మనల్ని కుదిపివేస్తుంది. అనుభవం కలిగిన తరువాత,జ్ఞానోదయంకన్నా వివేకవంతుడుతనపరిశీలన ద్వారానే జీవిత సత్యాలను గ్రహిస్తాడు. అతడికీ కష్టసుఖాలు ఉంటాయి. కాని తలక్రిందులై మునిగిపోడు. అటూ ఇటూ ఒరుగుతూ తన సమతూకం తిరిగి సంపాదించుకుంటాడు. మామూలప్పుడు మనకుండే భావావేశాలూ అభిప్రాయాలూ ఎంత డొల్లలో శరత్‌బాబు (ప్రఖ్యాత బెంగాలీ నవలా రచయిత అని మీకు తెలుసు కదా) ఒక కథ చెప్పాడు ఆయన బర్మాలో ఉండగా ఒక మిత్రుడుండేవాడట ఆమిత్రుడి భార్య అపురూప సుందరిట. ఆ మిత్రుడు తన భార్య సౌందర్యాన్ని గ్రోలుతూ బయటి ప్రపంచం మాటే మరచిపోయినట్టుండేవాడట. ఇలా ఉండగా కలరా

వచ్చి ఆ అపురూప సుందరి చనిపోయింది. మిత్రులూ, ఇరుగు పొరుగులూ అతనినోదార్చి "ఇప్పుడు చీకటి పడిపోయింది కదా, ఏమీ చేయలేం, రేపు పొద్దున్న అంతిమ సంస్కారం ఏర్పాట్లు చేదాం" అనివెళ్ళబోతుండగా "దయచేసి విడిచిపెట్టి వెళ్ళకండి. ఆ శవంతో ఒంటరిగా ఉండటం నాకు భయం" అతను అని మొరపెట్టాడట.

'ఏమిటండీ బాబూ, చివరికి వచ్చేటప్పటికి ఇంత వేదాంతంలో ముంచెస్తున్నారు! మాకు జీవితమంతా ఇంకా ఎదరే ఉందండీ, ఇప్పటి నుంచీ జగత్తంతా మాయ అనీ, జీవితం క్షణభంగురమనీ గుర్తించి సన్యాసుల్లో కలిసి పొమ్మంటారేమిటి? అనవచ్చు. ఇక్కడ రెండు పొరబాటు అభిప్రాయాలను ఎత్తి చూపక తప్పదు. వేదాంతమనేది ('తత్త్వవిచారం' అన్నది సరియైన మాట, వేదాంతంకాదు) వయసు మీరిన తరువాత అవలంబించవలసినది కాదు. అది తోక తెగిన నక్క తోక తెగడంవల్ల కలిగే ప్రయోజనాలను ఊహించుకొని సంతృప్తి పడ డం లాంటిది. మన మనోవికాసానికి గుర్తు తత్త్వవిచారము. అది మన జీవితానికి ఒక దిశా, గమ్యమూ చూపిస్తుంది. రెండవది, జీవితం తాత్కాలికమనీ, ప్రమాదాలు పొంచి ఉంటాయన్నది అసత్యమా? జీవితం శాశ్వతం, మనకి ఏ ఢోకా లేదన గలమా? ఈ సత్యం గ్రహించమంటే జీవితాన్ని వదిలి పారిపొమ్మనట్లు కాదే! సత్యాన్ని అర్థం చేసుకోవటం చూసే దృక్పథాన్ని బట్టి కూడా ఉంటుంది. ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత నోబెలు బహుమాన గ్రహీత అనటోల్ ఫ్రాంస్ ఒక కథ చెప్పాడు. ఒక మతాధికారి చర్చి సమావేశంలో మానవ జీవితం ఎంత క్షణికమో, కళ్ళకు గట్టినట్లు వర్ణించాడట. దానితో ఒకడు 'అయ్యో జీవితం ఇంత క్షణికమా, అయితే ఇది అయిపోయేలోగానే అన్నీ అనుభవించెయ్యాలి' అని ఆ క్షణంనుంచీ కంగారుగా ఊళ్లో ఉన్న వేశ్యావాటి

కలూ, మధుశాలలూ, బోజన గృహాలూ సందర్శించడం మొదలు పెట్టాడట. మనమా దారిన పోవద్దు, కాని జీవితం క్షణికం అంటే ఆ ఉన్న 'క్షణాల్నే' విలువైన వాటిగా చేసుకోమని చెప్పడానికే. పరిమితి ఉండబట్టే విలువ అనేది ఉంటుంది. మనకి చావే లేదనుకొండి: ఒక పని ఈ వేళ చేయవలసిన అవసరం ఏముంటుంది, వెయ్యేళ్ళ తరువాతైనా చేయవచ్చు గదా. జీవితం పరిమితం కాబట్టే మన శక్తి సామర్థ్యాలనూ, తెలివి తేటలనూ కనబరచ వలసిన ఆవశ్యకత ఏర్పడుతోంది. ఎంత కాలం బ్రతికాం అని కాదు, ఎలా బ్రతికామన్నదే ముఖ్యం. అందువల్ల మీరు ప్రవాహంలో పుడకలా కొట్టుకుపోకుండా, తల ఎత్తి చూసి, మీ లక్ష్యం, దిశా నిర్ణయించుకొని, అటు వైపు పయనించాలి.

చివర ఒక మాట చెప్పవలసి ఉంది - ఒక్కమాట అంటే సరిగా ఒక్క పదం అని కాదు కదండీ, ఒక విషయ మన్నమాట. మీరు ఆత్మ పరిశీలనం చేసుకోవడంలో గానీ, చుట్టు ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో గానీ మీకు తోడ్పడే అత్యంత ముఖ్య స్నేహితుడు మంచి పుస్తకం. భాషలకు లిపి ఏర్పడిన నాటి నుంచీ మానవుడి అనుభవాలూ, ఆకాంక్షలూ, ఊహలూ, విజ్ఞాన ఫలితాలూ అన్నీ పుస్తకాలలో నిహితమై ఉన్నాయి. పుస్తకాలు చదవడం ద్వారా ఆ ప్రపంచాన్ని మన దగ్గరకి తెచ్చుకుంటామన్న మాట. దాని నుంచి ఎంత పొందగలమన్నది మన శక్తీ, దీక్షా, లక్ష్యం బట్టి ఉంటుంది. మనం మన జీవితంలో మహనీయుల్ని కలుసుకోలేకపోవచ్చు గాని ఎంతటి దూర దేశంలో వ్యక్తినైనా, ఏ కాలం వాడినైనా పుస్తకాల ద్వారా ముఖాముఖి సంభాషించవచ్చు, తెలుసుకోవలసింది తెలుసుకోవచ్చు. ఉత్తేజం పొందవచ్చు. కాని ఒక హెచ్చరిక. పుస్తక మొక్కటే జ్ఞాన సాధనం అనలేము. పరిశీలన ద్వారా కూడా జ్ఞానం సాధించవచ్చు. కాని పరి

శీలన ప్రత్యక్షానుభవానికి పరిమితమవుతుంది. పుస్తకం విస్తృత ప్రపంచాన్ని మన ముందు పెడుతుంది.

కాని పుస్తక పఠనం గురించి కూడా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. కొందరు పుస్తక పఠనం అంటే నవలలూ, సీరియల్స్సూ, కథలూ చదవడమే అనుకుంటారు. అది సరి కాదు. కేవలం మన కుతూహలం తీరడానికో, మనకి వినోదం కోసమో చదివితే అది ఒక వ్యసనం లాంటిదవుతుంది. విజ్ఞానం కోసం చదివినప్పుడే మన పఠనం సమగ్రమవుతుంది. మన జీవితానికి ప్రయోజనకర మవుతుంది. రెండు పక్షాలకూ - వినోదం, విజ్ఞానాలకు - తగు ప్రాధాన్యమివ్వాలి. నవలలూ, కథలూ, కవితలూ, నాటకాలూ వగైరా చదవవలసిందే కాని వాటి విషయంలో అవి మనల్ని ఉన్నతులుగా చేస్తాయా, కిందికి దించివేస్తాయా, మనల్ని బానిసలుగా చేస్తాయా, మన వికాసానికి తోడ్పడుతాయా అన్నది చూసుకోకపోతే పఠనం వ్యసనమే కావచ్చు. ఇక, విజ్ఞానదాయకమైన సాహిత్య పఠనం విషయంలో కూడా జాగ్రత్తలు అవసరం. నిజానికి మరింత జాగ్రత్త అవసరం. నేను గొప్ప గొప్ప గ్రంథాలు చదివాను, నాకు గొప్ప జ్ఞానం ఉంది అనే అహంకారం చోటు చేసుకునే అవకాశం ఉంది. అప్పుడది విజ్ఞానం కాదు. తల క్రిందులై ఒక అతి తీవ్రమైన అజ్ఞానంగా మారుతుంది. మన మనస్సు విశాల మవుతోందా, సంకుచిత మవుతోందా, మనలో సహనం పెరుగుతోందా, అసహనం విజృంభిస్తోందా చూసుకోవాలి. అది అలా ఉంచి చదువు విషయంలో తీసుకోవలసిన మరొక జాగ్రత్త ఉంది. విజ్ఞానం ఒక మహాసాగరం లాంటిది. ఏ చిన్న విషయం తీసుకున్నా దానిమీద వందలాది పుస్తకాలు ఉంటాయి. అన్నీ ఎవరూ చదవలేరు. విచక్షణతో కూడిన ఎంపిక అవసరం. లేకపోతే సముద్రంలో పడి కొట్టుకో

పడంలా ఉంటుంది. తిరిగి ఒడ్డునే పడతాం లేదా మునిగే పోతాం. ఒక లక్ష్యం నిర్ణయించుకొని ఒక తెరచాప పడవ మీద చుక్కాని తిప్పు కుంటూ పోతే అంతు లేదనిపించే మహా సాగరాన్ని కూడా దాట గలుగు తాము. లక్ష్యాన్ని చేరుకోగలుగుతాం. కాని అలా అన్నామని మన ఇష్టమో, కేవలం కుతూహలమో మన లక్ష్యాన్నీ, సంకల్పాన్నీ నిర్ణయిం చేటట్టు చేయకూడదు. అవి మనల్ని పక్కదారి పట్టిస్తాయి. ముందుకి సాగనివ్వవు. నక్షత్రాలు చూసి మన పూర్వీకులు సప్తసముద్రాలు దాటి నట్లు మనం ఉన్నత లక్ష్యాన్ని నిర్ణయించుకొని, ఆ దిశగా పట్టుదలతో పయనించాలి. మన ప్రయాణం ఏ నిలువ నీటి కయ్యలోకో, మురికి కాలువలోకో కాకూడదు. మనతో బాటు పొగమంచును కూడా తీసుకు పోకూడదు. ఎప్పుడైనా సరే, ఏ రంగంలోనైనా సరే మన కృషి మనల్ని ఇంకా పైపైకి తీసుకు వెళ్తుందా లేదా అన్నదే మనకి గీటు రాయి కావాలి.

పుస్తకాలను గురించి ముగించేముందు పాఠకుల్లో కొందరి వైఖరి గురించి చెప్పుకోవాలి. కొందరు కాస్త గంభీర విషయం ఎదురైతే చాలు, కొద్దిపాటి మానసిక శ్రమ చేయవలసివస్తే చాలు 'బోరు' 'పరమ బోరు' అనేస్తారు. వారి 'బోరు' అన్న వ్యాఖ్య నిజానికి పుస్తకాలను గురించి కాక వారిని గురించే తెలియజేస్తుంది. ఏ మాత్రం లోతులేని పాత్రలో ఏ కొంచెం పోసినా ఇట్టే నిండిపోయి, బయటికి పొర్లి పోతుంది. లోతైన పాత్ర ఎంతైనా ఇముడ్చు కుంటుంది. ఈ 'బోరు' అనేవారు లోతులేని పాత్రల వంటి వారన్నమాట. అయితే పుస్తకాలలో కొన్ని 'బోరు' కొట్టేవి ఉండవా, అందరు రచయితలూ సమర్థులే అవుతారా అనవచ్చు. అవును, రచయితలు అందరూ సమాన ప్రతిభా సామర్థ్యాలు కలిగి ఉండరు. కాని పై తరగతి వారు 'బోరు' అనే పుస్తకాలు

ఏమిటో, వారికి నచ్చే పుస్తకాలు ఏమిటో ఒక్కసారి పరిశీలిస్తే దోషం వారిలో ఉందో, పుస్తకాలలో ఉందో ఇట్టే కనిపెట్టి వేయవచ్చు. ఈ మధ్య ఒక సినిమా ప్రభావాన ప్రతి దానినీ 'సుత్తి' అని కొట్టివేయడం జరుగుతోంది. యౌవన ప్రారంభ దశలో ఈ ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. అది యౌవనపు పొంగు స్వభావం అని మనం కొంత సహించవచ్చు. కాని అదే ధోరణి కొనసాగితే మనిషి ఎదగడం ఆగిపోయినట్లే. అందువల్ల విచక్షణ లేకుండా 'సుత్తి' అని వాడినా, అసలు 'సుత్తి' అనే పదం తరచు వాడినా ఇంకా పరిపక్వం కాని మనసు అనుకోవచ్చు. లేదా ఏ మాత్రం కుదురు లేక గాలిలో ఎటుపడితే అటు ఎగిరిపోయే ఈకలాంటి మనస్సు అనుకోవచ్చు. ఇంగ్లీషులో ఇటువంటి తత్వాన్ని 'గ్రాస్‌హాపర్ మైండ్' కూడా అంటారు. మిడత ఇక్కడ కొంచెం కొరికి, ఒక ఎగురు ఎగిరి అక్కడ కొంచెం కొరికి, మళ్ళీ ఎగురు ఎగిరి మళ్ళీ కొంచెం కొరికి పోతూ ఉంటుంది. అలాగన్న మాట. పక్వమైన మనస్సు కలవాడూ, వ్యక్తిత్వం కలవాడూ తన మనస్సును అదుపులో పెట్టుకొని, ఏ పుస్తకాలు చదవాలో తెలుసుకొని, అవి ఎలా చదవాలో చదివి, వాటితో ఏమి గ్రహించాలో అది గ్రహిస్తాడు. ఏ లక్ష్యమూ లేకుండా పుస్తకపఠనం ఏ ప్రయత్నమూ లేకుండా సముద్రంలో పడడం లాంటిదని మరొక మారు గుర్తు చేసుకుందాం.

ఇంతటితో ఆగ కూడదు. కేవలం పుస్తకాలు చదివి అర్థం చేసుకోవడం చాలదు. మీరు చదివిన దానిపై వివేకంతో, విచక్షణతో ఆలోచించి, మీరు గ్రహించిన భావాలను మీ సొంతం చేసుకోవాలి. లేకపోతే పుస్తకాలు బీరువాలో పెట్టుకున్నట్లే మీ మనస్సులో పెట్టుకుంటారన్న మాట. మీరు నడిచే గ్రంథాలయాలవుతారని కూడా చెప్పవచ్చు. అలాంటి వారు చాలామంది కనిపిస్తారు. తరుచు మనస్సులో ఉండే

అలాంటి పుస్తక భాండాగారాలతో బాటు బూజూ, పురుగులూ, బొద్దెంకలూ, ఎలకలూ, చెద పురుగులూ నివాసం ఏర్పరచుకునే అవకాశం ఎంతైనా ఉంది. మన దేశ చరిత్ర చూడండి. ఒకనాడు భారతదేశం రత్నగర్భ, ప్రపంచమంతా చీకటిలో మునిగి ఉండగా జ్ఞానజ్యోతిగా ప్రకాశించినదనీ, సకల శాస్త్రాలకూ, కళలకూ పుట్టినిల్లనీ గొప్ప చెప్పుకుంటాం, కాని తరువాత ఏమైంది? పెరుగుదల ఆగిపోయి, ఎవడువస్తే వాడికి లొంగిపోయి ఏ దేశామూ ఉండనంత కాలం ద్యానంలో మ్రగ్గిపోయింది. ఎందువల్ల? పైన చెప్పినట్లు మనకున్న అపార జ్ఞాన సంపదనంతా బూజూ, బొద్దెంకలూ, చెద పురుగులతో సహా గ్రంథాలయల్లో దాచేసుకుంటూనే ఉండిపోయాం. చీకటిలో ఉన్నాయని చెప్పుకున్న దేశాలు బాగా ముందుకు వెళ్ళిపోయాయి. వాటినందుకో లేని పరిస్థితిలో మనమున్నాం ఈనాడు. ఆ దేశాలు ఎందుకు ముందుకు వెళ్ళిపోయాయి? అవి స్వయంగా ఆలోచించడం, తెలుసు కోవడం మొదలు పెట్టి అతి వేగంగా ముందుకు కదిలిపోయాయి. మనం మళ్ళీ మౌలికంగా ఆలోచించటం మొదలు పెడితే మళ్ళీ వారి కన్నా ముందుకుపోవచ్చు. కాబట్టి ఎంత చదివామన్నది ముఖ్యమే అయినా ఏమి గ్రహించాం, ఏమి ఆలోచించాం అన్నది అంతకన్నా చాలా ముఖ్యం. తన భావాలతో మీ ఆలోచనని అణచివేసే పుస్తకం గొప్ప పుస్తకం కానేకాదు. మీలో ఆలోచనని రేకెత్తించి మిమ్మల్ని స్వయం ప్రకాశవంతులు చేసేదే గొప్ప పుస్తకం. కాబట్టి మీరు బాగా, బాగా ఆలోచించాలి.

పుస్తకాల గురించి చెప్పినదే పరిశీలనకు కూడా వర్తిస్తుంది. ఆలోచన లేని పరిశీలన పరమానందయ్యగారి శిష్యులు చెంబు పడిపోతూంటే చూడడం లాంటిది. కొందరున్నారు చూడండి, పెద్దగా చదువుకొని ఉండరు. కొందరికి అక్షరజ్ఞానం కూడా ఉండకపోవచ్చు.

అయినా వారు నలుగురిలో మన్నన పొందుతారు. ఎందుకంటే వారికి చక్కగా పరిశీలించే నేర్పు ఉంటుంది. పరిశీలించిన దానిని గురించి జాగ్రత్తగా ఆలోచించి గ్రహించే వివేక ముంటుంది. అందుకే వారు చెప్పే దానికి విలువ ఉంటుంది. కాబట్టి పరిశీలనద్వైనా ఆలోచన తప్పక సరిగా కావాలని తెలుసుకున్నాం గదా. కాని పరిశీలనమాత్రం పరిమిత మని ముందే తెలుసుకున్నాం. పుస్తక పఠనం-మన ఓపికని బట్టి-ఎన్నో దేశాలకూ, కాలాలకు తీసుకు వెళ్తుంది కాబట్టే పుస్తక పఠనం గురించి ఇంతగా చెప్పినది. పుస్తక పఠనం ద్వారానైనా, పరిశీలన ద్వారానైనా సంపాదించే జ్ఞానం మనం ఆలోచించి మనది చేసుకుంటేనే నిజమైన జ్ఞానమవుతుంది, దానికి విలువ ఉంటుంది అని మరొక మారు స్పష్టం చేసుకుందాం, ఎప్పుడూ గుర్తు ఉంచుకుందాం.

అయితే ఆలోచనతోనే సరా? ఆ ఆలోచన కర్మల ద్వారా ఆచరణలోకి రాకపోతే అడవిగాచిన వెన్నెలలా వ్యర్థమే అవుతుంది. మీ నడవడిలో మీ చేతలలో ప్రతిఫలించకపోతే మీ ఆలోచన నిష్ప్రయోజన కానట్లే, దానిలో దోషమున్నట్లే. ఈ సందర్భంలో ఏసుక్రీస్తు చెప్పిన నీతి కథ - భయపడకండి, చాలచిన్నదే, మనపుస్తకంలో చిట్టచివర-చెప్పుకుందాం. విత్తనాలు చల్లేవాడు విత్తనాలు చల్లుకుంటూపోతాడు. కొన్ని విత్తనాలు అటూ ఇటూ బండల మీద పడతాయి. అవి మొలకెత్తవు సరికదా, ఇట్టే పక్షుల దృష్టిలో పడతాయి, మాయమైపోతాయి. కొన్ని విత్తనాలు దారిలో పడతాయి. మెత్తని నేలే కాబట్టి అవి మొలకెత్తుతాయి. కాని దారినపోయే మనుష్యులు వాటిని తొక్కుతూపోతారు. కాబట్టి అవి ఇట్టే అణగారిపోతాయి. కాని పొలంలో పడిన విత్తనాలు నీటినీ గాలినీ పీల్చుకొని మొలకెత్తి చక్కని పంటనిస్తాయి, కొందరున్నారు చూడండి, ఈ చెవిలో విన్నది ఆ చెవిలో వదిలేస్తారు. మనసు ఏమైనా గ్రహించే వస్తువు ఉంటేకదా. ఇక మరికొందరు విన్నదానిని

కానీ చదివినప్పుడు కానీ కొంత ఉత్సాహం పొందుతారు. ఏమో చేయాలనుకుంటారు కానీ జీవితంలో ఎదురయ్యే సమస్యలూ వ్యాపకాలూ మూలంగా వారి ఉత్సాహం ఇట్టే అణగారి పోతుంది. వారేమనుకున్నారో కూడా మరచిపోతారు. కాని కొందరు సారవంతమైన భూముల్లాంటి వారు. వారిలో పడ్డ భావబీజం మొలకెత్తి, పుష్పించి గింజకి ఏభై గింజల పంటనిస్తుంది. ఈ పుస్తకం చదివే పాఠకుల మనస్సులు సారవంతమైన క్షేత్రాలవంటివనీ, ఉత్సాహం అనే జలం అందుకొని సస్యశ్యామల మవుతాయనీ ఈ రచయిత ఆశిస్తున్నాడు. ఉత్సాహం కోసం మబ్బుల కోసం ఎదురుచూసినట్లు ఎదురుచూడనక్కర్లేదుకదా.మనహృదయంలోనే ఎన్నడూ ఎండిపోని జల ఉంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవాలి, అంతే. జ్ఞానం ఒక బాధ్యత అని ముందే అనుకున్నాం. పాఠకులు తమ మనస్సులో పండించిన పంట నలుగురికీ తిండి పెడుతుందనీ, సుఖ సంతోషాలు కలగజేస్తుందనీ ఆశించడంలో తప్పులేదుకదా.

'లోకా స్సమస్తా స్సుఖినో భవంతు'

---

* ఆదాయాన్ని మించిన వ్యయం కలవాడే బీదవాడు.
* విజ్ఞుడు అవకాశాలను అన్వేషించడు, సృష్టిస్తాడు.
* తలచుకొని విచారించడం కంటే మరచిపోయి చిరునవ్వు నవ్వు కోవడం మంచిది.
* క్రోధంతో ప్రారంభించినది నగుబాటుతో ముగుస్తుంది.